# భాగవతరసం





ప్రకాశకులు :

శ్రీ వేంకటేశ్వర భక్త సంఘం

నర్సాపురం



# కృతజ్ఞతలు

ఈ 'భాగవతరస' గ్రంథాన్ని 15-12-1981 న

టి. టి. డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు

గౌరవనీయులు శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్‌గారు, ఐ.ఏ.ఎస్.

తూర్పుగోదావరిజిల్లా ఆలవిల్లి మల్లవరం

గ్రామంలో ఆవిష్కరించారు. వారికి

మా హృదయపూర్వక కృతజ్ఞతలు

— గ్రంథకర్త




THIS BOOK IS

PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

"AID TO PUBLISH RELIGIOUS BOOKS".

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ రక్షణ సంస్థ ఈ గ్రం
ముద్రణ నిమిత్తం 3460 రూ॥లు సహాయం చేసింది. వారికి
నా హృదయపూర్వక కృతజ్ఞతలు. — గ్రంథకర్త.

దశమస్కంధము ఎంత వాచో విధేయముగా నున్నవో ఆద్యంత మీగ్రంథమును పరిశీలించినచో భక్తులగు ప్రాజ్ఞులకు విశదమగును. భక్తిరసమునుగూర్చి వెలువడిన ఎన్నియో గ్రంథములను అవగతము చేసికొన్నవారు కావుననే అందందు తులసీదాసు - మధుసూదన సరస్వతి - సూరదాసు మున్నగు మహాకవుల హృదయపరిపాకము ఈ గ్రంథమందు అచటచట మెరపువలె మెఱయుచుండును. అంత పరిణతి పొందిన హృదయము కావుననే రాసక్రీడకు సరియయిన భావము, అనగా రసము పరమాత్మస్వరూపము - తత్సంబంధి క్రీడయే యని వీరు నిర్ణయించిన ఘట్టము చదువుచుండ ఒడలు పులకరింపక మానదు. రాసలో రాధ లేదేయని కనుబడును. కాని పదియారువేల గోపికలయందును రాధాదేవి తేజఃకిరణములే వ్యాపించి పరమాత్మ శ్రీకృష్ణుని సేవించినటులు చేసిన నిరూపణము ఇటు వైష్ణవమునకును, అటు అద్వైత సిద్ధాంతమునకును జీవగర్రి యనిపించుచున్నది.

"అంగనా మంగనామంతరా మాధవో" యని చెప్పబడిన శృంగారఘట్టమునకు పరమపవిత్రతయు, తత్త్వనిర్ణయమును ఈ కావ్యమునకు హృదయస్థానమని నాకనిపించినది. రూపగోస్వామి చెప్పినట్లు గోపికాకృష్ణుల నడుమను, రాధాకృష్ణుల నడుమను నడచిన శృంగారము లౌకికమయిన శృంగారమువంటిది కాదు. కావున మధురరసముగాని అన్యముకాదని

ఇందు చక్కగా నిరూపింపబడినది. ఇది చదువుచున్నప్పుడు లీలాశుకుడు కృష్ణకర్ణామృతములో చెప్పినట్లు "మధురాధిపతేరఖిలం మధురం" అని అనిపింపక మానదు. రాధాకృష్ణులు లౌకికదృష్టిచే ప్రేయసీ ప్రియతములని అనుకొందురు. కాని ఏకాకృతిగా ఘనీభవించిన ప్రేమరసం. అదియే బ్రహ్మానందమని, అది భక్తులకుఅనుభవైకవేద్యమని, అవాఙ్మానసగోచరమని వీరు తేల్చిన తుట్టతుది సిద్ధాంతమును వివరించుటకు మాబోంట్లు అసమర్థులు. ఈ గ్రంథమునకు నాయికా నాయకులగు రాధాకృష్ణులకు నమస్కారములు చేయుచు, ఇట్టి రహస్యములను కరతలామలక మొనర్చిన శ్రీరామనాథంగారు వయసుచే నాకన్న చిన్నవారగుటచే ఇట్లే చిరకాలము భక్తిప్రచారము చేయుటకై రాధా సమేతుడయిన శ్రీకృష్ణపరమాత్మ సంపూర్ణ ఆయురారోగ్యైశ్వర్యములను అనుగ్రహించు గాకయని ఆశీర్వదించుచున్నాను. ఈ గ్రంథము నాద్యంతము చదివిన భక్తలోకము శ్రీరామనాథుగారిని ఎన్నోవిధముల అభినందింపక మానలేరని నా దృఢవిశ్వాసము.

ఇతి శమ్



# పరిచయము

చిన్నతనముననే లౌకిక విద్యారంగమునుండి మనసు మరలి శ్రీరామచిరంతన చింతనానుభవమున భక్తిమార్గము నవలంబించిన శ్రీహరి రామనాథయోగిగారు రచించిన 'భాగవతరస' మను గ్రంథము ఒక వినూతనమయిన మార్గమున నడచినది. 'అవతారిక' యని సాభిప్రాయముగా పేరిడిన తొంబదిపుటల గ్రంథభాగము క్రమక్రమమున చదువరులను చేయిపట్టుకొని ప్రేమసాగరమున దించినట్లయినది. అందలి ఘట్టములు ఏకాదశేంద్రియములకును పదునొకండు సోపానములు కట్టుకొని విభజితమయినట్లు తోచును. వానిలోనే శ్రీవ్యాసమహర్షికృత శ్రీమద్ భాగవతపురాణము, శ్రీమద్ భగవద్గీత, శ్రీరూపగోస్వామిరచిత భక్తిరసామృతసింధువు, ఇతర వైష్ణవపురాణములు, ఉపనిషత్తులు మున్నగువానినుండి యథాసందర్భముగా ఉదహరించుచు, వాని తాత్పర్యమునుగూడ తేటయగు శిష్టవ్యావహారికాంధ్రమున తెలుపుట, రసార్ణవమున అవతరణముచేయు (దిగు) వారికి, తాము దిగుచున్నామని అనిపించకుండగనే దిగుటకు ఉపకరించుచున్నవి.

గోపశ్వాదిపశువులు సయితము మురళీనాదరసానందమున మైమరచి తేలియాడుటను చూపించుచు, నీవేనా వానికంటె తక్కువయుని మానవుని గోపాలప్రేమరసాస్వాదనకు ప్రేరేపించినట్లగుచున్నది.

రాసలీలావివరణమునను, భ్రమరగీతలలో అన్యాపదేశముగా ఉద్ధవుని సంబోధించి బోధించిన సందర్భమునను హిందీ (వ్రజ) భాషాసాహిత్యమునుండియు తెలుగుతాత్పర్యసహితముగా ఉదహరించుట ఎంతేయు సమయసందర్భోచితము, రసపోషకమును. పోతనకృత శ్రీమదాంధ్రభాగవతము నుండి కూడ, ఆయా సందర్భములలో ఉదాహరించియుండిన గ్రంథమింకను హృదయంగమముకాగలదని అనుకొనుట సహజము.

భోగిపండ్లుపోయించు తెలుగునాటగల ఆచారమును చిన్నికన్నయ్యపట్ల అన్వయించుచు, యోగిగారి తల్లి రచించిన 'గోపికాభక్తి' యను ఆధ్యాత్మికనాటికతో గ్రంథము ముగించుటద్వారా గ్రంథము చెప్పినదానిని చెప్పకుండ ఆచరణలోనికి తెప్పించుట యుక్తియుక్తము.

ఆయా విషయములను వివరించునపుడు యోగియగు గ్రంథకర్త ఆయా ఘట్టములందు తల్లీనుడై, తన్మయుడై, విహ్వలుడై 'గోపాలా', 'కృష్ణా' యని సంబోధించుచు, కృష్ణభక్తిరస సాగరమున మైమరచి మునకలు వేయుచున్న సందర్భములలో రచయితకుగల 'భక్తి' మనకు వ్యంగ్యవైభవమున గోచరించును.

మహాభక్తియుక్తుడయిన యిట్టి గ్రంథకర్త లేఖినినుండి భక్తిప్రబోధకమగు గ్రంథము లింకను వెలువడి నవనాగరికత పేరిట అపమార్గమున పోవు మానవసమూహములను భక్తి

మార్గమునకు మరలించి జీవితపరమార్థసాధనకు దర్శకములు కాగలవని మనము విశ్వసింపవచ్చును.

తుదిగా ఈదిగువ రెండుపద్యములలో గ్రంథకర్త నభినుతింతును.

రాధాపాదపథారవింద పటలీప్రాలంబరోలంబకో -
ద్గీథంబోయన మంజుశింజితము లుద్దీపించు జాడం ద్రిపా -
దాధారుండు వివర్తనర్తనుడు సర్వారంభరాసాత్మ్యుడౌ
గాదా శ్రీహరి రామనాథహృదయాకాశంబు కాశింపుచున్॥
శ్రీరామనాథయోగీశ భక్తిసంయుక్తమానసే।
హంసీభూయ సదా కృష్ణో ధావళ్యం వితనోతు నః॥

ఇతి శమ్

స్వస్తిశ్రీ దుర్మతినామ సం॥ర
మాఘకృష్ణ షష్ఠి
రవివాసరము
(ఫిబ్రవరి 14, 1982)
బందరు

ఇట్లు
బహుభాషాప్రవీణ
సాహిత్యరత్న
భక్తజనపాద రేణువు
కోట సుందరరామశర్మగారు
M.A., M.O.L., M.Ed.,

* పాదపథ(ము)=కాలిబాట; ఉద్గీథము = సామగానము.



# మనసులోని మాట

శ్రీ తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారు
తెలుగు M. A. Ph. D.
నరసారావుపేట - గుంటూరు జిల్లా

నిగమ కల్పతరువునుండి మెల్లగా జారుతూ వచ్చిన శ్రీమద్భాగవత ఫలరసమును తొలుదొల్త చతుర్ముఖుడు, తదుపరి నారద వ్యాసమునీంద్రులు ఆస్వాదించారు. ఆ రస వత్తమ ఫలం శ్రీశుకమహర్షికి సంప్రాప్తమయింది. ఫల మేద యినాగానీ రసోత్కృష్టత నందాలంటే శుకోచ్ఛిష్టం కావాలి. అవధూత సత్తముని ముఖం అంకితం కాగానే అది మోక్ష సుఖాతీత మధురభక్తిరస ప్రఫుల్లమయింది. తదుపరి శుక మహర్షి తెలుగుతోటలోని చిలకలచేకూడ రసపానం చేయిం చాడు. బమ్మెరలో వెలసింది ఒకచిలక. బందరులో వెల సింది ఒకచిలక. ఈ చిలకలు భాగవత మధువును కడుపారా త్రాగి మత్తుగా కూశాయి. ఆమధు రాలాపనములే శ్రీమదాంధ్ర మహాభాగవతము, ఈభాగవత రసమును. ఆ భాగవతం శ్రీరామాంకితం. ఈ భాగవతరసం శ్రీరాధారాణికి నివేదితం.

సాధారణంగా ఫలాలలో పరిత్యజించవలసిన భాగాలు కొన్ని ఉంటాయి. (తొక్క - విత్తనాలు) ఇందులో పార వేయడానికి ఏమీ మిగలదు. అంతా ఆరగింపుకే. ఈఫలరాజం రసప్రపూర్ణం. అందుకే రసస్వరూపమయిన ఈఫలం భూమి

మీాద పడి భంగం కాలేదు. లలితరీతిలో విగళిత మయింది. భావుకులయిన రసికులకే భాగవతరుచి విదితం. వారు మేను మఱచి పునః - పునః తదిస లోలురవుతారు. నా పియ తమ సోదరులు పూజ్యశీ హరిరామనాథ్ గారుకూడ అట్టి రసలోలురు అందుకే ఈ 'భాగవతరసం' గ్రంథవిరచనం కాదు, ఈ భాగవతోత్తముని మధుర సందర్శనమని నా మతం. ప్రతిపత్రము శీరాధారాణి విహరించిన నికుంజమే. శీ రా(మనా)థ్ జీ శీకృష్ణునితో రాసోత్సవం జరుపు కొన్నారు. ఈ గ్రంథంలోన ప్రత్యక్షరంలో ఇది ప్రత్యక్ష మవుతుంది. మన అదృష్టం మహత్తరం. శీ రా (మనా)థ్ జీ మనల్ని ముఖ్యసఖియలుగా ఈ గ్రంథబృందావనంలోని రాసోత్సవంలో నిమగ్నం చేస్తారు. అల్లదిగో వినవస్తున్నది మధుర మురళీరవళి. నిగమ కల్పతరువనంలో నీలమేఘ శ్యాముడు ఆహ్వానిస్తున్న రాసోత్సవానికి పరుగులిడుదాము.

రండి ! ఆలస్యం చేయకండి !!

సెలవు



# అభిప్రాయః

శ్లో॥ రామనాథ్ సుకృతాలబ్ధ
భాగవత ఫలోదిత
భాగవతరసాస్వాద
తత్పరో జ్ఞానవాన్ భవేత్.

ఆ॥ భాగవతము దెలిసిపలుకుట కష్టంబ
టంచు నుడివె బోతనాఖ్యు డపుడె
అయినకూడ ఘనుడు హరిరామనాథుండు
భాగవతఫలంబు బట్టి పిండి

ఆ॥ రసపురుచిని జూపి రసికలోకంబెల్ల
సంతసింపజాలు సరణియందు
వ్యాసకధిత భాగవతమందుగల రుచుల్
చూచి లోకమునకు చూరలిచ్చె.

తే॥ గోపికాప్రేమరీతుల గ్రుమ్మరించి
రాసకేళీవిలాసార్ధరసము జూపి
రుచిరముగ భాగవతరసరచన జేస్తి
నవ్యవిధమున హరిరామనాథ సుకవి !

ద్వారకానగరమ్
కాకినాడ

మధురకవిశేఖరః
చాగంటి సుబ్బరాయః.

# "భాగవతరస స్వరూపాలు"

(1) నారదులు :—

గౌరవనీయులు శ్రీ T.T.D. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గారు - శ్రీ P.V R.K. ప్రసాద్‌గారు, I.A.S.

(2) వేదవ్యాసులు :—

శ్రీరామశరణ్ గురు మహారాజ్ జీ

(3) దేవకీ వసుదేవులు :—

నా తల్లిదండ్రులు

(4) నందయశోదలు :—

ఆలవిల్లి మల్లవర వాస్తవ్యులు శ్రీ ఆత్కూరి నాగేశ్వరరావు దంపతులు. ఈ గ్రంథ ముద్రణ సమయములో వారి గ్రామములో నేనున్నప్పుడు వారు చేసిన సేవ నిస్సంశయంగా అనుపమం. వారు వాత్సల్య రసనిధులు. వారి ఋణం తీర్చరానిది.

(5) గర్గాచార్యులు :—

మచిలీపట్నం వాస్తవ్యులు ఆయుర్వేద వైద్యవిద్వాన్ మా శ్రీ శ్రీ శ్రీ బృందావనం శ్రీ వేంకటరంగాచార్యులు గారు. ఈ అభాగ్యుడు ఇలా భూమిమీద నిలబడటానికి 8 సంవత్సరాలుగా తమ తపశ్శక్తి ధారపోస్తున్న మహర్షివరేణ్యులు. ఇంక వీరి ఋణం తీర్చరానిదన్న విషయం వేరే చెప్పాలా ?

(6) పరిక్షిన్న రేంద్రులు :—

గుంటూరుజిల్లా నరసారావుపేట వాస్తవ్యులు మా శ్రీ తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారు, తెలుగు-M.A. వీరి Ph. D. విషయం భాగవతం - భక్తి. కాన ఆ విషయం పై చక్కనిగ్రంథం వ్రాయవలసిందిగా 1980 సం॥ జనవరి నెలలో వారు నన్ను కోరారు. వారు - వారి వంశస్థులు - కుటుంబం నిస్సంశయంగా అసమాన శ్రీకృష్ణ భక్తులు - పుణ్యచరిత్రులు - అమృత స్వరూపాలు. ఒకటేమాట! అట్టి జీవితాలు 'నభూతో నభవిష్యతి'. ఏ నోటవిన్నా ఇదేమాట. వారి జీవనరసమే ఈ 'భాగవతరసం'. భాగవత హృదయ లోలుడు మదనగోపాలుడు వారందరికి శాశ్వతంగా తన దివ్య సన్నిధానము ననుగ్రహించు గాక! కాదు, గోపాలా! అట్లు కాదు, నీవే ఈ మధురమూర్తుల దివ్యసన్నిధానానికి దిగి రావాలి. వస్తావు, వచ్చితీరుతావు. ఎప్పుడు?

(7) ఉద్ధవులు :—

పరమాత్మీయులు - నరసాపుర వాస్తవ్యులు - పండిత శ్రీ కె. శివసత్యన్నారాయణగారు, M.A., PhD.. ఏం చెప్పను? వీరు సేవాధర్మ ప్రియులు. వీరి బహుముఖ వ్యవసాయం నేడు నరసాపురాన్ని అపర అయోధ్యగా - అపర మధురగా రూపొందిస్తోంది. అంటే ఆవంతయు అతిశయోక్తి లేదు.

(8) గోపికలు :—

వీరిని ప్రకటం కానీయకుండుటే శ్రేయస్కరం. ఇదీ శ్రీ వేదవ్యాసుల అభిమతం. వీరు అప్రకటంగా అంతరంగాన్ని మథిస్తుంటారు. ఈ ప్రకట లీలకు కారణం ఎవరు? గోపికలే.

(9) గోపాలురు :—

(i) విజయవాడ వాస్తవ్యులు - అత్యంత సన్నిహితులు - సత్పురుషులు శ్రీ అందలం వేంకటాచలపతిరావు గారు. ఆర్థికంగా - మరియు ఎన్నో విధాలుగా వీరి సహాయం ఈ గ్రంథముద్రణ సమయంలో మాకు లభించింది. వేంకటాచల నాయకుడు మా వేంకటాచలపతిరావుగారికి - వారి కుటుంబానికి ఆయురారోగ్యైశ్వర్యాల్ని, భక్తి, జ్ఞానవైరాగ్యాల్ని సదా అనుగ్రహించుగాక !

(ii) అభిమత దాతలు.

(iii) సర్వాంగ సుందరంగా స్వల్పవ్యవధిలో గ్రంథాన్ని ముద్రించి - అందచేసిన కాకినాడ మా శ్రీపతి ప్రెస్ యజమానులు శ్రీ గణేశ్వరరావుగారు సకల సద్గుణ సంపన్నులు - సుశీలురు. కలకాలం హృదయంలో జీవించి వుండే ఉత్తమవ్యక్తులు.

(iiii) సోదరులు శ్రీ నరసాపురం - వేంకటేశ్వర ధార్మిక కేంద్రసభ్యులు.

ఇంకా ఎందరో ! ఎందరో !!

చివరకు నేనొక్కడను మిగిలాను. సర్వవిధాలా అభాగ్యునిగా మిగిలాను. ఇది నిజం. నమ్మండి.

పై సమస్త భాగవత రసస్వరూపాలకు - ఇది నా —

'భావ నీరాజనం'

అందరివాడు,

— హరి రామనాథ్.



# ఆశీస్సులు

"పిబత భాగవతం రసమాలయమ్" అని శాస్త్రం. వ్యాసమహర్షి భాగవతరసాన్ని త్రాగవలయునని చెప్పియున్నారు. వ్యాసమహర్షి 18 మహాపురాణాల్ని, 18 ఉపపురాణాల్ని, 18 ఔపపురాణాల్ని, బ్రహ్మసూత్రాల్ని, భగవద్గీతను మొదలగు అనేక గ్రంథాల్ని రచించారు. అయినను వారికి ఆత్మతృప్తి కలుగలేదు. కారణమేమని, ఊహించలేక చివరకు భగవంతునిగురించి, భాగవతుల గురించియు వర్ణింపలేకపోతినేయని చింతను జెంది భాగవతం రచించారు. భాగవతం కేవలం రసస్వరూపం. "రసోవై సః" యని ఆ పరమాత్మ రసస్వరూపుడు. ఆ రసముయొక్క అనుభవ స్వరూపమగు వర్ణనం భాగవతమున గలదు. భాగవతరసమును గురించి వ్రాయవలయుననిన మరల భాగవతమంత దివ్యగ్రంథం కాగలదు. అట్టి దివ్యప్రేమరసయుక్తమగు భాగవతంలోని భక్తి భావరసములను మథించి, ఈ చిరంజీవి మనకిప్పు డందించినాడు.

ఈ చిరంజీవి బాల్యమున పదియవ ఏటనే శ్రీరామ సాక్షాత్కారమును పొందిన ధన్యజీవి, కారణజన్ముడు. 11వ ఏటనే అనర్గళంగా ఉపన్యాసము లొనర్చి పండితపామర జనములను ముగ్ధుల నొనర్చిన వ్యక్తి. ఈతనిగూర్చి చెప్పవలయునన్న విస్తృతమగు చరిత్రగలదు. దానిని చెప్పుట కిట సాధ్యము

గాదు. అట్టి వ్యక్తికి ఇప్పుడు భాగవతంలోని రసము నంతయును పిండి, మనకు భాగవతరసం అను గ్రంథంద్వారా అందించినాడు. అట్టి చిరంజీవిని శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహించి, ఇతోధికముగా అత్యుత్కృష్టములగు గ్రంథములను రచింపచేసి ధన్యుని చేయుగాక ! యని భగవంతుని ప్రార్థించుచున్నాను.

— శ్రీరామశరణ్

బుద్దాం - గుంటూరుజిల్లా.



# శుభాశంసనము

"ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అవార్డుగ్రహీత" —
"విద్వత్కవి శేఖర" బ్రహ్మశ్రీ వెంపరాల సూర్య
నారాయణశాస్త్రిగారు, రామారావుపేట, కాకినాడ.

బ్రహ్మశ్రీ చిరంజీవులు హరి రామనాథంగారు రచించిన 'భాగవతరసం' అనెడి భక్తిప్రబోధకమయిన గ్రంథము ఆమూలాగ్రము చదివెడుభాగ్యము నాకు కలిగినదనెడి ఆనందముచే సహృదయులకు నాలుగుమాటలు విన్నవించుచున్నాను.

భాగవతము ననుసరించి వల్లభాచార్యుడు, చైతన్యస్వామి, మధుసూదన సరస్వతి, రూపగోస్వామి మున్నగువారు శ్రీకృష్ణతత్త్వము నందలి రహస్యములను బహుముఖములుగా వాగ్రూపముగాను, గ్రంథరూపముగాను ప్రకటించి తమ నిష్కామ కర్మయోగమును వెల్లడించినారు. వారందరును సకల ఉపనిషత్తులందును, సకల శాస్త్రములందును పండితాఖండలు లయి, భాగవతమును పరిపరి విధముల పరిశోధించి, గోపికానాథుడగు కృష్ణునియందు పరమాత్మస్వరూపమును దర్శించుటయేగాక, శ్రీకృష్ణజన్మఖండమందలి రాధాదేవి కృష్ణపరమాత్మయొక్క దివ్యస్వరూపమే అనియు, ఆ ఇరువురయందు అద్వైతసిద్ధి సంపాదించి, భక్తిమార్గమున

పాడియు, ఆడియు తరించిన పుణ్యాత్ములు. ఆ రాధాకృష్ణ భక్తి మన యాంధ్ర దేశమునకన్న ఉత్తర దేశమున బహుళప్రచారములో నున్నది. వల్లభాచార్య, చైతన్యులచే వంగదేశమునందు అంకురించిన ఆ భక్తిలత ద్వారకా, బృందావనము మున్నగు ఉత్తరదేశ పుణ్యక్షేత్రములయందు అల్లుకొని, పుష్పించి, తనపరిమళముచే హిమాచలమువరకు వ్యాపించి, భక్తులకు తరణోపాయ మయినది.

దక్షిణ దేశమున కృష్ణభక్తి అధికముగానున్నను రాధాదేవి శక్తి పరిపూర్ణముగా వెల్లడియైనట్లు లేదు.

దైవసంకల్పముచే మన హరి రామనాథశాస్త్రిగారికి జన్మప్రభృతి హరిభక్తి అంకురించి, బ్రహ్మచర్యమున ప్రవేశింపగనే గోకుల- బృందావనములు తపశ్చరణకు ఆశ్రయము లగుట జన్మాంతర పుణ్యసంస్కార మనుకొనవలసి యున్నది. అచట దీర్ఘకాలము రాధాకృష్ణభక్తులతో కలసిమెలసి ఆ పురాతన దంపతులయందు రసస్వరూపమగు పరబ్రహ్మమును దర్శించి, ఆ తత్త్వమును మాతృదేశమున వెల్లడించి, ఆంధ్రుల నందరను తనవలెనే భక్తులుగా నొనర్ప ఆయనకు కలిగిన యనుభవము నంతను ఈ భాగవతరస మనెడి గ్రంథమున పెక్కు రీతులుగా వర్ణించిరి. ఒకవిధముగా ఆలోచింప ఆంధ్రుల కప్రయత్నముగా లభించిన అమృతరసభాండము గాని అన్యము కాదు. ఈయనకు భాగవతము, అందులో

**Dr. K.S. Satyanarayana**

Hindi Head of the Dept.,
Sri Y. N. College
NARSAPUR - 534275
West Godavari (A.P.)

# అభిమతము

శ్రీహరి రామనాథంగారు వ్రాసిన "భాగవతరసం" చదివి రసాస్వాదన చేశాను. రామనాథంగారు పరమ భాగవతులు. బాల్యమునందే భగవదనుభూతిని పొందిన పుణ్యపురుషులు, యోగిపుంగవులు.

రామనాథంగారి హృదయం యోగిహృదయం గనుక వారు ఆ భాగవత మధురరసాన్ని త్రాగిత్రాగి ఆస్వాదించి, ఆనందించి, మనందరిని ఆనందింపజేసి తరింపజేయాలని ఎంతగానో శ్రమించి అందించిన రసమే "భాగవతరసం."

ఈ గ్రంథం ప్రతిఒక్కరూ తమ దగ్గరవుంచుకో తగ్గది. తీరికవేళల్లో నిత్యం పారాయణం చేయదగిన గ్రంథం.

- కె. ఎస్. సత్యనారాయణ



హరికథాకవికులాలంకార
టి. టి. డి. ఆస్థానహరికథావిద్వాన్
పెద్దింటి సూర్యనారాయణదీక్షితదాసు

# అ భి నం ద న

కం॥ శ్రీమద్భాగవతరసం
బాముష్మికతత్త్వచింతనామృతమై మీ
కోమలలేఖిని వెల్వడి
ధీమణి! హరిరామనాథ ! దివ్యతఁగాంచెన్.

చ॥ తెలివియు, సత్కళావిభవదీధితి, సత్యము, స్వేచ్ఛలేని హృ
త్తలమునుండి యెట్టు లవితర్కముగా జనియింపనేర్చు ? ని
శ్చలమగు దైవభక్తి సహజంబయి యక్షర రూపమంది రా
జిలు హరిరామనాథ ! రససిద్ధి భవత్పర మార్థమా కృతిన్.

ఉ॥ శ్రీహరిరామనాథ బుధశేఖర ! భాగవతాగ్రణీ ! అస
ద్వ్యూహలతాలవిత్రి ! గుణభూషిత ! తోషిత కృష్ణభక్తసం

దోహా ! నిరీహా ! వాఙ్మధురదుగ్ధపయోనిధి !
సాధుమూర్తి ! దా
సోఽహా ముదాత్తభావలసితాత్మక !
హే రసరాగరంజితా !

శ్లో॥ జయతాం భవదాధ్యాత్మికప్రచారవిశిష్టతా
భాగవతరస ముఖ్యోత్తమగ్రంథప్రకల్పనా.

నర్సాపురం
4-12-81

ప్రపన్నవిధేయుడు
"దీ క్షి త దా సు"



# అభిమతము

పూజ్యులు శ్రీహరిరామనాథ్‌గారు వ్రా
రసం' అందుకున్నాను, ఆస్వాదించాను, ఆనం
వతం నిజంగా ప్రేమపారిజాతం. ప్రేమ అనేదే
ఎవరు ఏదృష్టితో సేవిస్తే వారికి అలా కనిపించి
వృక్షం ప్రేమ. ఒకవిధంగా దాన్ని అనుభ
అనువదించ సాధ్యంకాదు. కాని శ్రీయుతులు
గారు ఈ రెండుపనులూ చక్కగా చేశారు. నా
శరాదులకు అంతుచిక్కని అనురాగలహరిని భా
పరమభాగవతులు పట్టుకొని తనతోటివారయి
వారికి అందించారు. వారికి భాగవతకుటుంబం ఒ
వీరి వాక్యాలు చదువుతూ ఉంటే భాగవతభా
విహరిస్తూ ఉన్నట్టుంది. గోవులు, గోపికలు,
గోలోకంనుంచి భూలోకంలోకి అవతరించినట్టుం
పతిని గురించి ఎవరేమి చెప్పినా మధురంగానే
అందులో హరిరామనాథుల మధురవాక్కులో
తరమయింది. "మధురాధిపతే రఖిలం మధురం

U. P. S. C. ఇలపావులూరి పాం

New Delhi Direct

28-12-81

# అభిమతము

పూజ్యులు శ్రీహరిరామనాథ్‌గారు వ్రాసిన 'భాగవత రసం' అందుకున్నాను, ఆస్వాదించాను, ఆనందించాను. భాగవతం నిజంగా ప్రేమపారిజాతం. ప్రేమ అనేదే ఒక పారిజాతం. ఎవరు ఏదృష్టితో సేవిస్తే వారికి అలా కనిపించి అలరించే కల్ప వృక్షం ప్రేమ. ఒకవిధంగా దాన్ని అనుభవించాలే కాని అనువదించ సాధ్యంకాదు. కాని శ్రీయుతులు హరిరామనాథ్ గారు ఈ రెండుపనులూ చక్కగా చేశారు. నారద శుక పరాశరాదులకు అంతుచిక్కని అనురాగలహరిని భాగవత బుద్ధితో పరమభాగవతులు పట్టుకొని తనతోటివారయిన మనబోటి వారికి అందించారు. వారికి భాగవతకుటుంబం ఋణపడి ఉంది. వీరి వాక్యాలు చదువుతూ ఉంటే భాగవతభావ జగత్తులో విహరిస్తూ ఉన్నట్టుంది. గోవులు, గోపికలు, గోపాలుడు గోలోకంనుంచి భూలోకంలోకి అవతరించినట్టుంది. మధురాధిపతిని గురించి ఎవరేమి చెప్పినా మధురంగానే ఉంటుంది. అందులో హరిరామనాథుల మధురవాక్కులో అది మధురతరమయింది. "మధురాధిపతే రఖిలం మధురం".

U. P. S. C. ఇలపావులూరి పాండురంగారావు

New Delhi Director (Hindi)

28-12-81

# వి ష య సూ చి క

—//—

# శ్రీ కృష్ణ ప్రార్థన

(శ్రీ లీలాశుకయోగీంద్ర విరచిత శ్రీకృష్ణ కర్ణామృతం)

1. శ్లో॥ అభినవనవనీత స్నిగ్ధమాపీత దుగ్ధం
దధికణపరిదిగ్ధం ముగ్ధమాంగం మురారేః,
దిశతుభువనకృచ్ఛ్రచ్ఛేదితాపింఛగుచ్ఛ
చ్ఛవినవశిఖిపించా లాంఛితం వాంఛితంనః.

"పచ్చివెన్న జిడ్డుదేలుచు పాలు సొంపారద్రాగి, పెరుగు తుంపరులు పయినలమి, కానుగుచెట్ల కాంతివంటి నల్లని కాంతిగలిగి, క్రొత్త నెమలిపురినిదాల్చి, జగంబుల సంకటంబులను దూలించునట్టి శ్రీకృష్ణుని శరీరము మాకోర్కుల నొడగూర్చుగాక!"

చ॥ మురిపెపు నవ్వుగాదిది విమోహరసాస్పద రాశిగాని బి
త్తరమగుచూపుగాదిది నితాంతదయానిధిగాని మోముదా
మరయిదిగా దఖండరస మాధురిగాని వ్రజాలయాంగణాం
తరమిదిగాదు నాదునయ నంబుల భాగ్యముగాని
చూడగన్.

కమ్మని వెన్నవాసన ముఖమ్మనఘుమ్మని సోడముట్ట వా
క్యమ్ముల జౌర్యనైపుణులు గన్పడగన్నుగవన్ మృపాశ్రువు
ల్గ్రిమ్మగ గోమలాంఘ్రి యుగళమ్మున దాండవకేళి
యొప్పగా
గ్రుమ్మరు గోపబాలకు ముకుందుని నామది నాశ్రి
యించెదన్.

శ్లో. నిధిలావణ్యానాం నిఖిల జగదాశ్చర్య నిలయం
నిజావాసంభాసాం నిరవధిక నిశ్శ్రేయసరసమ్
సుధాధారాసారం సుకృతపరిపాకం మృగదృశాం
ప్రపద్యే మాంగల్యం ప్రథమ మధిదైవం కృతధియామ్.

శ్లో. రాధారాధిత విభ్రమాద్భుతరసం లావణ్యరత్నాకరం
సాధారణ్య పదవ్యతీత సహజ స్మేరాననాంభోరుహామ్
ఆలంబేహరినీల గర్వగురుతా సర్వస్వనిర్వాపణం
బాలంవైణవికం విముగ్ధమధురం మూర్ధాభిషిక్తంమహః.

శ్లో. ఆపాటలాధర మధీరవిలోలనేత్ర
మామోదనిర్భరిత మద్భుతకాన్తి పూరమ్
ఆవిఃస్మితామృత మనుస్మృతిలోభనీయ
మాముద్రితానన మహోమధురంమురారేః.



# అభినందనం

## బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
కాకినాడ

క॥ హరి రామనాథ నామక
ధరామర బ్రహ్మచారి, తాపత్రయమే
పర, దెలుగు నేల భాగవ
తరసంబున నోలలార్చి ధన్యత గాంచెన్.

సీ॥ హరి వారి యింట దానవతరించుట నేమొ
బాల్యమాది ముకుందు బాడ నేర్చె
వడుగైన బాది దశంబాని బృందావ
నమున శ్రీహరి పదాబ్జముల జేరి
దైత్యారి భక్తి బోధక కృతుల్ సంస్కృతాం
ధ్ర వ్రజభాషలన్ దమిం బఠించె
దనియంగ భాగవతరస మాస్వాదించి
తెలుగు పలుకుల గజ్జు మనుచు ద్రేన్చె

గీ॥ నంతతో దృప్తిగనకుపన్యాస సరణి
రాధికా మాధవుల మధుర స్వరూప
మెల్లరకు జూపుచుండె జేయెత్తి యది గొ
రామనాథుండ కామ కర్మణ్య వృత్తి.

శా॥ ఆకంఠంబుగ దృప్తిగల్గ మధురంబై, ఏకమై, రాధి
శ్రీకృష్ణాత్మకమై
భాగవత నిత్తిష్టామృతం బానుచు శ్లోకుం
డాయతి నద్దిరా జనని పాల్ గ్రోలందలంపం డటం
చేక ప్రక్రియ రామనాథ మహితుం డెల్లెత్తి చాటె
కృతి

చం॥ వయసున బెద్దనౌట జిరప్రాయము వాడని
రామనాథుః
చ్ఛేయమును గోరి దీవనలు సల్పుదు గాని తదీయ
రాధికాప్రియ
పదభక్తియున్ తపము పెంపు దలంపగ
నా ఎడన్ రః
తయు గన, నైన భావితరణంబగు నాకని
సాహసించితిః

ఇట్లు
శ్రే యో భి లా ః



# ఈ గ్రంథముద్రణకు సహకరించిన దాతలు

(1) "అపరకర్త"
ప్రతాప్ నగర్ - కాకినాడ.
ప్రోత్సాహకులు :—
"ప్రియతమ ఆత్మబంధు"
శ్రీ సన్నిధిరాజు ఇందిరేశ్వరశర్మగారు, కాకినాడ.

(2) శ్రీ దంటు సూర్యారావుగారు
సూర్యారావుపేట - కాకినాడ.
ప్రోత్సాహకులు :—
"ప్రియతమ ఆత్మబంధు"
శ్రీ చిక్కాల నారాయణమూర్తిగారు, కాకినాడ.

(3) శ్రీ మెర్ల కృష్ణమూర్తిగారు
దేవాలయంవీథి - కాకినాడ, రూ. 100-00
ప్రోత్సాహకులు :—
శ్రీ చిక్కాల నారాయణమూర్తిగారు, కాకినాడ.

వీరందరికి ఆయురారోగ్యైశ్వర్యాల్ని, భక్తి జ్ఞాన వైరాగ్యాల్ని అక్షయంగా అనుగ్రహించవలసిందిగా ప్రియాప్రియతములు శ్రీ రాధాకృష్ణుల్ని ప్రార్థించాను. వారు అనుగ్రహించేస్తున్నారు.

— గ్రంథకర్త.

# భాగవతరసం — అవతారిక.

## 1. భాగవతరసం :

శ్లో॥ నిగమ కల్పతరో ర్గళితం ఫలం
శుక ముఖా దమృతద్రవ సంయుతమ్,
పిబత భాగవతం రసమాలయమ్
ముహురహో రసికా భువి భావుకాః॥

(శ్రీమద్భాగవతం; స్కం 1 - అ 1 - శ్లో 3.)

వేదాలు కల్పతరువులు. శ్రీమద్భాగవతం వానికి ఫలం. శుకోచ్ఛిష్టమై ఆ ఫలంలోని రసం ప్రవాహమయింది. వేద కల్పతరువులనుండి సహజంగా విగళితమైన దివ్యరసాలం శ్రీమద్భాగవతం. అది గ్రంథం కానేకాదు. భగవానుని శ్రీవిగ్రహం. భగవానుడు రసస్వరూపుడు. భాగవతం కూడ రసస్వరూపం. ఆహ్వానం! రసిక మహానుభావులారా! నిర్విరామంగా భాగవతరసం పానం చేయటానికి కదలిరండి.

వేదవ్యాసుడు వేదకల్పతరువు. ఆయన శాత్మ శుక మహర్షి. వేదకల్పతరువు ప్రేమీభక్తుల శరీరము. అందలి ఆత్మ శుకమహర్షి.

రసం ప్రతి మానవునిలో ఉంది, ఏకాదశేంద్రియాలకు ఆవల ఉంది. ఆత్మ ముఖమున నిస్సృతమైనప్పుడు ఆ రసం ఈ ఏకాదశేంద్రియాలలో కూడ ప్రవహిస్తుంది.

భాగవతంలో 12 స్కంధా లున్నాయి. ఏకాదశేంద్రియాలు- వాని కావల వున్న ఆత్మతత్త్వం ఈ పండ్రెండు స్కంధాల రూపం ధరించాయి.

శరీరం క్షేత్రం. అందలి జీవాత్మ అథవా పరమాత్మ క్షేత్రజ్ఞుడు.

సమస్త వ్యవహారాలకు - భావాలకు - అనుభవాలకు ఆధారం శరీరం. కాన అది క్షేత్రం. ఇది సత్త్వరజస్తమో గుణాలనుండి జన్మిస్తుంది.

శ్లో॥ గుణానేతా నతీత్యత్రీన్ దేహీ దేహ సముద్భవాన్,
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే॥
(భగవద్గీత అ 14 - శ్లో 20.)

సత్త్వరజస్తమో గుణాలు ప్రకృతికి ఫలాలు. వీని నుండి శరీరం ఏర్పడుతోంది. మానవ జీవితమంటే ఏమిటి ? త్రిగుణాత్మక మయినది.

వేదాలు కూడా త్రిగుణాత్మకాలే.

శ్లో॥ త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున॥
(భగవద్గీత అ 2 - శ్లో 45.)

వేదాలు అధికార భేదాన్ననుసరించి జీవులకు త్రిగుణాత్మక ప్రక్రియల్ని సూచిస్తాయి, వారిని ధర్మమార్గంలో నియోగిస్తాయి. "వేదోఽఖిలో ధర్మమూలం." ఒకటేమాట! వేదాలన్నీ ధర్మ ప్రబోధకాలు. ధర్మం వాటికి ప్రాణం.

శరీరం-వేదం, రెండు సత్త్వరజస్తమోగుణ ప్రధానా లైనవి కావటం వలన శరీరం వేదకల్పతరువనటం సముచితమే.

వేద వేద్యుడు-మదన గోపాలుడు అనుభవానికి రావా లంటే జీవుడు త్రిగుణాతీతుడు కావాలి. ఒకటేమాట! ఈ భాగవతరసం త్రిగుణాతీతం.

మూ॥ సర్వే వేదా యత్పద మామనంతి
తపాగ్ంసి సర్వాణిచ యద్వదంతి,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమి॥ "ఓమిత్యేతత్."
(కఠోపనిషత్.)

వేదాలన్నీ ఏ వస్తువును పొందదగిన దానిగ చెప్పు తున్నాయి ? తపస్సులన్నీ ఎందునిమిత్తం ఆచరింపబడు తున్నాయి? బ్రహ్మచర్యం పాటించటంలో గల రహస్య మేమిటి? ఈ సమస్త ప్రశ్నలకు ఒకే ఒక్క సమాధానం 'ఓంకారం.'

స్థూల సూక్ష్మ కారణాలని ప్రణవం మూడు విధాలు. శరీరపరంగా యోగుల ఓంకారోపాసన చూడండి. ఓంకారం అకార - ఉకార - మకారాత్మకం. అకారం విష్ణుసూచకం-ఉకారం లక్ష్మీ సూచకం - మకారం జీవవాచకం. కాన మకా రానికి యోగుల ఓంకారానుసంధానంలో స్థానం లేదు.

జననేంద్రియ సహితంగా రెండు పాదాలు అకారం. వానిని నాభితో కలుపు భాగం ఉకారం. నాభి బిందువు. ఇది స్థూల ప్రణవం.

రెండు బాహువులు, వాని మధ్యభాగం అకారం. కంఠ పర్యంతం ఉకారం. విశుద్ధచక్రం బిందువు. ఇది భావప్రధాన సూక్ష్మప్రణవం.

రెండు కనుకట్టులతో కూడిన నాసికాగ్రం అకారం. నేత్రాగ్రస్థానం ఉకారం. బ్రహ్మరంధ్రం బిందువు. ఇది కారణ ప్రణవం.

స్థూలప్రణవం జడం. సూక్ష్మ ప్రణవం చేతనం. కారణ ప్రణవం జ్ఞానం. సమస్త క్రియలకు మూలం 'సత్.' వృత్తులకు మూలం 'చిత్.' సుఖాలకు మూలం ఆనందం. ఈ సచ్చిదానందాలే ఓంకారోపాసనా లక్ష్యాలు.

వేదా లెక్కడ పుట్టాయి ? అంతరారాములైన యోగుల హృదయాలలో. కాననే ఆ యోగులు వేదస్వరూపులు. అనగా ఓంకారస్వరూపులు, ధర్మస్వరూపులు. ఈ భాగవతరసం కూడా ఆ అంతరారాములైన యోగుల హృదయాల నుండే పుట్టింది సువ్యవస్థిత అచ్యుత ప్రేమభావమయులైన యోగుల హృదయాలలో ఆ వేదం లేక ధర్మమే రస రూపంతో నానా ముఖాలతో విజృంభించింది.

"యద్వైతత్ సుకృతం రసోవైసః రసంహ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి." (తైత్తిరీయోపనిషత్.)

"ఆతడు రసస్వరూపుడు. జీవు డాతని పొందినపుడు మాత్రమే ఆనందితుడు కాగలడు."

ఏది స్వయంగా కర్త మరియు తత్త్వమో అదే రసం. "రస్యతే అసౌ ఇతిరసః" రసీభవింప చేసేది రసం. భాగవతం రసాలయం, భగవానుని శ్రీవిగ్రహం. దానిని చదువకూడదు. సమస్తేంద్రియాలను పానపాత్రలుగా రూపొందించి నిరంతరం త్రాగాలి. ఇందుకు ఆదర్శమూర్తులు వ్రజ బాలలు.

# భాగవతరసం — అవతారిక.

## (2) "పిబత భాగవతం రసమాలయం."

శ్లో॥ యే యం రాధా యశ్చ కృష్ణో రసాబ్ధిః
దేహశ్చైకః క్రీడనార్థం ద్విధాభూత్,
దేహో యథా ఛాయయా శోభమానః
శృణ్వన్ పఠన్ యాతి తద్ధామ శుద్ధమ్."

(శ్రీ రాధాతాపిన్యుపనిషత్.)

శ్రీ రాధాకృష్ణులు రససాగరాలు. వాస్తవంలో వారి దువ్వురు గారు, ఒక్కరే. ఆడుకొనే నిమిత్తం రెండు రూపాలు పొందారు. ఛాయవలన దేహం ఎట్లా శోభిస్తుందో అట్లా శ్రీ రాధారాణీ వలన గోపాలుడు శోభిస్తాడు, ఆనందిస్తాడు. వారంతటి రససాగరాలైతే మనకేమిటి లాభం? చాలా లాభ ముంది. వారి కథలను చదివితే చాలును, వింటే చాలును. రసస్వరూపులమై గోలోక నివాస భాగ్యాన్ని పొందుతాము.

అయితే అవశ్యం కథామృతపానం చేసి తీరాలి. మన కున్న శ్రోత్రాలు రెండే రెండు. కేవలం వానితో ఎంత రసా సాధన చేయగలం? పృథుచక్రవర్తి విష్ణుభగవానుని కోరి నట్లుగా పదివేల చెవులేర్పడితే ఎంత బాగుంటుంది? ఎంతో బాగుంటుంది.

(1) రెండు శ్రోత్రాలతో కథారసాన్ని ఆస్వాదించాలి.

శ్లో॥ తవ కథామృతం తప్త జీవనమ్
కవిభిరీడితం కల్మషాపహమ్,
శ్రవణ మంగళం శ్రీమదాతతమ్।
భువి గృణంతి తే భూరిదా జనాః॥
(శ్రీమద్భాగవతం స్కం 10 - అ 31 - శ్లో 9.)

"గోపాలా! నీ కథామృత సుగంధం ఎంత గొప్పది! తాపత్రయాగ్ని సంతప్తుల కది ఆహ్లాదవర్షం. కామక్రోధాద్యరిషడ్వర్గ నాశకం, సనకాది స్తుతం, శ్రవణ మనోహరం, ఘనలక్ష్మీయుతం. అయ్యో! మావంటి క్షుద్రజీవులు ఇట్టి కథామృతాన్ని ఎట్లా పానం చేయగలరు ?"

(2) రెండు నేత్రాలతో రూపరసాన్ని ఆస్వాదించాలి.

శ్లో॥ దయిత దృశ్యతాం దిక్షుతావకా
స్త్వయి ధృతాసవ స్త్వాం విచిన్వతే॥
(శ్రీమద్భాగవతం స్కం 10 – అ 31 – శ్లో 1.)

"ప్రాణేశ్వరా! గోపాలా! మా నేత్రపాత్రలలోనికి నీ శ్యామరసం ఎట్లా ప్రవహిస్తుంది? ఎప్పుడు ప్రవహిస్తుంది?".

బ్రహ్మదేవునకు 8 నేత్రాలు, శంకరునకు 15 నేత్రాలు. షణ్ముఖునకు 12 నేత్రాలు, 'దేవేంద్రునకు వేయి నేత్రాలు. మానవులకో ? రెండే రెండు. సమస్త సౌభాగ్యాలు ఒకదాన్నిపై నొకటిగా గొప్పవారినే వరిస్తాయి గానీ అధముల నెట్లా వరిస్తాయి? "గోపాలా! మమ్ముల నెంత దౌర్భాగ్యులుగా పుట్టించినావు!"

(3) జిహ్వతో నామామృతం ఆస్వాదించాలి.

శ్లో॥ యా దోహనేఽవహననే మథనోపలేప
ప్రేంఖేంఖనార్భరుదితోక్షణమార్జనాదౌ,
'గాయంతి' చైన మనురక్త ధియోఽశ్రు కంఠ్యో
ధన్యావ్రజస్త్రియ 'ఉరుక్రమ చిత్తయానః.'॥
(శ్రీ)మద్భాగవతం స్కం 10 - అ 44 - శ్లో 15.

"పాలు పిదుకుతూ, స్నానం చేస్తూ, పెరుగు చిలుకుతూ శృంగారం చేసికొంటూ, ఏడ్చే శిశువుల్ని ఊరడించి, ఊయల లూపుతూ, ఇల్లు ఊడుస్తూ, నీళ్ళు చిలుకరిస్తూ, ముగ్గుల పెట్టుతూ, ఒకటేమిటి, ఏ వ్యవహారం చేస్తున్నా గోపికల నిరంతరం గోపాలనామాన్ని కీర్తిస్తున్నారు. సాత్త్వికభావాల ఉదయిస్తున్నాయి, నయనాలు అశ్రువర్షం కురిపిస్తున్నాయి ఇంద్రియజ్ఞానం, దేహాహంభావం నశిస్తోంది. కంఠం రుద్ధ మవుతోంది, శరీరం పులకరిస్తోంది, స్తంభిస్తోంది, చెమటలు పడుతోంది, మనసు, వాక్కు, శరీరం పరవశించి, ప్రవహిస్తు న్నాయి, ఉరుక్రమునకు ప్రేమ పారితోషికాలవుతున్నాయి."

అయితే వారికి మిగిలిందేమిటి? గోపాలు డొక్కడే. గోపికల మనసు గోపాలుడు, వాక్కు గోపాలుడు, రోమ రోమం గోపాలుడు, వారే స్వయంగా గోపాలుడు. గోపాలు డంటే ప్రేమరసం. గోపికల నుండి నిరంతర మొకటే నినాదం. "గోపాలా! గోపాలా!! గోపాలా!!!".

శ్లో॥ నిజాంగణే కంకణ కేళిలోలమ్
గోపీగృహీత్వా నవనీత గోలమ్,
ఆ మర్దయత్పాణితలేన నేత్రే
గోవింద దామోదర మాధవేతి॥
(శ్రీ లీలాశుకులు)

"తన చేతి కంకణంతో ఇంటి ముంగిట ఆడుకొంటు న్నాడు గోపాలుడు, చేతిలో వెన్నముద్ద తీసికొని, వెను వెనుకగా వచ్చి రెండవ చేతితో ఆతని కన్నులు మూసి యశోదమ్మ మిక్కిలి ప్రేమతో "గోవిందా! దామోదరా!! మాధవా!!!" అని పిలువసాగింది. "చూడు, తీసికో, వెన్న తిను నాయనా !"

4. త్వగింద్రియానికి స్పర్శసుఖం గోపాలుడు కావాలి.

శ్లో॥ "సర్వాస్తాః కేశవాలోక పరమోత్సవ నిర్వృతాః,
జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథాజనాః॥"
(శ్రీమద్భాగవతం-స్కం-10- అ 32- శ్లో 9)

"గోపాలుడు సాక్షాన్మన్మథ మన్మథుడు, లావణ్యా, మాధుర్యాలకు నిధి. ఆతని దర్శనం గోపికలను విరహతాప విముక్తలను చేసింది. ఆ ఉత్సాహంలో ఎచట చూచినా ఉత్సవమే ఉత్సవం."

5. ఘ్రాణేంద్రియానికి శీతలమంద సుగంధం గోపాలుడు కావాలి,

శ్లో॥ సవై మనః కృష్ణపదారవిందయో—
ర్వచాంసి వైకుంఠ గుణానువర్ణనే
కరౌ హరేర్మందిర మార్జనాదిషు
శ్రుతిం చకారాచ్యుత సత్కథోదయే॥

శ్లో॥ ముకుంద లింగాలయ దర్శనే దృశౌ
తద్భృత్యగాత్ర స్పర్శేంఽగ సంగమమ్,
ఘ్రాణంచ తత్పాదసరోజ సౌరభే
శ్రీమత్తుల స్యారసనాం తదర్పితే॥

శ్లో॥ పాదౌ హరేః క్షేత్రపదాను సర్పణే
శిరో హృషీకేశ పదాభివందనే,
కామంచ దాస్యే నతు కామ కామ్యయా
యథోత్తమ శ్లోక జనాశ్రయారతిః॥

-(శ్రీమద్భాగవతం. స్కం 9- అ 4 శ్లో 17-18-19.)

శ్రీకృష్ణుని చరణాలు కమలాలు. ఆ అంబరీషుని మనసు వానిపై భృంగం. అతని వాక్కునకు వ్యసనం నారాయణగుణగానం. హరిమందిరాన్ని స్వచ్ఛం చేయటం హస్తాలకు వ్యసనం. శ్రోత్రాలకు హరికథా శ్రవణం వ్యసనం. నయనాలకు ముకుంద స్వరూపావలోకనం వ్యసనం. త్వగింద్రియానికి భాగవత శరీరస్పర్శ వ్యసనం. నాసికకు శ్రీకృష్ణచరణ సరోజ సౌరభాఘ్రాణం వ్యసనం. జిహ్వేంద్రియానికి తులసీ సేవనం, మస్తకానికి హృషీకేశ వందనం వ్యసనం. హరిక్షేత్ర ధూళితో అభిషేకింపబడటం పాదయుగళానికి వ్యసనం.

మాల్యచందనాది భోగాల్ని దాస్యభావంతో ప్రసాదంగా గ్రహించటం అంబరీషునకు వ్యసనం. సర్వాత్మభావంతో అతిశయ ప్రేమతో అనుక్షణం సర్వకర్మల్ని పూజాపుష్పాలుగా శ్రీహరిచరణాలకు సమర్పించటం అంబరీషునకు వ్యసనం.

ఆతడింతగా వ్యసనగ్రస్తు డగుటకు కారణమేమిటో ?

ఏమి చెప్పగలం ! గోపాలు డట్టివాడు.

ఒకే గురువునకు తులసీదాసు— నందదాసు శిష్యులు. శ్రీరామభక్తులు. కాలాంతరాన నందదాసుకృష్ణభక్తుడైనాడు. అప్పుడు తులసీదాసు నందదాసున కిలా లేఖ వ్రాశాడు.

"కహాఁ కమీఁ రఘునాథ్ మేఁ ఛాడీ అపనీ బాన్."

నిన్నటి దినం నీవు శ్రీరామభక్తుడవు, నేడు శ్రీకృష్ణ భక్తుడవైనావు. చెప్పుము, శ్రీరామునిలో ఏమిలోపమున్నది?"

నందదాసు ఇలా ప్రత్యుత్తర మిచ్చాడు.

"కమీఁకుఛ్ నహీఁ, రామకృష్ణ సర్వథా ఏక్ హైఁ, పర్
మన్ బైరాగీ హైఁగయా సున్ వంశీకీ తాన్॥"

"లోపము లేశమైన లేదు. శ్రీరామకృష్ణులు సర్వథా అభిన్నులు, ఏమి చేయను ? ఆ చంచల గోపాలుని వేణు గానం నా మనసును చంచలం చేసేసింది."

శ్లో॥ బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారమ్
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీంచ మాలామ్

రంధ్రాన్వేణో రధరసుధయా పూరయన్గోప బృందై
ర్వృన్దారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీత కీర్తిః”
(శ్రీమద్భాగవతం. స్క–ం 10–అ 21–శ్లో 5.)

ఆహా ! ఏమి నటవరస్వరూపం ! శిరసున కేకి పింఛం, పాదాలు వ్యత్యస్తాలు, చెవులందు ఊగెడి కుండలాలు, కటి స్థానం వరకు పట్టుపితాంబరం, గళాన వైజయంతీమాల, అబ్బ! ఎంత శృంగారరససర్వస్వం ! ఆ శృంగారరసం, అదిగో అధరాల నుండి మురళీమార్గంగా ప్రవహిస్తోంది, సమస్త బృందావనం, సమస్త జడచేతనాలు అందు పరవశించి పరివహిస్తున్నాయి.

## భాగవతరసము - అవతారిక

### (3) ప్రేమ- ఇంద్రియాలు

వృత్తి త్రిగుణాల్ని అతిక్రమించిన స్థితిని 'ప్రేమ' అంటారు. అంటే మనసు సుందరశ్యామరూపమందు లగ్నమై స్వసత్తాను పూర్తిగా కోల్పోవాలి. శ్యామరూపం ఒక్కటి మాత్రమే మనసును త్రిగుణాతీతపథాన నడిపించగలుగుతుంది. కర్మేంద్రియ- జ్ఞానేంద్రియాలకు ప్రాణం వంటిది మనసు. మనసు లేకపోతే మానవుడు ఇంద్రియాలచే కర్మ చేయించినా అకర్మణ్యుడుగానే నిలిచిపోతాడు. ఆ కర్మలకు సంబంధించిన సుఖదుఃఖజ్ఞానాన్ని కూడా పొందలేడు. కనుక ఈ మనసు ఇంద్రియాలలో ఏకాదశస్థానాన్ని పొందింది.

మనసు మదనగోపాలునియందు తన్మయమైన స్థితి మాత్రమే 'ప్రేమ' అవాలి. ద్రవావస్థాపన్న మానసం భగవద్వ్యాపారాలందు లగ్నమై భగవన్మయం అవుతుంది, గోపాల రూపాన్ని పొందుతుంది. అదే 'ప్రేమ' లేక 'భక్తి'.

శ్లో॥ ద్రుత చిత్తే ప్రవిష్టా యా గోవిందాకారతా స్థిరా,
సాభక్తి రిత్యభి హితా........"

(భక్తి రసాయనం.)

శ్లో॥ దేవానాం గుణలింగానా మానుశ్రవిక కర్మణామ్
సత్త్వ ఏవైక మనసో వృత్తిః స్వాభావికీ తుయా
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్॥

(శ్రీమద్భాగవతం,)

భక్తి సగుణ— సాకార పరమైనది మాత్రమే కాదు. నిర్గుణనిరాకారానికి కూడా సంబంధించింది.

మరువరాదు, నిర్గుణం— నిరాకారం అని ఎప్పుడు మనం చెప్తామో, అందులో సగుణం— సాకారం అనికూడ ధ్వనింపచేస్తున్నా మన్నమాట. భగవానుడు ప్రాకృతగుణ రహితుడు, అప్రాకృత గుణోపేతుడు, ప్రాకృతశరీరరహితుడు చిన్మయ శరీరుడు.

భక్తి రసస్వరూపం. అది మనసును ఆర్ద్రం చేస్తుంది రసస్వరూపుని, ఆత్మలో అప్రకటంగా ఉన్నవానిని ప్రకటం చేస్తుంది.

ఈ ప్రేమభక్తి చెప్పే విషయం, వ్రాసే విషయం కాదు.

శ్లో॥ ప్రేమాద్వయో రసికయోరపి దీప ఏవ
హృద్వేశ్మ భాసయతి నిశ్చలమేవ భాతి
ద్వారాదయం వదనతస్తు బహిష్కృతశ్చే-
న్నిర్వాతి శీఘ్రమథవా లఘుతాముపైతి॥

ఇరువురు రసికుల హృదయాలలో ప్రేమ దీపంవలె ప్రకాశిస్తోంది. ముఖద్వారాన దాన్ని అందరికి చూపించామా ఆ దీప ప్రకాశం పూర్తిగా అంతరిస్తుంది, లేదా క్షీణిస్తుంది.

లడ్డూలు ఎట్లా తయారుచేయాలి ? ఈ విషయంపై ఉపన్యసించి నందువలన, గ్రంథం వ్రాసినందువలన లాభం అత్యల్పంగా మాత్రమే ఉంటుంది. నాలుగు పర్యాయాలు

ఎట్లా తయారుచేయాలో స్వయంగా దగ్గరుండిచేసి చూపిస్తే, నాలుగుసార్లు సరిగా కుదరకపోతే అయిదవ పర్యాయం ఆ లడ్డూలు సరైన రూపంతో మన కనులముందుకు వస్తాయి. లడ్డూల్ని ఎలా తయారుచేయాలి ? ఈ విషయం చెప్పవలసిందే, వినవలసిందే. కాని అంతమాత్రం చాలదు, రంగంలోకి దిగి సాధనచేయాలి. నాలుగుసార్లు ప్రయత్నం వ్యర్థం కావాలి. ఇలా నాలుగుసార్లు చెడిపోయిన కారణం వలననే అయిదవసారికైనా లడ్డూల్ని బాగా తయారుచేయ గలుగుతున్నాం.

ప్రేమ అందరి హృదయాలలో ఉంది, ప్రేమ స్వరూపుడు, రసస్వరూపుడు అందరిలో ఉన్నాడు. ఆ సర్వజన హృదయాంతర్గత ప్రేమ రసమే జడ ప్రకృతి సాన్నిధ్యంతో, ఈ ప్రకృతిలో అన్నరసంగా ప్రవహించి క్షుద్రమై పోయింది, ఆంశిక మయింది.

"కించి న్న్యూనాంచ రసతాం యాతి జాడ్య
విమిశ్రణాత్."

(భక్తి రసాయనం)

అదే ప్రేమరసం అన్యకామనా రహితమై, జ్ఞానకర్మాద్యనావృతమై గోపాల సంబంధాన్ని పొందితే దివ్యమవుతుంది.

ప్రేమ పరిభాష :-

శ్లో॥ ఆసీనః పర్యటన్నశ్నన్ శయానః ప్రాపివన్ బ్రువన్,
నానుసంధత్త ఏతాని గోవింద పరిరంభితః॥

(శ్రీమద్భాగవతం స్కం 7 - అ 4 - శ్లో 38.)

ఆసనం, విహారం, శయనం, భోజనం, వార్తాలాపం సమస్త ఇంద్రియ కర్మలలో గోపాలరూపం ప్రకటం కావాలి. ఏ ఇంద్రియం ఏ కర్మ చేస్తున్నా గోపాలుడు మన వెను వెంటనే ఉన్నట్లుగా భావించాలి, వాస్తవానికి సమస్తేంద్రియాలచేత కర్మలు చేయించేవాడు గోపాలుడేగదా! అందువలన సమస్తేంద్రియాలు గోపాల ప్రీతి నిమిత్తం కర్మలు చేయాలి. రోమ రోమం గోపాలుని సాహచర్య భాగ్యాన్ని పొందాలి. ఇది దివ్యస్థితి. త్రిగుణాల్ని, త్రిగుణాత్మక ప్రపంచాన్ని పూర్తిగా అతిక్రమించినపుడే ఈ స్థితి లభిస్తుంది. అప్పుడే మానవుడు వాస్తవంగా ఆనందించగలుగుతాడు. అంతవరకు ఏం చేయాలి ? అంతవరకు మనలోని దైవశక్తిని, ఇంద్రియ చాలక శక్తిని నానావిధాలుగా ఉపయోగించుకోవాలి.

"శరీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్." (గీత.) శరీరావసర కర్మల్ని నిర్వర్తించటం తప్పుకాదు.

మన దగ్గర ఒక రూపాయి ఉంది. దానినెట్లా ఖర్చు చేయాలి? 25 పైసలతో పొట్ట నింపుకోవాలి, 25 పైసలతో ఆశ్రితుల పొట్టలు నింపాలి, 25 పైసలు దానం చేయాలి, 25 పైసల్ని రేపటి నిమిత్తం దాచుకోవాలి. ఇట్లాగే మనం ఇంద్రియశక్తిలో కొంత భాగాన్ని స్వార్థం నిమిత్తమై వినియోగించుకోవాలి, కొంత భాగాన్ని పరార్థం, కొంత భాగాన్ని

గోపాలప్రీత్యర్థం వినియోగించాలి, మరి కొంతభాగాన్ని ఖర్చు చేయకుండా ఇంద్రియతృప్తినిమిత్తం నిలువచేసికోవాలి. ఇట్టి అభ్యాసంవల్ల క్రమంగా సర్వేంద్రియాలు సర్వకర్మలు సంపూర్ణంగా తమ వెనుకనున్న గోపాలరూపాన్ని తమలో నింపుకోగలుగుతాయి.

కర్మేంద్రియా లయిదు :....

వాక్, పాణి, పాద, పాయూ పస్థలు.

జ్ఞానేంద్రియా లయిదు :—

త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ, శ్రోత్రములు.

విషయా లయిదు :—

శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం.

ఇంద్రియ తృప్తి నిమిత్తం విషయాల స్థానంలోకి ఇంద్రియపాలకుడు గోపాలుడు విషయంగా రావాలి. ఈస్థితినే 'ప్రేమ' అంటారు. ఇట్టి ప్రేమరసంలో ఇంద్రియాలు దివ్యంగా ఉంటాయి.

శ్లో॥ వాణీగుణాను కథనే శ్రవణౌ కథాయాం
హస్తౌచ కర్మసు మన స్తవ పాదయోర్నః,
స్మృత్యాం శిర స్తవ నివాస జగత్ప్రణామే
దృష్టి స్సతాం దర్శనేఽస్తు భవ త్తనూనామ్॥

(శ్రీమద్భాగవతం. స్కం.10-అ10-శ్లో38)

"వాక్కు గోపాలుని గుణాల్నే కీర్తించాలి. శ్రోత్రాలు భాగవతకథలనే వినాలి. హస్తాలు భగవత్పూజలే చేయాలి. పాదాలు దేవాలయాలకే వెళ్ళాలి. మనసు భృంగమై సదా ఆ పాదపద్మాలందే విహరించాలి. శిరసు భగవద్భాగవత సన్నిధానంలో వంగియుండాలి. దృష్టి సదా ఆ కోమల శ్యామ రూపమందే లగ్నం కావాలి."

ఇంక జీవి జీవితేశ్వరుని బాహుపాశమందు గోపికగా పరవశించాలి. "గోపాలా! ఇందుకు నీకృప కావాలి. నేనేమీ చేయలేని అసమర్థుడను. నీవిచ్చిన సాధనాలను సద్వినియోగం చేసికొనజాలని దౌర్భాగ్యుడను, పాపాత్ముడను. ఏమేమో చేయాలని ఉంది. కాని వంట వండుకోనిదే ఆకలి ఎట్లా తీరుతుంది? కాని వంట చేసికోలేకున్నాను. ఏం చేయను? ఆర్త జన రక్షకుడవు నీకు నాబాధ చెప్పుకొని, ఏడుస్తున్నాను. రక్షణభారం నీయందుంచి ఏడుస్తున్నాను. నీ దయ."

హృదయంలో ఉన్నవాని ప్రేరణలేకపోతే ఇంద్రియాలు ఏపనైనా ఎట్లా చేయగలుగుతాయి? అందువలన వాని కరావలంబనం నిమిత్తం కన్నులలోకి నీరు రావాలి. ఊయలలో పడుకొన్న శిశువు ఆగొన్నప్పుడు స్తన్యంకోసం ఎలా ప్రయత్నిస్తాడు? ఏడుస్తాడు. అంతే, అలాగే ప్రేమ నిమిత్తం ముముక్షువుకూడా నిరంతరం హృదయపూర్వకంగా విలపించాలి. దశేంద్రియాల్ని ప్రవర్తింపచేసే మనసును ఏ విధంగానైనా, ఏ భావంతోనైనా, పట్టి, హరంచేసి, గోపా

లుని తూలనాడినైనా సరే, ఆ నామరూపాలలోనికి తీసికొని పోవాలి.

రసం పరిభాష :—

శ్లో॥ బీజనిర్హరణం యోగః ప్రవాహో పరమోధియః,
తత్రోపాయ సహస్రాణా మయం భగవతోదితః॥
(శ్రీమద్భాగవతం, స్కం.7-అ7-శ్లో.28, 29)

చిత్తవృత్తి ప్రవాహం సమూలంగా నశించాలి ? ఎలా రస స్వరూపుడు వానిలో ప్రవాహం కావాలి. వీని సంగమంలో ప్రవహించేదే రసం. సమస్త భౌతికసుఖాలు కూడా రసస్వరూపుని యొక్క అభివ్యక్తియందు అంశామాత్రం. అఖండరసధారలు అయిదు. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యాలు.

గోపాలు డొకడే పురుషుడు - సమస్తజీవులు గోపికలు. గోపాలుడు ప్రియుడు - జీవుడు ప్రేయసి. ఈ రసరాజాన్ని 'మధుర' మంటారు. "స్త్రీప్రాయ మితరం సర్వాం జగన్నాథై క పూరుషమ్." సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్."

ప్రేమ ఇంద్రియాలను చిన్మయం చేస్తుంది, వృత్తిని త్రిగుణాతీతం చేస్తుంది. అప్పుడు మనసు మధురమవుతుంది. మనసు మధురం కావటానికి ఒకే ఒక్క ఉపాయం శ్రీహరి గుణగానం, మనోవాక్కాయ సమైక్యతాపూర్వకమైన శ్రీహరి గుణగానం.

"రాసలీల నిత్యం. అందలి రసం నిత్యం - సర్వవ్యాపక మరియు సర్వజన హృదయాంతర్గతం. సమస్త శ్రీకృష్ణా తార మూర్తులు నిత్యులు - భగవదభిన్నులు - రసస్వరు పులు - రసవిస్తారకులు. రాసలీల నిత్యం గోలోకంలో జరుగ తుంటుంది. బృందావనంలో జరుగుతుంటుంది. శరీర వ్ర భూమిలో, హృదయ బృందావనంలో జరుగుతుంటుంది. ఆ రాసలీలలో సమస్త జడచేతనాలకు నాటికి - నేటికి - ఏనాటి ప్రవేశార్హత ఉంది. కాననే ఏ ఒక్క గోపికా నామ శ్రీమద్భాగవతంలో ప్రత్యేకంగా ప్రకటింపబడలేదు."

(శ్రీ శ్రీధరస్వామి కృత భాగవత భాష్యం.

శ్లో॥ అధరం మధురం వదనం మధురమ్
నయనం మధురం హసితం మధురమ్
హృదయం మధురం గమనం మధురమ్
మధురాధిపత రఖిలం మధురమ్।

(శ్రీ వల్లభాచార్యులు)

"గోపాలా! నీ అధరం మధురం, వదనం మధురం, నయనాలు మధురం, హాసనం మధురం, హృదయం మధురం, గమనం మధురం, నీవు మధురాధిపతివి. కాన సమస్తం మధు రాతి మధురం."

ఇక్కడ మధురశబ్దం గోపాలుని భర్తగా భావింప చేస్తూ, జీవునకు గోపీ రూపాన్నిస్తుంది. ఈ ఉపాసనా స్వరూ పాన్నే 'మధుర' మంటారు.

అప్రాకృత దివ్య చిన్మయ ప్రేమ భావానికి పేరు 'మధురం.'

(1) అప్రాకృతం = ప్రకృతి సంబంధం లేనిది.

(2) దివ్యం = భౌతిక శరీర సంబంధం లేనిది.

(3) చిన్మయం = 'చిత్' యన్నది భగవదభిన్న రసశక్తి, లీలా నిర్వాహిక. ఈశక్తి సంకల్పం లేకపోతే జీవుడు, రసాస్వాదన చేయలేడు, గోపాలుడు ఏలీలయు చేయ లేడు. జీవుడు ఆశక్తి కృపాపాత్రుడగుటయే చిన్మయ స్థితి.

"భాగవతానికి ప్రాణం దశమస్కంధం, దశమస్కంధా నికి ప్రాణం రాసలీల, రాసలీలకు ప్రాణం గోపికాగీతలు. కాన భాగవతరసం అంటే రాసలీలయే, మధురరసమే. దానిని ప్రవ హింపచేయటమే ఈగ్రంథప్రణయనంలో గ్రంథకర్త యొక్క ఆశయం."

ప్రధాన సిద్ధాంతం :-

శ్లో॥ ఆరాధ్యో భగవాన్ వ్రజేశ తనయః తద్ధామ బృందా వనమ్

రమ్యాకాచిదుపాసనా వ్రజవధూ వర్గేణ యాకల్పితా,
శ్రీమద్భాగవతం ప్రమాణమమలం ప్రేమాపుమర్థో మహాన్,
శ్రీచైతన్యమహాప్రభోర్మతమిదం తత్రాగ్రహోనాపరః॥

(శ్రీ చైతన్య మహాప్రభువు.)

ఆరాధ్యు డెవడు? భగవాన్ వ్రజేశ తనయుడే. శ్రీధా మేది? శ్రీబృందావనమే. రమ్యమైన ఉపాసన ఏది? గోపి భక్తియే. ఏది ప్రమాణశాస్త్రం? ఒక్క శ్రీమద్భాగవతం. ఏది పరమార్థం? ఒక్క ప్రేమమాత్రమే. ఇది శ్రీచైతన్యమహా ప్రభువు మతం. ఇందుకు భిన్నంగా ఏమైనా ఉంటే అది ఉపేక్షణీయమే.

ప్రేమ అంటే ఇంద్రియాలు చిన్మయం కావటం అన్నాం. రసం అంటే మనసు రసస్వరూపుని యందు ప్రవహించటం అన్నాం. అంటే ఇప్పుడు శ్యామరసాస్వాదనకు ఏకాదశేంద్రియాలు చిన్మయపాత్రలైనా యన్నమాట.

శ్లో॥ ఏషాంతు భాగ్య మహిమాచ్యుత తావదాస్తా
ఏకాదశైవహి వయం బత భూరి భాగాః,
ఏతద్ధృషీక చషకై రసకృత్ పిబామః
శర్వాదయోం ఘ్ర్యుదజమధ్వమృతాసవం

(శ్రీమద్భాగవతం. స్కం 10 - అ 14 - శ్లో 33)

బ్రహ్మస్తుతి ప్రవాహగతి కలితం. "ఈ వ్రజవాసులెంత ధన్యులు! ఎంత ధన్యులు!! వీరి సౌభాగ్యాన్ని వర్ణింపగలవారెవరు? వీరు ఏకాదశేంద్రియాల్ని పానపాత్రలుగా చేసుకొని శ్రీకృష్ణరూపామృతాన్ని నిరంతరం ఆస్వాదిస్తున్నారు. ఎంత ధన్యులు! ఆ ఏకాదశేంద్రియాలలో ఒక్కొక్క ఇంద్రియానికి ప్రత్యేకంగా మేము అధిష్ఠాతృ దేవతలం. ఒక్క ఇంద్రియపాత్రనుండి మేమెంత శ్యామరసం ఆస్వాదించగలం

ఆరాధ్యు డెవడు? భగవాన్ వ్రజేశ తనయుడే. శ్రీధామ మేది? శ్రీబృందావనమే. రమ్యమైన ఉపాసన ఏది? గోపికా భక్తియే. ఏది ప్రమాణశాస్త్రం? ఒక్క శ్రీమద్భాగవతమే. ఏది పరమార్థం? ఒక్క ప్రేమమాత్రమే. ఇది శ్రీచైతన్యమహా ప్రభువు మతం. ఇందుకు భిన్నంగా ఏమైనా ఉంటే అది ఉపేక్షణీయమే.

ప్రేమ అంటే ఇంద్రియాలు చిన్మయం కావటం అన్నాం. రసం అంటే మనసు రసస్వరూపుని యందు ప్రవహించటం అన్నాం. అంటే ఇప్పుడు శ్యామరసాస్వాదనకు ఏకాదశేంద్రియాలు చిన్మయపాత్రలైనా యన్నమాట.

శ్లో॥ ఏషాంతు భాగ్య మహిమాచ్యుత తావదాస్తా
ఏకాదశైవహి వయం బత భూరి భాగాః,
ఏతద్ధృషీక చషకై రసకృత్ పిబామః
శర్వాదయోం ఘ్ర్యుదజమధ్వమృతాసవం తే॥
(శ్రీమద్భాగవతం. స్కం 10 - అ 14 - శ్లో 33.)

బ్రహ్మస్తుతి ప్రవాహగతి కలితం. "ఈ వ్రజవాసు లెంత ధన్యులు! ఎంత ధన్యులు!! వీరి సౌభాగ్యాన్ని వర్ణించ గలవారెవరు? వీరు ఏకాదశేంద్రియాల్ని పానపాత్రలుగా చేసి కొని శ్రీకృష్ణరూపామృతాన్ని నిరంతరం ఆస్వాదిస్తున్నారు. ఎంత ధన్యులు! ఆ ఏకాదశేంద్రియాలలో ఒక్కొక్క ఇంద్రియానికి ప్రత్యేకంగా మేము అధిష్ఠాతృ దేవతలం. ఒక్క ఇంద్రియపాత్రనుండి మేమెంత శ్యామరసం ఆస్వాదించగలం.

ధన్యులు వారు, ఏకాదశేంద్రియపాత్రలతో ప్రేమరసాస్వాదన చేసే ఆ వ్రజవాసులు."

ఇంద్రియాలు గోవులు. ఇది గోకులం. దీన్ని పరిపాలించేవాడే గోపాలుడు.

శ్లో॥ ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాం గతా,
సర్వేశే మనసో వృత్తిర్ భక్తిరిత్యభిధీయతే॥
(శ్రీమధుసూదన సరస్వతీస్వామి.)

ఇంతవరకు మనసు ప్రపంచవిషయాలందు పరుగిడింది. ప్రపంచవిషయాలు దానికి వ్యసనాలైనాయి. ఇప్పుడు భగవద్విషయాలంతగా వ్యసనాలు కావాలి. విడచి ఉండజాలని సహజప్రవృత్తిని 'వ్యసన' మంటారు. భగవద్వ్యాపారాలు వ్యసనాలు కానంతవరకు, త్రిగుణాతీతస్థితి సిద్ధించనంతవరకు ధర్మమార్గాన పయనించి తీరవలసిందే. ఈ ధర్మానుష్ఠానం ఒక్కటిమాత్రమే జీవుని భగవద్భావమయుని చేస్తుంది, త్రిగుణాతీతుని చేస్తుంది, చంచలమానసాన్ని అచంచల ప్రేమభావంలోనికి ఆకర్షిస్తుంది. అసత్యం పలుకుచున్నంతవరకు సత్యవచనాన్ని కూడా రెండవవైపున పోషించి తీరవలసిందే. హింసాప్రవృత్తి మాయం కానంతవరకు అహింసకు స్థానమిచ్చి తీరవలసిందే. క్రౌర్యం నశించనంతవరకు భూతదయనిమిత్తం మనసును సాధికారంగా సేవాధర్మంలో నియమించవలసిందే. బలవంతంగా రెండు విరుద్ధధర్మాలలో మనసు నీవిధంగా నియమించాలి. వాక్కుని, శరీరాన్నికూడా సంతతం తదనురూప

క్రియావిధానాలలో విశేషంగా లీనంచేయాలి. క్రమంగా ధర్మమార్గంలో ప్రకాశం ప్రకటమైతే, ధర్మబీజాలు బలిష్ఠమయితే సహజంగానే విషయవాసనలు అదృశ్యమవుతాయి ఆపైన ఒకవిధంగా మనసు ఏమీతోచనిస్థితిని పొందుతుంది కారణం విషయవాసనలూ లేవు, ధర్మమూ ఇంకా ఫలదశకు రాలేదు. ఇట్టిస్థితిలో అతృప్తితో, నిరంతర నిర్వేదంతో తాను రసీభవించి, ఇంద్రియాల్ని రసీభవింపచేయాలని తన కావలవున్న బుద్ధిముఖంగా ప్రయాణిస్తుంది. ఇంతవరకు అదే మనసు భౌతిక విషయాలముఖంగా ప్రయాణించింది. ఈ విధంగా పరసహాయావశ్యకతను గుర్తించినప్పుడు మనస బుద్ధికి, ఆత్మకు వశమై అచంచలస్థితిని పొందుతోంది. తాన తానుగానే ఉంటూ రసాస్వాదనకు ప్రధానయంత్రరూపమై సర్వతోముఖంగా తన సహకారాన్ని అందిస్తోంది. ఇట్టిస్థితిలో ఆత్మరూపంగా క్రియాత్మక రసతత్త్వమైయున్న మదనగోప లుడు మనస్సహితంగా సమస్తేంద్రియాల్ని తనలోనికి సంగ్రహించి, 'భావం' లేక 'రతి' ననుగ్రహిస్తాడు, సరసం చేస్తాడు. ఇదే ప్రేమభక్తిస్వరూపం. "సార్వాత్మ్యేతు సర్వమింద్రియం సర్వవిషయ గ్రాహకం భవతి."

(శ్రీహరివంశం -భవిష్యపర్వం - అ 2 - శ్లో 15.
నీలకంఠవ్యాఖ్య.)

శ్లో॥ నకర్హి చిన్మత్పరా శ్శాంతరూపే
నం క్ష్యంతి నోమేఽనిమిషో లేఢి హేతిః,

యేషామహం ప్రియ ఆత్మా సుతశ్చ
సఖా గురు స్సుహృదో దైవమిష్టమ్॥
(శ్రీమద్భాగవతం.)

లోకనిష్ఠను వదలి శుద్ధ స్వరూపుడగు భగవానుని యందు ఎవరు నిష్ఠకలిగి యుంటారో అట్టి వారికి భగవంతుడు ప్రేమపాత్రుడు, స్నేహవిషయము, విశ్వాసాస్పదుడు, ఉపదేశకుడు, హితమొనర్చువాడు, ఇష్టదైవము అవుతున్నాడు. ఇంక వారు తమ యోగక్షేమాల్ని గురించి, చింతించనవసరం లేదు. కాలరూప ఖడ్గానికి వారు ఆహుతికారు.

శ్లో॥ పతి పుత్రి సుహృద్ భ్రాతృ పితృవన్మిత్రవద్ధరిమ్,
యేధ్యాయంతి సదోద్యుక్తా స్తేభ్యోఽపీహ నమో
నమః॥
(భక్తిరసామృత సింధువు.)

ఉత్సాహవంతులై భక్తజనులు గోపాలుని భర్తగా, పుత్రునిగా, హితకారిగా, సోదరునిగా, జనకునిగా, మిత్రునిగా భావించి, ధ్యానించాలి. అలా చేసేవారికి నేను నమస్కరిస్తున్నాను.

శ్లో॥ శుద్ధ సత్త్వవిశేషాత్మా ప్రేమ సూర్యాంశు సామ్య
భాక్,
రుచిభిశ్చిత్త మాసృణ్య కృదసౌ భావ ఉచ్యతే॥
(భక్తిరసామృత సింధువు.)

శ్రీకృష్ణుని స్వరూప మాధుర్యాన్ని ఆస్వాదించాలి. ఆ స్వరూపాన్ని అంతర్బహిః ప్రాణంగా, మనోవాక్కాయాలుగా, దారాపుత్రమిత్ర ప్రభృతి పరివారంగా, సమస్త ప్రపంచంగా మన కనులముందుకు, మనలోనికి ఈనాడు, ఈ కలియుగంలో, ఈక్షణంలో తీసికొనిరావాలి. ఈప్రేమ శుద్ధ సత్త్వప్రధానమై ఉంటుంది. శుద్ధ సత్త్వం స్వరూపలక్షణంగా కలది భావం. పై అభిలాష, ప్రేమ, రుచి హృదయాన్ని కోమలంచేస్తాయి. ఆ ద్రవావస్థాపన్నచిత్తవృత్తినే, హృదయం యొక్క స్నిగ్ధావస్థనే 'భావం' అంటారు.

శ్లో॥ సమ్యక్ మసృణీత స్వాంతో మమత్వాతిశయాంకితః,
భావస్సఏవ సాంద్రాత్మా బుధైః ప్రేమా నిగద్యతే॥
(భక్తి రసామృత సింధువు.)

ప్రేమ ఎట్టిది? సంపూర్ణంగా హృదయాన్ని ఆర్ద్రం చేసేది, మమత్వాతిశయంతో చూడినది, మమత్వ -ప్రియత్వ సంపన్నమైనది మరియు ప్రగాఢ భావభరితమైనదిమాత్రమే.

ఏమి రసవాహిని! ఏమి రసవాహిని!! శ్రీకృష్ణదర్శనం చేయటానికి వెళ్ళిన గోపికల సమస్తేంద్రియాలు నేత్రవ్యాపారాన్ని పొందాయి. ఆ నేత్రపాత్రిలలో అఖండంగా శ్యామ రసం ప్రవహించి ఇంద్రియాల్ని, ఇంద్రియాధిష్ఠాతృ దేవతల్ని తృప్తి పొందించింది.

వేణువాదన సమయంలో గోపికల సమస్తేంద్రియాలుశ్రోత్ర వ్యాపారాన్ని పొందాయి. సమస్తేంద్రియ పాత్రిలలో వేణుగానమాధుర్యం అఖండంగా ప్రవహించింది. ఇన్ని మాటలేల?

సమస్తేంద్రియాలు సమస్తవ్యాపారాలలో ప్రవృత్తమయ్యే నాయి. నేత్రేంద్రియానికి శ్రవణశక్తి, శ్రోత్రేంద్రియానికి త్వగింద్రియానికి దర్శనశక్తిలభించింది. ఏమిటి ఆశ్చర్యమా? ఇదెంతమాత్రం వర్ణనకాదు సుమండీ. ఉన్నతాధికారుల మహోన్నత ప్రేమానుభవం. శ్రీకృష్ణుని సమస్తలీలలు రస వర్షకాలు, అప్రాకృతాలు. అవి నిత్యం బృందావనంలో ప్రకట రూపం ధరిస్తుంటాయి. అప్పుడు అంశికంగా అవి భౌతికాల వలె గోచరిస్తాయి. అలాగోచరిస్తూ భౌతికజీవుల్ని తమలోనికి ఆహ్వానించి, వారి సమస్త భౌతికవాసనల్ని, ప్రాకృతత్వాన్ని, జీవత్వాన్ని పూర్తిగా మార్చివేస్తాయి, క్రొత్త శరీరాన్ని, శ్రీకృష్ణపరివారంలో సభ్యత్వాన్ని అనుగ్రహిస్తాయి. జీవుడే ఈవిధంగా మార్పుచెందేటప్పుడు ఇంద్రియాలు తమతమ ధర్మాల్ని కోల్పోయినాయంటే ఆశ్చర్యాన్విషులం కావల సిన అవసరమే లేదు. రసస్వరూపుడు - అంతరాత్మ స్వరూ పుడు మదనగోపాలునితో నిరంతరసాంగత్యం వలన అసం భవం కూడ సంభవమై తీరుతుంది. ఇప్పుడు సమస్తేద్రిం యాలు మదనగోపాలస్వరూపాలు. సమస్తేంద్రియ వ్యాపా రాలు - సమస్తవృత్తులు ఆ రసస్వరూపునిలో రసీభవిం చాయి. ఇదే 'రాసలీల'. 'రసం' నుండి జన్మించిన శబ్దమే 'రాస'. ఒకటేమాట! ప్రతిజీవి హృదయంలో ప్రకటంగా నిరంతరం రాసలీల జరగాలి, రసాస్వాదన జరగాలి, జీవుడు రసస్వరూపుడు కావాలి. ఇదే రాసలీలా రహస్యం.

ఏ దేవుని తత్త్వానికైనా పరిపూర్తి సుషుమ్నానాడీగత షట్చక్రాలలో సిద్ధిస్తోంది. చెప్పి, చెప్పి, చెప్పి చివరకు సారం ఏం చెప్పబడుతోందంటే, "నరుడా! నీశరీరాన్ని మరిచిపో, నీ వ్యక్తిత్వాన్ని మరిచిపో, భగవంతుణ్ణి నీలోచూడు, నీవు భగవంతుడవైపో" ఇంతే, ఇదే సారం. అమ్మవారిని, అయ్యవారిని గురించి చెప్పుకొనేటప్పుడు, పూజించేటప్పుడు, ధ్యానించేటప్పుడు ఆయా దేవతలు స్వహృదయంలో ఉన్నట్లుగా, వారు మనల్ని బాహ్యజగత్తునుండి, త్రికరణాల సీమనుండి ఆవలకు నడిపిస్తున్నట్లుగా, చివరకు ఆ దేవతలు మన ఇంద్రియాలలో ఉన్నట్లుగా, జీవుడు భగవత్స్వరూపుడైనట్లుగా భావించి, ఉపాసిస్తాము, అనుభవం సంపాదిస్తాము. జీవుడు ఏనాటికైన ఆధిభౌతిక ప్రపంచంనుండి ఈఆధ్యాత్మిక ప్రపంచానికి పయనించి తీరవలసిందే. కాన సమస్త శ్రీకృష్ణలీలల్ని, రాసలీలను హృదయంలో దర్శించాలి, వానిలోని రహస్య మేమిటో త్రికరణాల్ని మరచి మాత్రమే గ్రహించాలి. త్రికరణాల్ని మరచిన తరువాత ఇంక గ్రహించే దేముంది? జీవుడు నిస్సంశయంగా తద్రూపుడై పోతాడు.

వృత్తులే గోపికలు. ప్రేమరసాన్ని గోప్యంగా ప్రవహింపచేసికొనే వారిని 'గోపిక' లంటారు. ఈవృత్తులు ఆత్మయందు లయించటమే, గోపికలు మదనగోపాలుని యందు రమించటమే 'రాసలీల'. ఇంద్రియపాలకుడు ఇంద్రియములతో అథవా వృత్తులతో రమించేటప్పుడు సమస్తేంద్రియాలు అఖం

డంగా నానాముఖాలుగా రసాన్ని ప్రవహింపచేస్తాయి. ఇదే రాసలీలారసం. ఆ స్థితిలో సమస్త ఇంద్రియాధిష్ఠాతృ దేవతలు రాసవిహారిని కౌగలించుకోనటానికి పరుగు తీస్తున్నారు. ఇంద్రియాలు శ్యామరస సంసర్గంలో చిద్రూపాలై, గోపాల స్వరూపాలై తృప్తిలో అతృప్తిని, అతృప్తిలో తృప్తిని అనుభవిస్తున్నారు. ఇట్టి సుమధుర శుభఘడియలలో జీవు డెక్కడ ఉన్నాడో, సుఖిస్తున్నాడో, దుఃఖిస్తున్నాడో ఎవరు చెప్పగలరు ? ఎవరు వినగలరు ? ఇది నిస్సంశయంగా అనుభవగమ్యం. అనుభవించినవారైనా అతిశయ ప్రేమభావంతో అన్యులను అనుభవసంపన్నుల్ని చేయవలసిందేగానీ ఇతరోపాయాలతో అనుగ్రహించలేరు. అనుభవవిషయాన్ని వాగింద్రియంతో వర్ణించటం ఎవరికైనా ఎట్లా సాధ్యమవుతుంది ?

శ్లో॥ వీతరాగ భయక్రోధాః మన్మయా మాముపాశ్రితాః,
బహవో జ్ఞాన తపసా పూతా మద్భావమాగతాః॥
(భగవద్గీత. అ 4-శ్లో 10)

సమస్తేంద్రియాలు, ముఖ్యంగా మనసు విషయాభిముఖంగా పరుగిడితే విషయరూపమవుతాయి, శ్యామరసాస్వాదనకు పరుగిడితే శ్యామరూప మవుతాయి. విషయాసక్తిగల మనసు విషయసుఖాలు లభించకపోతే క్రోధానికి వశమవుతుంది, విషయసుఖాలు ప్రాప్తించకుండా నిరోధించే వారిని ద్వేషిస్తుంది. ఈ రాగద్వేషాలమధ్య భయం జనిస్తుంది. "ఈ విషయసుఖం ఎట్లా శాశ్వతంగా ఉంటుంది ?

శత్రువులనుండి ఈ సుఖాన్ని రక్షించుకోనటం ఎట్లా ?” ఇదే భయం. ఈ రాగభయ క్రోధాలు నశించినప్పుడు, గోపాలుని శరణువేడితే జీవుడు భగవద్భావాపన్నుడవుతాడు. జ్ఞానం — తపం. నామాలు రెండు. రూపం ఒక్కటే. పైగీతాశ్లోకం జ్ఞానమార్గాన్ని సూచిస్తోంది. ఇందలి ‘భావా’నికి ఆదిశంకరుల పరిభాష ‘మోక్షం’, శ్రీధరస్వామి పరిభాష ‘భగవత్సాయుజ్యం’, శ్రీ మధుసూదన సరస్వతీస్వామి పరిభాష ‘భగవత్ప్రీతి’.

(తాన్ స్వపార్షదీకృత్య తైః సార్ధమేవ యథా సమయమవతరన్నన్తర్ధానశ్చ తాన్ ప్రతిక్షణమనుగృహ్ణన్నేవ తద్భజనఫలం ప్రేమాణం దదామి.)

(సారార్థ దర్శినీ — టీకా. శ్రీ విశ్వనాథ చక్రవర్తి.)

“భగవానునకు, భగవత్ప్రేమికులకు మానవీయ జన్మకర్మ లుండనే ఉండవు. వారు ప్రేమతో భగవదారాధనచేసి నిత్యధామంలో భగవత్పార్షదులవుతారు, భగవత్పరివారంలో సభ్యులవుతారు. భగవంతుడు అవతరించే సమయాలలో వారుకూడ భగవదభిన్నమైన దివ్యజన్మాన్ని గ్రహించి, భక్తిరసవర్ధకాలైన కళ్యాణ కర్మలనే చేస్తారు.”

భగవద్ధ్యానంవల్లను, భగవల్లీలా శ్రవణంవల్ల అంతర్ముఖత్వం ప్రాప్తిస్తుందని, ఇంక ఈ భౌతిక ప్రపంచంతో సంబంధం ఉండనే ఉండదని అనుకోకండి. భౌతికప్రపంచాన్ని,

భౌతిక జీవుల్ని రసస్వరూపుల్ని చేసేందుకు అంతర్ముఖులుకూడా భౌతికశరీరంతో, ప్రపంచంతో తప్పకుండా సంబంధం కలిగి యుంటారు. భౌతికశరీరాన్ని వీడినతరువాతకూడా, ప్రత్యేక మైన అస్తిత్వంతో భగవద్ధామములందు భగవత్సేవ చేసి కొంటూ, భగవదవతారసమయాలలో మరల భారతధాత్రిపై జన్మగ్రహణం చేస్తారు. కాన ప్రేమీ భక్తులారా! ఇట్టి వైభవం నిమిత్తం మనం శ్రీకృష్ణభక్తి చేయాలి, భాగవత కథారసాన్ని ఆస్వాదించాలి. "పిబత భాగవతం రసమాల యం."

ఎప్పుడో భౌతికశరీరాన్ని త్యజించిన తరువాత గోలో కంలో శ్రీకృష్ణపరివారంలో సభ్యుల మవుతామా? భక్తి వలన భౌతిక ప్రపంచంలో - శరీరంలో ఏమీలాభం ఉండ దన్నమాట. అయితే మాకు భక్తి అవసరం లేదు. ఇది కొందరి వాదం.

వినండి, భక్తి అంటే ప్రేమ. ప్రేమ తక్షణం ప్రియుని ప్రేమికుల దగ్గరికి చేర్చుతుంది. ఈ కలియుగంలో, ఈనాడు, ఈ క్షణంలో మనదగ్గరికి చేర్చుతుంది. చేర్చలేకపోతే అది ప్రేమయే కాదు, దంభమన్నమాట. ప్రియుడు రంగనితో వినోద విహారాలు చేసిన అసంఖ్యాక పాండురంగ భక్తులు ఏ కాలంలోనివారు? నిన్న మొన్నటివారు. ఇరువురు మిత్రులు ఎలా ముఖాముఖీ ప్రేమవ్యవహారాల ద్వారమున రసాస్వాదన

చేస్తాడో అలాగే భగవానుడు - భక్తుడు కూడా ప్రకటంగా ముఖాముఖీ శరీరాలతో సమావేశ మవుతారు,

శ్లో॥ యదా సర్వే ప్రముచ్యంతే కామాయస్య హృదిశ్రితాః,
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥
(కఠోపనిషత్.)

"హృదయంలో ఉండే సమస్త విషయవాసనలు సమూలంగా నశించినప్పుడు మానవుడు ఇక్కడే, ఈ భూలోకంలోనే అమృతస్వరూపుడై, బ్రహ్మాన్ని పొందుతున్నాడు."

సంబంధంతో గోపాలుని ప్రేమించాలి. అప్పుడందులో మాధుర్యాన్ని ప్రవహింపచేసే నిమిత్తం గోపాలుడు మన ఇంద్రియాలముందుకు వస్తాడు. అప్పుడు సమస్తేంద్రియాలు దివ్యంగా ఉంటాయి గానీ భౌతికంగా ఉండనే ఉండవు.

అసలు గోపాలు డెక్కడ ఉన్నాడు? పరవార సమేతంగా గోలోకంలో ఉన్నాడు. ఆ గోలోక సహితంగా అందరి హృదయాలలో ఉన్నాడు.

"నఖలు గోపికా నందనో భవా నఖిల దేహినా
మంతరాత్మదృక్."
(శ్రీమద్భాగవతం. స్కం.10-అ31-శ్లో4)

గోపికలంటున్నారు; "గోపాలా! నీవు యశోదా తనయుడవా? కానేకావు. సమస్తభూతాల కాత్మవు."

ప్రేమవలన హృదయంలో అప్రకటంగా ఉండేవాడు ప్రకటంగా కనులముందుకు వస్తాడు. మన ప్రేమ భావం

గోపాలుని ఆకర్షిస్తే, ఆతని వేణుగానం సమస్త జడ చేత
నాన్ని రాసలీల లోనికి ఆహ్వానిస్తుంది.

శ్లో॥ సర్వస్యచాహం హృది సంనివిష్టో
మత్తఃస్మృతిర్జ్ఞాన మపోహనం చ॥
(భగవద్గీత. అ 15 - శ్లో 15.)

"ఆ పురుషోత్తముడు సమస్త భూతాలలో ఆత్మస్వ రూపుడై ఉన్నాడు. అలా ఉండటంవల్లనే ఈభూతాలు సుఖ ముగా జీవింపగలుగుతున్నాయి, సుఖిస్తున్నామనే జ్ఞానాన్ని పొందగలుగుతున్నాయి, చూడగలుగుతున్నాయి, మాట్లాడ గలుగుతున్నాయి, ఆహారం స్వీకరించి జీర్ణంచేసికొన గలుగు తున్నాయి. సుఖము, సుఖజ్ఞానము, సుఖించువాడు ఆపురుషో త్తముడే. ఆతడే ఈ బ్రహ్మాండాలుగా ప్రకటమైనాడు, వీనికి నాయకుడైనాడు, వీనికి చైతన్యమైనాడు. అన్నీ తానై ఉన్నాడు, అన్నింటిలో ఉన్నాడు, అన్నింటికి అతీతంగా ఉన్నాడు. ఉన్నాడనే వారికి ఉన్నాడు, లేడనే వారికి లేడు. వాడే వీడు, వీడే వాడు. మనిషి మనుగడ అతడే. ఆతడే మని షిని ఋషిగా, రసికునిగా చేస్తాడు. బుద్ధిసంశయ విపర్యయాది దోషాలు నశింపచేసికొనటానికి శక్తి ననుగ్రహిస్తాడు."

అందువలన మనమందరం ఆతనివారలమై జీవించాలి. అన్ని పనులను ఆతనికే అర్పించాలి, ఆతని ఆజ్ఞగా పనులు చేయాలి.

శ్లో॥ వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్,
విష్ణురారాధ్యతే పంథా నాన్యత్తత్తోష కారణమ్॥
(విష్ణుపురాణం - పరాశర వచనం.)

బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులు వారి వర్ణధర్మాల్ని - ఆచరించితీరాలి, బ్రహ్మచారి- గృహస్థుడు- వానప్రస్థుడు - సన్న్యాసి వారి ఆశ్రమధర్మాల్ని ఆచరించి తీరాలి. ధర్మాన్ని గౌరవించటం ధర్మప్రభువును భజించుటమే అవుతుంది. ఆ ధర్మమే ధర్మప్రభువు సంబంధంతో రసంగా హృదయంలో ప్రవహిస్తుంది. ఒకటేమాట! శరీరాని కెంత వరకు ఆహారనిద్రాభయమైథునము లవసరములో అంతవరకు వానితోపాటుగా ధర్మం కూడా అత్యంతావశ్యకం.

ఏమి చేసినా 'కృష్ణార్పణంగా' చేయాలి.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్॥
(భగవద్గీత. అ 9 - శ్లో 27.)

"అర్జునా! నీవేమి చేసినా, ఏమి తిన్నా, ఏమి హోమం చేసినా, ఏ తపముచేసినా, సమస్తాన్ని నాకర్పితం చేయి."

ధర్మకర్మల్ని ఆచరించటంవలన, కృష్ణార్పణంగా ఆచరించటంవలన క్రమంగా చిత్తవృత్తి వీని అనుష్ఠానబలంతో ఆధర్మప్రభువు గోపాలుని దిశకే ఉన్ముఖమై, తన అస్తిత్వాన్ని గోపాలుని సుందర శ్యామరూపమందు అదృశ్యం చేసికొం

టుంది. గోపాలసంబంధంతో ఆర్ద్రమైన హృదయం రస రూపంలో పరుగులు తీస్తుంది. ఈ విధంగా ధర్మత్యాగం సంభవిస్తుంది.

శ్లో॥ ఆజ్ఞాయైవ గుణాన్ దోషాన్ మయాదిష్టానపి స్వకాన్,
ధర్మాన్ సంత్యజ్యయః సర్వాన్ మాంభజేత్సచ
సత్తమః ॥
(భాగవతం. స్కం 11 – అ 11–శ్లో 32.)

"భగవద్విహితాలైన బ్రాహ్మణ- క్షత్రియ- వైశ్య- శూద్రాదిధర్మాలలో, బ్రహ్మచర్య - గార్హస్థ - వానప్రస్థ - సన్న్యాసాశ్రమ ధర్మాలలో ఏ గుణదోషా లున్నాయో బాగుగా విచారించి, వానిని పూర్తిగా త్యజించి, ఎవడు సర్వాశ్రయుడు - స్వతంత్రుడు నగు శ్రీకృష్ణుని భజిస్తాడో వాడే సాధుసత్తముడని స్తుతింపబడతాడు."

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి
మాశుచః ॥
(భగవద్గీత అ 18 – శ్లో 67.)

"సమస్త ధర్మకర్మలను, వర్ణాశ్రమ ధర్మములను పరిత్యజించి, అనగా వానికి అతీతుడై నరుడు భగవానునకొక్కనికే శరణాగతుడు కావాలి. అప్పుడు భగవానుడు ఈనరుని ధర్మత్యాగరూప దోషంనుండి, సమస్త పాపాలనుండి, పాప

హేతువులైన అరిషడ్వర్గాలు - త్రిగుణాలు - త్రిగుణాత్మక జగత్తునుండి ఉద్ధరిస్తాడు."

పైన చెప్పిన జ్ఞానం, భగవానుడు రక్షిస్తాడనే విశ్వాసం, శరణాగతి ఎక్కడ సమ్మిళితమవుతాయో దాన్ని 'జ్ఞానాత్మకభక్తి' అంటారు.

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతేపరామ్॥
(భగవద్గీత అ 18 - శ్లో 65.)

అనన్యాశ్రయంతో ధర్మాన్నతిక్రమించాలి, అచంచల యోగంతో సగుణసాకార సీమ నతిక్రమించాలి, సమస్త భూతాలు భగవద్విగ్రహాలని సమబుద్ధిని సంపాదించాలి, జడవత్ జడవిషయాల నిమిత్తం దేనికీ శోకించరాదు. ఇట్లా బ్రహ్మణ్యుడై ఎవడుంటాడో వాడే శుద్ధ పరాభక్తి కర్హుడు. జ్ఞానమే నిర్మలమై, ఉజ్జ్వలమై, విశిష్టపాకదశను పొందినపుడు, రసీభవించినపుడు పరాభక్తి స్వరూపాన్ని ధరిస్తోంది.

క్రమంగా భక్తి జ్ఞానగంధశూన్యమై, గోపాలసంబంధంతో గోపాల రసమయం అవుతుంది.

శ్లో॥ జ్ఞానే ప్రయాస ముదపాస్య నమంత ఏవ
జీవంతి సన్ముఖరితాం భవదీయవార్తామ్,
స్థానస్థితాః శ్రుతిగతాం తను వాఙ్మనోభిః
యే ప్రాయ శోఽజిత! జితోప్యసితైస్త్రిలోక్యామ్॥
(శ్రీమద్భాగవతం. స్కం 10 - అ 14 - శ్లో 3.)

“గోపాలా! నీవధోక్షజుడవై, అభక్తులకు పొందనలవి గాకున్నావు. అపరిమేయుడవగుటచే ముల్లోకములలో ఎవరికిని జయింప శక్యంకాకున్నావు. అయితే నిన్ను, నీప్రేమను ఏవిధంగా సంపాదించాలి ? మహాభాగవతులవలన నీకథలను వినాలి. నీ నామరూపగుణలీలామయాలైన కథలు వినాలి. వినటం అంటే ఎట్లా? విన్నందువలన గోపాలునకు సాధకుడు ఆత్మసమర్పణంచేసి, కృష్ణైక జీవనుడు కాగలగాలి. అట్టివారు మాత్రమే, గోపాలా! నిన్ను జయింప గలుగుతారు.”

అట్టి కృష్ణైక జీవనుల సర్వేంద్రియాలలో ప్రేమ అఖండ రసవాహినిగా ఉంటుంది. ఏది నిజమైన జీవనం? కృష్ణ ప్రేమగల జీవనమే. ఏది నిజమైన ప్రేమ ? కృష్ణునియందు మనో వాక్కాయాలు కృష్ణమయాలయిపోవటమే. సత్కృష్ణ రాగం చివరకు జీవిని నిత్యకృష్ణ సహచరునిగా చేసి తీరుతుంది. ఈ సంబంధ బంధం ప్రారంభంలో భావ ప్రధానం, అంతంలో రసప్రధానం. ఇంతవరకు చెప్పబడినట్లుగా ఈ ప్రేమ రసానుభవాన్ని సాధకులు ధర్మానుష్ఠానంతో ప్రారంభించి, సోపానారోహణ క్రమంతో సర్వేంద్రియాలలో ప్రవహింపచేసికొంటారు. కొందరు కొన్ని మెట్లే ఎక్కగలుగుతారు, మరికొందరు మరి కొన్ని మెట్లు ఎక్కగలుగుతారు, కొందరు పూర్ణవిజయాన్ని సాధిస్తారు. అది వారి అదృష్టంమీద ఆధారపడి వుంటుంది.

శ్లో॥ కృష్ణ భక్తి రసభావితామతిః
క్రీయతాం యది కుతోఽపిలభ్యతే,
తత్ర లౌల్యమపి మూల్య కేవలమ్
జన్మకోటి సుకృతైర్నలభ్యతే॥

(శ్రీరామానందరాయులు.)

"శ్రీకృష్ణ భక్తిరసం ఎక్కడైనా లభ్య మయ్యేటట్లుయితే, లేదా దేశకాలపాత్రల ననుసరించి అనుష్ఠాన ఫలంగా లభ్యమయ్యేటట్లయితే తప్పక వెలయిచ్చి స్వంతం చేసికోండి. ముముక్షువులారా! శ్రీకృష్ణ భక్తిరసం ఇంత సులభంగా లభ్య మవుతుందా! దాన్ని పొందటానికి ఒకే ఒక్కటి ఉండాలి. లోభం - ఆసక్తి".

"గోపాలుడు సమస్త మానవులకు ఈలోభాన్ని అనుగ్రహించుగాక!"

## (4) శ్రీకృష్ణుడు నిత్యుడు

గోపాలకృష్ణుడు నిత్యుడు, దేశకాల పరిధికి అతీతుడు, భక్త కామధేనువు, భక్తులెప్పుడు పిలిస్తే అప్పుడు పలుకుతాడు, ఏనాడైనా సరే, ఏరూపంలో ప్రేమిస్తే ఆ రూపంతో వారి ముందుకు వచ్చి, వారికి సమస్త సేవలు చేస్తాడు.

శ్లో॥ నత్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః,
నచైవ నభవిష్యామః సర్వే వయ మతః పరమ్.

(భగవద్గీత. అ 2-శ్లో 12)

కృష్ణుడు చెప్తున్నాడు, "అర్జునా! నేను, నీవు ఈ సమస్తరాజులు ఇంతకు పూర్వమున్నా, ఇకముందు కూడ ఉండగలం."

శ్లో॥ గోలోక నామ్ని నిజధామ్ని తలేచ తస్య
దేవీ మహేశ హరి ధామసు తేషు తేషు,
తే తే ప్రభావ నిచయా విహితాశ్చ యేన
గోవింద మాదిపురుషం తమహం భజామి॥

(బ్రహ్మసంహిత)

"ఏకపాద విభూతికి చెందిన ధామాల్లో అట్టడుగు ధామమైన దేవీ (దుర్గా) ధామం మొదటిది. దానిపైనుండే మహేశ్వరధామం రెండవది. దానిపైనుండే విష్ణుధామం

(వైకుంఠం), కృష్ణధామం గోలోకం రెండు దేశకాల నిమిత్తాల కతీతాలు, త్రిపాద్విభూతిమయాలు. గోపాలుడే ఆయా ధామాల్లో తత్తద్ధామోచిత ప్రభావాల్ని నిలిపాడు. అట్టి ఆది పురుషుడైన గోవిందుని నేను భజిస్తున్నాను.”

♦ ♦ ♦

## (5) శ్రీకృష్ణపరివారం నిత్యమ్

శ్లో॥ నిత్యాః సర్వా ఇమా రుద్ర యథాఽహం
నిత్య విగ్రహః,
సఖాయః పితరో గోపా గావో బృందావనం మమ,
సర్వ మేత న్నిత్య మేవ చిదానంద రసాత్మకమ్,
ఇద మానంద కందాఖ్యం విద్ధి బృందావనం మమ॥
(పద్మపురాణం - పాతాళఖండం)

గోపాలుడు - పశుపతి ఇష్టాగోష్ఠి యందున్నారు. గోపాలుడు చెప్తున్నాడు; “రుద్రా! నేనెట్లు నిత్యుడనో అట్లే నా సమస్తపరివారం, స్నేహితులు, నంద యశోదలు, గోవులు, బృందావనం సర్వం నిత్యం, చిదానందరసాత్మకం. రుద్రా! ఈ బృందావనాన్ని ఆనందధాముగా తెలిసికో.”

శ్రీకృష్ణావతారంలోని సమస్త దుష్టులు - శిష్టులు నిత్యులు, దేశకాల పరిధికి అతీతులు. ప్రియతముడు గోపాలుని సుఖం నిమిత్తం సదా ఆతని అనుకరిస్తుంటారు, ఆతని

కొంట ప్రతి కల్పంలో మర్త్యభూమిపై ప్రకట మవుతూనే ఉంటారు. ఈ సమస్త పరివారం శ్రీకృష్ణున కభిన్నం, సచ్చిదానంద స్వరూపం. వీరికి సాధారణ మానవులకు వలె భౌతిక శరీరాలు, భౌతిక కర్మలు లేనే లేవు.

భౌతిక శరీరాలలో భౌతిక కర్మలు చేసే మానవులు వారి దివ్యకథల్ని మనోవాక్కాయాల్ని లీనంకావించి చదివితే చాలును, వింటే చాలును. వీరిలోని భౌతికత సమూలంగా అదృశ్యమవుతుంది.

విషయసుఖాలనుంచి మనసును మరల్చితే కానీ కథాపఠన – శ్రవణాదులందు తత్పరత కలుగదు. ఒకటే మాట! విషయసుఖాల్ని పూర్తిగా త్యజించగలిగితేనే ప్రేమరసం ఆస్వాదనకు వస్తుంది. బలవంతంగా మనోవాక్కాయాల్ని పఠనంలో లీనంచేస్తే క్రమంగా అందులో రుచికలిగితే, విషయసుఖాలు సహజంగానే క్షీణిస్తాయి.

పఠనం ఆ పాత్రల్ని మానవజీవితంలోకి ఆహ్వానించి తీరుతుంది. ఫలితంగా నిరంతరం ఆ పాత్రలే హృదయ క్షేత్రంపై నాట్యమాడుతాయి. సర్వకాల సర్వావస్థలందు మన సమస్తకార్యాలలో వారి హస్తదానం – శరీరఛాయ మన కున్నట్లు దివ్యానుభూతి కలుగుతుంది. క్రమంగా ఆ అనుభూతి వారిని మనలో ప్రాణంగా రూపొందించి తీరు

తుంది. అంతే! మనోవాక్కాయాలు అఖండ ప్రేమ
అమోఘ పాత్ర లవుతాయి. అట్టి స్థితిలో గోపాలుడు
మరే ఇతర రసిక మహానుభావుడైనా అనుగ్రహించి
దృష్టి ప్రసారంచేశారా ఇక అనవచ్ఛిన్నంగా మనోవాకా
పాత్రలలో ప్రేమరసం అఖండంగా ప్రవహించి తీరవల
భాగవత కథాపఠనం ఈ పాత్రల్ని విశుద్ధంగా చే
త్రిగుణాతీత సౌరభాన్ని ముమ్మొందుగానే వీనిలో వా
చేస్తుంది, అంతే కానీ ప్రేమరసాన్ని ప్రవహింప చే
మూల్యమిచ్చి కొనటానికి ప్రేమ బజారు వస్తువా ఏ
ఒక్క ప్రేమీ మహానుభావుడు మాత్రమే ప్రేమదానం
సమర్థుడై ఉంటాడు. ఆ దానాన్ని గ్రహించటానికి గ్ర
లకు యోగ్యత కావాలి. ఆ యోగ్యతయే నయనాల
అశ్రురూపమై ప్రవహిస్తుంది. ఒక్కటే మాట! ఏ
నేర్చినవాడు ఎందుకూ పనికిరాడు. పవిత్రభావంతో వి
గలిగినవాడు ఏమీ చేయనవసరం లేదు. ప్రక్కనున్న
కూడా విలపించనిదే లభ్యం కావటంలేదు. అలాగే
యంలో ఉన్నవాడు కూడా లభ్యంకాడు. సమస్త స
చరమపరిణామం ఈ నయనాశ్రువులు. ఇవి త్రిగుణ
కామదేహాన్ని ఛిన్నాభిన్నం చేయగల అమోఘాస్త్ర
పాపం క్షయమైనపుడు మనోవాక్కాయ పాత్రలు దు
పార రహితా లవుతాయి గానీ స్వచ్ఛం కాలేవు. న

శుద్ధిపులతో ఈ పాత్రలు స్వచ్ఛమైనప్పుడు హృదయంలో ఉన్నవాడు ప్రేమరసరూపంలో ఈ పాత్రలలో ప్రవహిస్తాడు. అప్పుడే రససిద్ధికి కావలసిన సమస్తభావాలు మనోవాక్కాయాలపై ప్రకట మవుతాయి. ఆ రసస్వరూపుడే ఇలా ఈ భావాల రూపంగా గ్రహిస్తాడు. మనోవాక్కాయాలు మూడు పరిపూర్ణంగా తమ పూర్వరూపాల్ని కోల్పోతాయి. దివ్యచిన్మయ శరీరంలో జీవుడు ప్రవేశిస్తాడు. కనుక విలపించి, విలపించి విహ్వలతతో భాగవతకథలోని పాత్రధారుల్ని మన హృదయాలలోనికి ఆహ్వానించుకోవాలి.

శ్లో॥ సతాం ప్రసంగా న్మమ వీర్య సంవిదో
భవంతి హృత్కర్ణ రసాయనాః కథాః,
తజ్జోషణా దాశ్వపవర్గ వర్త్మని
శ్రద్ధా - రతి - ర్భక్తి రనుక్రమిష్యతి॥
(శ్రీమద్భాగవతం, స్కం.3-అ25-శ్లో25)

"దివ్య వైభవోపేతాలైన శ్రీకృష్ణలీలలు హృదయాలకు, కర్ణాలకు అత్యంత సుఖదాయకాలు. వానిని సాధుముఖాన శ్రవణం చేయాలి. లీలాకథన సేవనం భగవత్ప్రాప్తికి అత్యంత సరళమార్గం, క్రమపద్ధతిని ప్రారంభంలో శ్రద్ధను, తదుపరి భావాన్ని, తదుపరి ప్రేమను సిద్ధింపచేస్తుంది."

నిత్యధామంలో గోలోకంలో ఈనాడు కూడా నంద యశోద లున్నారు, దేవకీ వసుదేవు లున్నారు, గోవులు, గోపికలు, గోపాలు రున్నారు, కంస, దుర్యోధనాదులు, వారి అనుచరు లున్నారు. వారందరు ఎంతమాత్రం భౌతిక జీవులు కానేకారు. దివ్యులు, చిన్మయులు. ఒకే ఒక్క మాటలో భగవదభిన్నులు. వారి కథల్ని చదివి, మనోవాక్కాయాల లోనికి వారి దివ్యవ్యక్తిత్వాన్ని ఆహ్వానించితే మనంకూడా వారివలె భగవదభిన్నుల మవుతాము.

* * *

## (6) శ్రీకృష్ణునకు భౌతిక శరీరం లేదు.

శ్రీకృష్ణుడు ఒకేసమయంలో మధురా కారాగారంలో ఐశ్వర్య ప్రధానంగా, నందగృహంలో రసప్రధానంగా రెండు రూపాలతో అవతరించాడు, ప్రకటమైనాడు. అంతేకానీ సాధారణ జీవులకువలె జన్మింపలేదు.

"నందస్త్వాత్మజ ఉత్పన్నే జాతహ్లాదో మహామనాః॥"

(శ్రీమద్భాగవతం, స్కం.10–అ5–శ్లో1)

"ఆత్మజుడు కలిగెనని నందరాజు పరమానందభరితుడైనాడు."

ఇందువలన సుస్పష్టము. గోపాలుడు రెండు రూపాలతో, రెండు స్థానాలలో ఒకే సమయంలో ప్రకటమైనాడు.

శ్లో॥ సస్త్వయం ద్విభుజః కృష్ణః యశోదా గర్భసంభవః,
తస్యాసౌ దేవకీపుత్రః భవిష్యతి చతుర్భుజః॥
(అగ్నిపురాణం)

"దేవకీ వసుదేవులకు ప్రకటమైనమూర్తి చతుర్భుజుడు. ఆతడు రెండు చేతులతో ప్రకటమైన యశోదా తన యునిలో లీన మయినాడు."

శ్రీకృష్ణుడు గానీ, మరి ఏ ఇతర దేవతయైనగానీ మాతా పితరుల రజో వీర్య సంసర్గంతో భూలోకంలో వ్యక్తం కాలేదు. కాననే అది చిద్రూపం మరియు అవతారం. 'అవతార' మంటే 'జన్మించటం కాదు', 'దిగిరావటం' అని అర్థం.

శ్లో॥ గర్భేచ వాయునా పూర్ణే నిర్లిప్తో భగవా నజత్॥
(బ్రహ్మవైవర్త పురాణం - శ్రీకృష్ణ జన్మ ఖండం)

"భగవానుడు దేవకీ దేవి గర్భంలో శిశురూపంతో లేడు. కేవల మాగర్భాన్ని వాయువుతో నింపాడు."

శ్లో॥ దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణు స్సర్వ గుహాశయః,
ఆవిరాసీత్ యథాప్రాచ్యాం దిశీందు రివ పుష్కలః॥
(శ్రీమద్భాగవతం)

"తూరుప్పదిశలో ఉదయించే చంద్రునివలె శ్రీమహావిష్ణువు దేవకీదేవి గర్భాన్నుండి అవతరించాడు."

"చంద్రునకు, తూర్పుదిశకు ఏమి సంబంధమో శ్రీ మహావిష్ణువు – దేవకీదేవి సంబంధంకూడా అంతమాత్రమే."

(శ్రీ శ్రీధరస్వామి)

శ్లో॥ అస్యాపి దేవవపుషో మదనుగ్రహస్య
స్వేచ్ఛామయస్య నతు భూతమయస్యకోఽపి॥"

(శ్రీమద్భాగవతం, స్కం.10–అ14 శ్లో2)

బ్రహ్మదేవుడు స్తుతిస్తున్నాడు; "గోపాలా! మావంటి వారి ననుగ్రహించే నిమిత్తమే నీవీ సచ్చిదానంద స్వరూపాన్ని ప్రకటం చేశావు. ఈ రూపం పాంచభౌతికం ఎంతమాత్రం కానేకాదు."

గోలోకంలోని రససాగరం గోపాలుడు సంపూర్ణంగా - సపరివారంగా భూమిమీదకు దిగివచ్చాడు. వైకుంఠంలోని శ్రీమహావిష్ణువు పరిపూర్ణంగా దిగివచ్చాడు. నరనారాయణుల లోని నారాయణాంశ దిగివచ్చింది. వేదోక్త నిరతిశయ నిర్గుణ దివ్య పరబ్రహ్మతత్త్వము, అఖండ జ్ఞానము సాకారమయింది. ఇప్పుడు ఒక్క క్షణం ఆలోచించండి, మన బాల గోపాల స్వరూపం ఎంత గొప్పదై ఉండాలి?

♦ ♦ ♦

# భాగవతరసం - అవతారిక

## రాసలీలా విషయిక సమాధానాలు

### (7) శ్రీరాధారాణి గోపికలయింది

శ్రీ రాధారాణి - శ్రీకృష్ణుడు - గోపికలు. వీరికి ఎంతమాత్రం భేదం లేదు. శ్రీ రాధాకృష్ణులు రససాగరాలన్నాం గదా, గోపికలుకూడ తదంశలు కనుక రసస్వరూపిణులు, భౌతిక శరీర రహితలు. మధుర సాధనతో గోపికలమై రాసలీలా రసాస్వాదన చేసేటప్పుడు మనం రస స్వరూపులం, భౌతిక శరీర రహితులం అవుతాము.

ఆ రసరాజ్యంలో ఎవరికీ భౌతిక శరీరాలు లేనేలేవు. ప్రేమరసం ఘనీభవించి ఆ రూపాలయింది. భౌతిక జీవులకువలె సమస్తావయవాలు కన్పిస్తాయి. కాని అవయవాలు లేవు. ఇంక ఆ రసరాజ్యంలో అంగసంయోగ మెట్లా ఉంటుంది ? భౌతిక జీవులు ఊహించే అంగ సంయోగానికి అక్కడ స్థానం లేనేలేదు.

ప్రేమలో ఇంద్రియా లుంటాయి, చిన్మయంగా ఉంటాయి, అంగ సంయోగ ముండదు. దివ్య త్రిగుణా లుంటాయి, వికారా లుండవు. ప్రపంచ ముంటుంది, మాయ ఉండదు. చిన్మయదేహా లుంటాయి, సుఖ దుఃఖా లుండవు.

ఆక్రందన ఉంటుంది, దుఃఖ ముండదు. ముక్తి ఉంటుంది, లయ ముండదు. ద్వైత ముంటుంది, అయినా అద్వైతమే.

ప్రేమలో దేహాహంభావం, దేహమే నేననే జ్ఞానం, అనగా ఇంద్రియజ్ఞానం ఎంతమాత్రం ఉండదు. "నేను ప్రేమిస్తున్నా" నన్న స్ఫూర్తియే ఉండదు. సాత్త్విక భావాల లోనే ఉండదుగదా! ఇంక సాధారణ జీవులు ఊహించే క్షుద్రకామక్రీడలకు ఈ దివ్యరసరాజ్యంలో ఎలా స్థానముంటుంది ?

ఆనందించాలనే సంకల్పం కలిగినప్పుడు జీవుడు జాగ్రత్స్వప్నావస్థల నధిగమించి సుషుప్తిలోనికి, గాఢనిద్రలోనికి, అనగా ఇంద్రియాతీత స్థితిలోనికి వెళ్ళుతున్నాడు. ఇంక ప్రేమలో ఇంద్రియజ్ఞానం ఎట్లా ఉంటుంది ? ఒకటేమాట! ఆనందించాలంటే జీవుడు దేహాహం భావాన్ని నశింపచేసికొని తీరాలి.

రాసలీలలో ఏరసం ప్రవహిస్తుందని అనుకొంటున్నామో, ఆ రసం, ఒకే తత్త్వం ప్రియుడుగా - ప్రేమికుడుగా ఇన్ని రూపాలు ధరించింది. అక్కడున్నది ఒకేతత్త్వం నానాతత్త్వం లేనేలేదు. ఆ మూలతత్త్వాన్నే 'ప్రేమరస' మంటారు.

గోపికలు సహజంగా ప్రేమ రసస్వరూపిణులు. ఆది మధ్యావసానములందు వారు వారి సహజస్థితిలోనే స్థితలై

నారు. దివ్య ప్రేమరసాన్ని విస్తరింపచేయటానికి, విశ్వ వ్యాప్తం చేయటానికి, తమకృపాభిక్షతో భౌతికజీవుల్ని రస స్వరూపుల్ని చేయుటానికి మాత్రమే వారు నిర్విరామంగా గోపాలునితో వినోదిస్తున్నారు.

సమస్త శ్రీకృష్ణలీలలకు, ముఖ్యంగా రాసలీలకు ఏకైకమూల రసబీజం శ్రీరాధా రాణి. శ్రీరాధాకృష్ణులు ఇద్దరుగా కన్పిస్తున్నారు గానీ వాస్తవంలో ఒక్కరే. శ్రీరాధారాణి కృపాకటాక్షం లేకపోతే శ్రీకృష్ణుడు ఏలీల కూడ చేయలేడు. శ్రీరాధారాణి దర్బారులో గోపాలకృష్ణుడు దాస్యభావాపన్నుడు. అతడు ఆనందించాలంటే శ్రీరాధా రాణి కృపాకటాక్షం ఉండితీరాలి. శ్రీకృష్ణుడు వ్రజభూమిలో ఉన్నంతకాలం, 11 వర్షాలు నిరంతరం సమస్త వ్యవహారా లలో రాధానామం చేశాడు. రాధారూప ధ్యానంచేశాడు. రాధారాణి కృపాకటాక్షమే ఈసమస్త శ్రీకృష్ణలీలలు. ఒకటేమాట! అవి అఖండరసధారలు. నాటికి – నేటికి – ఏనాటికైన కూడ సమస్తజీవుల్ని, సమస్తజడ చేతనాన్ని 'సరసం' చేయ సమర్థవంతాలు.

శ్రీరాధారాణియే రసవిస్తరణార్థం - రసవితరణార్థం 'నిత్య సిద్ధా' గోపికల రూపంలో ప్రకటమయింది. ఈ విధా నాన్ని 'కాయవ్యూహ' మంటారు. శ్రీరాధారాణియే 'చంద్రా

వళీ' యైనది. గోపికలు రెండు బృందాలు. (1) రాధారాణి మండలి - (2) చంద్రావళి మండలి. ప్రత్యేక మండలిలో రస విస్తరణార్థం భిన్న - భిన్న శ్రేణులుంటాయి. (1) చెలియలు (2) సహచారిణులు. (3) సేవికలు. (4) సఖియలు. (5) ప్రియసఖియలు. (6) ప్రియనర్మసఖియలు.

శ్లో॥ సఖ్యః శ్రీరాధికాయా వ్రజకుముద విధో, ర్హ్లాదినీనామ శక్తే

సారాంశ ప్రేమవల్ల్యాః కిసలయదళ, పుష్పాదితుల్యాః సతుల్యాః,

సిక్తాయాం కృష్ణలీలామృతరసనిచయై, రుల్లసంత్యా మముష్యాం

జాతోల్లాసాః స్వసేకాచ్ఛతగుణమధికం, సంతి యంత న్న చిత్రమ్॥

(గోవిందలీలామృతం. సర్గ 10 - శ్లో 10 )

గోపికలు శ్రీరాధికకు కాయవ్యూహం, రసస్వరూపిణులు, భౌతిక శరీర రహితలు అనటానికి ప్రమాణం గోవింద లీలామృతగ్రంథం — మరియు ఋగ్వేదాంతర్గత శ్రీరాధికోపనిషత్.

"వ్రజవాసులు కలువలు. శ్రీకృష్ణుడు చంద్రుడు. ఆహ్లాదినీశక్తి శ్రీరాధారాణి 'ప్రేమసార రూప లతిక.' గోపికలు ఆలతికకు చిగుళ్ళు - ఆకులు - పుష్పాలు. కాన లలి

తాది ప్రియసఖీగణం రాధికకు సమానులు. కృష్ణలీలా రస పుంజంచేత రాధికయనే లత తడుపబడి ఉల్లాసం పొందుతోంది. సఖీగణం ఆ రాధికా సౌభాగ్యం కన్న నూరు రెట్లధికంగా ఉల్లాసాన్ని పొందుతోంది. ఇందులో ఆశ్చర్యమేముంది?"

శ్లో॥ విభురపి సుఖరూపః స్వప్రకాశోఽపిభావః
క్షణమపి సహిరాధా కృష్ణయోర్యా ఋతే స్వాః,
ప్రవహతి రసపుష్టిం చిద్విభూతీ రివేశః
శ్రయతి నపదమాసాం కఃసఖీనాం రసజ్ఞః॥
(గోవిందలీలామృతం – సర్గ 10 – శ్లో 17)

"ఈశ్వరుడు స్వప్రకాశరూపమైన పుష్టిలాభం పొందాలంటే నిజైశ్వర్యం కారణం. అట్లే ప్రియాప్రియతములు శ్రీరాధాకృష్ణుల చిద్విలాసం పరమాధిక్యత కలది, సచ్చిదానందమయం, స్వయం ప్రకాశరూపం అయినప్పటికి అది నిజ సంబంధకాయవ్యూహరూపసఖీజనం వలన గానీ రసపుష్టిని పొందలేదు. కనుక భక్తులు సునిపుణమధుర రసజ్ఞులయితే ఈసఖీజన పదపద్మాలను ఆశ్రయింపకుండ ఎట్లుండగలరు?"

ఈగోపికల దివ్యసన్నిధానంలో బ్రహ్మ – మహేశ్వర ప్రభృతి దేవతలుకూడ దాసులై తీరవలసిందే, సత్కృష్ణ నేత్రాలలో ప్రేమభిక్ష నర్థించవలసిందే. ఫలితంగా గోపికలు కావలసిందే. అలాకాకపోతే రాసలీలా రసాస్వాదన లేనే లేదు. వారు ఐశ్వర్యప్రధానమూర్తులు. ఎక్కడ ఐశ్వర్యముంటుందో

అక్కడ మధుర రసం ఆస్వాదనకు రాదు. అంతటి అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడే వ్రజభూమిపై అడుగిడి తన ఐశ్వర్యాన్ని విస్మరించాడు, గొల్లపిల్లల ఉచ్ఛిష్టం తిన్నాడు. ఇక ఈ దేవత లందరు ఎంతటివారు ? వారి ఐశ్వర్యమెంత ? ఈ గోపికలు దేవతల్ని మధురరస స్వరూపుల్ని చేశారు. సమస్త భక్తుల జ్ఞానాన్ని నోంగిలించారు, సమస్త జడ చేతనాల్ని సరసం చేశారు. గోపికలంటే అంతటివారు. గోపికల కృపలేక ఎవరును రాసలీలలో ప్రవేశింపనే లేరు. నాటికి - నేటికి - ఏనాటికి సమస్త జడ చేతనాలలో ప్రేమరసాన్ని ప్రవహింపచేసే గోపికలు దివ్య అప్రాకృత మధుర రసానికి సాకారాలు.

శ్రీ రాధారాణి ఆహ్లాదినీ శక్తి - మహాభావస్వరూపిణి. గోపికలు భావస్వరూపిణులు.

గోపికలకు శరీరాలు లేవు, అవయవాలు లేవు, దేహాహం భావం లేదు. ఏమియు లేవు, అన్నియు ఉన్నాయి. దీనినే 'ప్రభువినోదం' అంటారు. అయితే ఏమిటా వినోదం ? రసమంటే ఎటువంటిది ? రసాస్వాదనానుభవం ఎలా ఉంటుంది ?

జాగ్రిదవస్థలోవలెనే ప్రపంచం ఉంటుంది. అసలా ప్రపంచం ఎక్కడ నుండి ప్రకటమయింది ? ప్రేమికుల హృదయాల నుండి. ఆ రసరాజ్యంలో శరీరా లున్నట్లుగా, ప్రేయసీ ప్రియులు క్రీడిస్తున్నట్లుగా కన్పిస్తోందే, ఏమిటా దృశ్యంలోని

మర్మం? అది ఆగోపలలనలలోని అంతర్వ్యాపినీ మధుర రసమే, అది దివ్య జాగ్రదవస్థ మరియు దివ్య స్వప్నావస్థ. ఆనందం అనుభవించటానికి రెండే రెండు అవస్థలున్నాయి. అవే జాగ్రత్స్వప్నాలు. ఈ భౌతిక నామరూపాల్నే రసరాజ్యం లోకి కూడ ఆహ్వానించండి, భౌతిక జీవులందరు రండి, భౌతిక కామక్రోధాదులతో రండి. తదుపరి రసాస్వాదన చేసి చెప్పండి, ఆ అనుభవం భౌతికమా? దివ్యమా? రక్త మాంసాది ధాతువులతో కూడిన శరీరముంటే ఆ అనుభవం భౌతికం అవుతుంది, హృదయ ప్రధానంగా ఉంటే దివ్య మవుతుంది. గోపికలేమో శ్రీ రాధారాశికి కాయవ్యూహ స్వరూపిణులు. మరి ఆ మదనగోపాలుడేమో ఈ గోపికల హృదయాలలో విహరించేవాడే.

శ్లో॥ నఖలు గోపికా నందనో భవాన్

అఖిల దేహినా మంతరాత్మ దృక్॥

(శ్రీమద్భాగవతం, స్కం.10-అ31-శ్లో4)

శ్లో॥ సర్వస్య చాహం హృది సంనివిష్టో

మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనం చ॥

(భగవద్గీత. అ 15 - శ్లో 15.)

రాసలీలలో ప్రవేశించి రసాన్ని ఆస్వాదించటమంటే ఇలా దివ్య జాగ్రత్స్వప్నాలలో విహరించటమేనని మాత్రం మరువకూడదు.

గోపికాబృందంలో నాలుగు విభాగాలు; (1) నిత్య సిద్ధాసఖియలు=శ్రీ రాధారాణికి వీరు అభిన్నలు, (2) శ్రుతి గోపికలు = గోపాలుని సాహచర్యాన్ని కోరి వేదాలిలా ప్రకటమైనాయి. (3) దేవకన్యా గోపికలు = దేవకన్యలు గోపాలుని సాహచర్యాన్ని కోరి, ఎంతో కాలం తపం చేసి, గోపికలైనారు. (4) ఋషిగోపికలు = జాబాలి ప్రభృతులు గోపాలుని సాహచర్యాన్ని కోరి ఎంతోకాలం తపంచేసి వ్రజంలో గోపికలైనారు.

ప్రమాణం :—

శ్లో॥ గోప్యస్తు శ్రుతయో జ్ఞేయా ఋషిజా దేవకన్యకాః,
.... .... .... .... రాజేంద్ర నమానుష్యః కదాచన॥
(పద్మ పురాణం.)

భాగవతం భగవానునకు అవయవ స్వరూపం - శ్రీ విగ్రహం, భగవంతుడు రసస్వరూపుడు, భాగవతం రస స్వరూపం అన్నాంగదా! అయితే భాగవతంలోని విభిన్న మనస్తత్వాలుగల పాత్రలు, కథావస్తువులు భగవదభిన్న రస స్వరూపాలే అవుతాయి గానీ అన్య మెట్లా అవుతాయి ?

విశేషం; నేడు కూడా గోపీభావంతో గోపాలుడు ప్రియుడుగా మధురభక్తి చేసేవారందరు గోపికలై శ్రీకృష్ణ పరివారంలో సభ్యులవుతారు, రాసలీలారసవిస్తారికలవుతారు

గోపాలుని హృదయంలో, హృదయంలోనే వున్న గోపాలుని హృదయంలో ప్రాణేశ్వరీస్థానాన్ని సంపాదిస్తారు.

రాసలీలా రసానుభవాలకు పరిమితి లేదు, ఆమాధుర్యానికి అవధిలేదు. గోపికల అధికారభేదాన్ననుసరించి చాలా విచిత్రానుభవాలు కలుగుతుంటాయి. రసరాజ్యంలో ఈ సిద్ధాంతానికి వ్రజభాషాసాహిత్యమే పరమప్రమాణం, అచటి రసజ్ఞులే ఆదర్శం. ఇందుకు శాస్త్రం అంతగా ఆదర్శంకాలేదు.

* * *

(8) గోపికలకు శ్రీకృష్ణునియందు కామభావం లేదు.

శ్లో॥ ప్రేమైవ గోపరామాణాం కామయిత్యగమత్ ప్రథాత్,
ఇత్యుద్ధవాదయోఽప్యేతం వాంఛంతి భగవత్ప్రియాః॥
(గౌతమతంత్రం.)

కామానికి - ప్రేమకు చాలా భేదముంది. కామమంటే నిజేంద్రియ సుఖాభిలాష- అంగసంయోగాపేక్ష- వాసన. ఇది భౌతికం- త్రిగుణాత్మకం. ప్రేమలో అంగసంయోగం- దేహాహంభావం ఉండనే ఉండదు. అది త్రిగుణాతీతం. గోపాలుని ప్రేమిస్తే భౌతికజీవులుకూడ త్రిగుణాతీతు లవుతారు, భౌతిక శరీరం దివ్యమవుతుంది.

"సాత్వస్మిన్ పరమప్రేమరూపా భక్తిః." శ్రీకృష్ణుని యందు సంపూర్ణంగా చిత్తవృత్తిలీనమైన స్థితినిమాత్రమే 'ప్రేమ' అని పిలవాలి. అట్టి స్థితిలో చిత్తంలో క్షుద్రమైన ఈ అరిషడ్వర్గాలు ఎట్లా ఉండగలుగుతాయి? ఆద్రావస్థాపన్న చిత్తవృత్తిలో మాత్రమే ప్రేమరసం ప్రవహిస్తుంది. అది కేవలం అనుభవం. అంతవరకు మానవులు చేసేది సాధన భక్తిమాత్రమే.

శ్లో॥ అనేక జన్మసాహస్రి తపోధ్యాన సమాధిభిః,
నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే॥

"అనంతానంత జన్మాలనుండి తపోధ్యాన సమాధిరూప మైన సుకృతవిశేషం లేకపోతే, సమస్తపాపాలు క్షయం కాక పోతే అందరు సాధనభక్తినికూడ చేయలేరు."

"గోపికల ఆ 'దివ్యప్రేమభావాన్నే' 'కామ' నామం తో వ్యవహరించటం లోకాచారమై పోయింది. అది ఎంత మాత్రం కామంకాదు. కామమంటే నిజేంద్రియ సుఖాభిలాష. అది గోపికలలో లేనేలేదు. వారు ప్రేమపారిజాతాలు కనుకనే ఆరసంలో ఒక్కబిందువైనా లభిస్తే చాలని, అందువల్ల తమ జన్మ కృతార్థమవుతుందని ఉద్ధవ ప్రభృతి సమస్తజ్ఞానిజనం అత్యంతాతురు లయినారు."

రాసలీలాశ్రవణంవలన కలిగే మహత్తరఫలం 'కామ నివృత్తి' యని వేదవ్యాసులవా రన్నారు. చెప్పండి, గోపికల లోనే గనుక కామం ఉన్నట్లయితే ఈ భౌతికజీవులలోని కామం ఎట్లా నివృత్తి అవుతుంది ?

గోపికలలో కామభావం లేదు కానీ, కామభావంగల ఈ భౌతికజీవులు మాత్రం తమకామాన్ని, భౌతికశరీరాన్ని వెంటనిడుకొని గోపాలుని ప్రేమించటానికి వెళ్ళవచ్చును. ప్రేమ మహాపాతకిని మహాత్మునిగా రూపొందించి తీరుతుంది.

శ్లో॥ అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,

సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితోహి సః॥

(భగవద్గీత. అ 9- శ్లో 30)

గీతాచార్యుడంటున్నాడు; "అర్జునా ! ఎంతటి మః పాపాత్ముడైనా సరే అనన్యభక్తితో నన్ను భజించాః తప్పక సజ్జనుడై తీరుతాడు."

ఇందువలననే భక్తిమార్గం సులభమని చెప్పబ తోంది.

అయితే అంతటి మహాపాపాత్ముడు అనన్యభక్తి ఎట్ల చేస్తాడు ? సజ్జనులముఖాన్నుండి భాగవతకథారసాన్ని గ్రో టం జరిగిందా, ఎంతటి మహాపాపాత్ముని మనస్సైనా మా తీరుతుంది. చిత్తవృత్తి — మనసు ధారారూపంగా గోపాలు దిశగా ప్రయాణించటానికి సహకారులు అంతఃకరణ పవిత్ర గల సాధువులు. ఎందువలనంటే వారి హృదయంలో గో డున్నాడుగదా ! ఆ గోపాలుడే ఈ మహాపాపాత్మునిలో మనసును తన కధీనం చేసికొంటాడు. గోపాలునివైపు ముః త్రిప్పటమే మనం చేయాల్సిన తక్షణకార్యం. మన మారిందా, ఒకటేమాట ! సమస్తేంద్రియాలు, సమస్త జీవః కృష్ణమయమయినట్లే. నమ్మండి.

ఇలా మనసు ప్రేమమయమై, హృదయం గోపాలః యం అయిందా సమస్తేంద్రియాలు- సమస్త జీవితం- భాః శరీరం- జీవి తక్షణం నిస్సంశయంగా కృష్ణస్వరూపు డ తున్నాడు, రసస్వరూపు డవుతున్నాడు. కామంతో కృష్ణ దగ్గరకు కాలుకదిపితే ఆకామం ప్రేమగా మార్పు చెంః తోంది,

శ్లో॥ కామాదీనాం కతినకతిధా పాలితా దుర్నిదేశా
స్తేషాం జాతామయి నకరుణా నత్రపా నోఽపశాంతిః,
ఉత్సృజ్యైతా నథ యదుపతే సాంప్రతం లబ్ధబుద్ధిః
త్వా మాయాతః శరణమభయం మాం నియుం
క్ష్వాత్మదాస్యే॥
(భక్తిరసామృతసింధువు – ప్రీతిభక్తి లహరి – శ్లో॥6)

"గోపాలా! అరిషడ్వర్గాలు నన్నెంతగా బాధించినా యంటే నా ఎన్ని జన్మలనో నాశనం చేశాయి. వాని ఆదే శాల నెన్నింటినో పాటించి చివరకు పూర్తిగా శక్తిహీనుడ నయాను. కానీ ఆ అరిషడ్వర్గాలకు నాయందు ఇంకా దయ కలగటం లేదు. నన్ను విడిచిపోదామనే సంకల్పం వానికి లేనే లేదు, దుష్టాదేశములు చేసినందుకు సిగ్గు అసలే లేదు. గోపాలా! ఇంక నేనే వానిని విడిచి, నీ పదపద్మాల చెంతకు వచ్చాను. నన్ను రక్షించేభారం నీదే."

దేవతాభజనం చేయాలంటే, ఆధ్యాత్మిక ప్రగతిని సాధించాలంటే మానవుడు అరిషడ్వర్గాలను జయించి, వైరాగ్యవంతుడై తీరాలి. కృష్ణునిదగ్గరకు వెళ్ళటానికిమాత్రం కామక్రోధాది అరిషడ్వర్గాల్ని త్యజించాల్సిన అవసరం లేనే లేదు. గోపాలుని దగ్గరకు కామక్రోధాదులతో వెళ్ళి వాటిని దివ్యంచేసికొందాం, దివ్యుల మవుదాం, త్యజించటమంటే వానిని దివ్యం చేసికొనటమే.

శ్రీమద్భాగవతంలో గోపికలవిషయంలో స్థానస్థానంలో ప్రయోగించబడిన 'కామ' శబ్దం అప్రాకృతప్రేమను మాత్రమే సూచిస్తోంది.

"నిశమ్యగీతం తదనంగ వర్ధనం వ్రజస్త్రియః కృష్ణగృహీత మానసాః॥"

(శ్రీమద్భాగవతం, స్కం.10-అ29-శ్లో4)

గోపాలుని వేణుగానం గోపికల కామాన్ని వృద్ధిచేసిందట. అసలు అప్రాకృత ప్రేమరాజ్యంలోనికి అనంగు డెట్లా రాగలిగినాడో ఆలోచించండి. గోపికలు సహజంగా త్రిగుణాతీతలు, సహజంగా అనంగలు. వారి ప్రేమభక్తి అనపాయిని. అనగా అచంచల. వేణుగానం వారి సహజ ప్రేమభావాన్ని మరింత ఉజ్జ్వలం, తీవ్రాతితీవ్రం చేసింది. రాసలీలా శృంగారం భగవదభిన్నం. రసబ్రహ్మ రసరాజం దివ్యశృంగారరసంగా ప్రవహించాడు. గోపికలే కాదు, సమస్త జడచేతనాలు ఆ రసవాహినిలో ఆర్ద్రాలయినాయి. అందుకు వేణుగానం ప్రాణ స్వరూప మయింది, అంతర్వ్యాహినీ మధురరసానికి బాహ్య జగత్తులో కోటి - కోటి ముఖాల నిచ్చింది, సర్వోన్నతము, సర్వాధారమునైన ప్రేమ సిద్ధాంతానికి, ప్రేమ స్వరూపుడు గోపాలునికి రసీభావహేతువై రాజిల్లింది. వేణుగానాన్ని విస్మరిస్తే, వేణుగాన మాధుర్యాన్ని హృదయంలో ముందుగా అనుభవించకపోతే, త్రికరణాల్ని ముందుగా ఆ గానానికి

శ్రీమద్భాగవతంలో గోపికలవిషయంలో స్థానస్థానంలో ప్రయోగించబడిన 'కామ' శబ్దం అప్రాకృతప్రేమను మాత్రమే సూచిస్తోంది.

"నిశమ్యగీతం తదనంగ వర్ధనం వ్రజస్త్రియః కృష్ణగృహీత మానసాః॥"

(శ్రీమద్భాగవతం, స్కం.10-అ29-శ్లో4)

గోపాలుని వేణుగానం గోపికల కామాన్ని వృద్ధిచేసిందట. అసలు అప్రాకృత ప్రేమరాజ్యంలోనికి అనంగు డెట్లా రాగలిగినాడో ఆలోచించండి. గోపికలు సహజంగా త్రిగుణాతీతలు, సహజంగా అనంగలు. వారి ప్రేమభక్తి అనపాయిని. అనగా అచంచల. వేణుగానం వారి సహజ ప్రేమభావాన్ని మరింత ఉజ్జ్వలం, తీవ్రాతితీవ్రం చేసింది. రాసలీలా శృంగారం భగవదభిన్నం. రసబ్రహ్మ రసరాజం దివ్యశృంగారరసంగా ప్రవహించాడు. గోపికలే కాదు, సమస్త జడచేతనాలు ఆ రసవాహినిలో ఆర్ద్రాలయినాయి. అందుకు వేణుగానం ప్రాణస్వరూప మయింది, అంతర్వాహినీ మధురరసానికి బాహ్యజగత్తులో కోటి - కోటి ముఖాల నిచ్చింది, సర్వోన్నతము, సర్వాధారమునైన ప్రేమ సిద్ధాంతానికి, ప్రేమ స్వరూపుడు గోపాలునికి రసీభావహేతువై రాజిల్లింది. వేణుగానాన్ని విస్మరిస్తే, వేణుగాన మాధుర్యాన్ని హృదయంలో ముందుగా అనుభవించకపోతే, త్రికరణాల్ని ముందుగా ఆ గానానికి

ఆత్మ తత్త్వానికి సన్నిహితుడు కావాలి. అప్పుడే ఆ సంధి సమయంలో జీవుడు అర్జునునివలె విషాదయుక్తు డవుతాడు. అంతర్యామి సమ్ముఖంలో, సర్వవ్యాపకుని సమ్ముఖంలో విషాదయుక్తు డవుతాడు.

"బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతువః"

(భగవద్గీత, అ2-శ్లో 49)

"అర్జునా! నీవు బుద్ధి దగ్గరకు వెళ్ళి, శరణాగతుడవు కా! అప్పుడా బుద్ధి తనలో అంతర్యామిగా ఉన్న [illegible] ప్రకటం చేస్తుంది. నీకు నా సాహచర్యాన్ని అనుగ్రహి[illegible]

భగవద్దర్శనలాభం పొందకుండా ఎవరు దేహ[illegible] చేస్తారో వారే కృపణులు అవుతున్నారు.

అంతర్యామి సన్నిధానంలో ఎవరు విషాద య[illegible] లవుతారో వారు యోగులవుతారు.

ఆత్మకు అన్యంగా అదృశ్యంగా ఉండే వస్తువుల[illegible] మానవుడు 'నాస్తి - నాస్తి' యని నిరాకరించవచ్చు[illegible] కాని నిరాకరించే తన బుద్ధిని ఎట్లా లేదనగలడు ? 'నేను [illegible] యని వ్యవహరిస్తున్నాడే ఆ 'నేను'ను ఎట్లా నిరాక[illegible] ఎట్లా కాదనగలడు ?

[illegible]మకారాలు, రాగద్వేషాలు, కామ[illegible]
[illegible] - నేనుడు - ఆత్మను[illegible]
[illegible]ాలు. ఎక్కడనుండో[illegible]

ఆత్మ తత్త్వానికి సన్నిహితుడు కావాలి. అప్పుడే ఆ సంధి సమయంలో జీవుడు అర్జునునివలె విషాదయుక్తు డవుతాడు. అంతర్యామి సమ్ముఖంలో, సర్వవ్యాపకుని సమ్ముఖంలో విషాదయుక్తు డవుతాడు.

"బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతువః"

(భగవద్గీత, అ2-శ్లో49)

"అర్జునా! నీవు బుద్ధి దగ్గరకు వెళ్ళి, శరణాగతుడవు కా! అప్పుడా బుద్ధి తనలో అంతర్యామిగా ఉన్న నన్ను ప్రకటం చేస్తుంది. నీకు నా సాహచర్యాన్ని అనుగ్రహిస్తుంది."

భగవద్దర్శనలాభం పొందకుండా ఎవరు దేహత్యాగం చేస్తారో వారే కృపణులు అవుతున్నారు.

అంతర్యామి సన్నిధానంలో ఎవరు విషాద యుక్తులవుతారో వారు యోగులవుతారు.

ఆత్మకు అన్యంగా అదృశ్యంగా ఉండే వస్తువులను మానవుడు 'నాస్తి - నాస్తి' యని నిరాకరించవచ్చును. కాని నిరాకరించే తన బుద్ధిని ఎట్లా లేదనగలడు ? 'నేను - నేను' యని వ్యవహరిస్తున్నాడే ఆ 'నేను'ను ఎట్లా నిరాకరించగలడు ? ఆత్మను ఎట్లా కాదనగలడు ?

అహంకార - మమకారాలు, రాగద్వేషాలు, కామక్రోధలోభాలు ఆ బుద్ధిని - నేనును - ఆత్మను కనపడకుండా చేస్తున్నాయి. ఇవి దోషాలు. ఎక్కడనుండో వచ్చి మనసును

గా రూపొందించు కొన్నాయి. ఈ దోషాలు
ప్పుడే బుద్ధి విషాదయుక్త మవుతుంది, నరుడు అంత
గోపాలునికి సహచరుడు కాగలుగుతాడు.

' గోపాలా! నీవు లేక నేనుండ లేను. నాలో నీవు
కనుకనే నే నున్నాను. నీవు నా వెంట ఉండాలి.
ు నాకు ప్రేమ ఉండాలి. అప్పుడు నేను 'నేను' గా
, నీ వాడనై నీయందే ఉంటాను. ఇంతకు పూర్వం
కామం ఉన్నప్పుడు నేను క్షుద్రవిషయాలకు అంకితమై
ు గదా! అట్లే ఇప్పుడు ప్రేమతో నీ వాడనై
ు. ప్రేమ నన్ను నీవాణ్ణిగా చేస్తుంది. నిన్ను నా
' చేస్తుంది. అలా పరివర్తితం చేసేది కాననే ఆ
్న 'ప్రేమరసం' అంటున్నాం''.

గోపికలు కృష్ణాంకిత జీవనలు - కృష్ణమయ జీవనలు.
ప్రీత్యర్థమే వారు జీవించారు - జీవిస్తున్నారు. ''సుఖిం
అన్న భావం గలవాడు సహజంగానే ఎదుటి వ్యక్తి
్న నాశనం చేస్తాడు, లేకపోతే సుఖించలేడు, ''సుఖింప
లి'' అన్న భావం గలవాడు స్వసుఖాల్ని నాశనం చేసి
డు, లేకపోతే సుఖింపచేయలేడు. గోపికలు సమస్తాన్ని,
ు 'నేను' ను కూడా త్యాగం చేశారు. అప్పుడు ఆ
ంలో - నేను లో నివసిస్తున్న గోపాలుడు దివ్యశృంగార

౦చు కొన్నాయి. ఈ దోషాలు
పాదయుక్త మవుతుంది, నరుడు అంత
హాచరుడు కాగలుగుతాడు.

ప్రు లేక నేనుండ లేను. నాలో నీవు
మన్నాను. నీవు నా వెంట ఉండాలి.
, ఉండాలి. అప్పుడు నేను 'నేను' గా
యందే ఉంటాను. ఇంతకు పూర్వం
ాడు నేను క్షుద్రవిషయాలకు అంకితమై
ప్లే ఇప్పుడు ప్రేమతో నీ వాడనై
న్ను నీవాణ్ణిగా చేస్తుంది. నిన్ను నా
అలా పరివర్తితం చేసేది కాననే ఆ
అంటున్నాం".

ంకిత జీవనలు - కృష్ణమయ జీవనలు.
, జీవించారు - జీవిస్తున్నారు. "సుఖిం
గలవాడు సహజంగానే ఎదుటి వ్యక్తి
్తాడు, లేకపోతే సుఖించ లేడు, "సుఖింప
ం గలవాడు స్వసుఖాల్ని నాశనం చేసి
ుఖింపచేయ లేడు. గోపికలు సమస్తాన్ని,
ాడా త్యాగం చేశారు. అప్పుడు ఆ
ో నివసిస్తున్న గోపాలుడు దివ్యశృంగార

స్వస్థానంగా రూపొందించుకొన్నాయి. ఈ దోషాలు తొలగినప్పుడే బుద్ధి విషాదయుక్త మవుతుంది, నరుడు అంత ర్యామీ గోపాలునికి సహచరుడు కాగలుగుతాడు.

" గోపాలా! నీవు లేక నేనుండ లేను. నాలో నీవు న్నావు, కనుకనే నే నున్నాను. నీవు నా వెంట ఉండాలి. నీ యందు నాకు ప్రేమ ఉండాలి. అప్పుడు నేను 'నేను' గా ఉండను, నీ వాడనై నీయందే ఉంటాను. ఇంతకు పూర్వం నాలో కామం ఉన్నప్పుడు నేను క్షుద్రవిషయాలకు అంకితమై ఉన్నాను గదా! అట్లే ఇప్పుడు ప్రేమతో నీ వాడనై ఉంటాను. ప్రేమ నన్ను నీవాణ్ణిగా చేస్తుంది. నిన్ను నా వాణ్ణిగా చేస్తుంది. అలా పరివర్తితం చేసేది కాననే ఆ తత్త్వాన్ని 'ప్రేమరసం' అంటున్నాం".

గోపికలు కృష్ణాంకిత జీవనలు - కృష్ణమయ జీవనలు. కృష్ణ ప్రీత్యర్థమే వారు జీవించారు - జీవిస్తున్నారు. "సుఖించాలి" అన్న భావం గలవాడు సహజంగానే ఎదుటి వ్యక్తి సుఖాల్ని నాశనం చేస్తాడు, లేకపోతే సుఖించలేడు, "సుఖింపచేయాలి" అన్న భావం గలవాడు స్వసుఖాల్ని నాశనం చేసి కొంటాడు, లేకపోతే సుఖింపచేయలేడు. గోపికలు సమస్తాన్ని, చివరకు 'నేను' ను కూడా త్యాగం చేశారు. అప్పుడు ఆ సమస్తంలో - నేను లో నివసిస్తున్న గోపాలుడు దివ్యశృంగార

రసవాహినినై ప్రవహించాడు. ఈ గొప్పతనం ఎవరిది ? ప్రేమది - త్యాగానిది.

శ్రీ రాధా కృష్ణులకు గానీ - గోపికలకు గానీ రక్త మాంసాలతో కూడిన భౌతిక అన్నశరీరాలు లేవు. వారు రస స్వరూపిణులు. కామం అన్నశరీరాలలో ఉంటుంది గానీ రసశరీరాలలో ఎట్లా ఉంటుంది. ఆ రసశరరాలలో ఒక ఒక్క దివ్యగుణ ముంటుంది - అదే త్యాగం.

కామరలో అయినా - ప్రేమలో అయినా వినోదా లుంటాయి, క్రీడలుంటాయి. రాసలీల అంటే అంతే గదా మరి! అయితే కామంలో నిజేంద్రియ సుఖాభిలాష ఉంటుంది, ప్రేమలో తత్సుఖంలో సుఖించట ముంటుంది. ఇంతే భేదం. క్రీడలు రెండింటిలోను ఒక్కటిగానే ఉండటం వలన 'ప్రేమను' కూడా 'కామం' అనే పేరుతో పిలవడం లోకాచారమయింది.

శ్లో॥ తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః,
జహుర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణ బంధనాః॥
( శ్రీమద్భాగవతం )

"ఆ పరమాత్మ యందు జారబుద్ధిని పొందిన గోపికలు తక్షణం బంధవిముక్తలై, త్రిగుణాత్మక శరీరాన్ని త్యజించారు".

వారికి త్రిగుణాత్మక శరీరాలు లేనేలేవు, త్రిగుణాతీత తత్త్వంపై ప్రకృతి సాంగత్యం వలన శరీరాలు త్రిగుణఛాయల్ని

సంతరించుకొన్నాయి. రాసలీలా సమయంలో అట్టి శరీరాల్ని కూడా త్యజించి, గోపికలు విశుద్ధ భావశరీరాలతో కృష్ణమయ జీవన లైనారు, జారభావంతో భజించి, మధుర రసాస్వాదన ద్వారా, భగవదభిన్నమైన దివ్య శృంగార రసాస్వాదన" ద్వారా మధుర రసస్వరూపిణు లయినారు.

ఇచటి జారబుద్ధి - కామం - అంగసంగం మొదలైన శబ్దాలు – వర్ణనలు ఎంత మాత్రం లౌకికాలుకావు. అసలు ఆ అప్రాకృత రసరాజ్యంలో ఈ లౌకిక స్థితి – వాసనలు – జీవులు ఉండనే ఉండరు గదా! అది భగవదభిన్న శృంగార రసం గదా! పై శబ్దాలకు ప్రేమ పరిభాష సర్వథా అప్రాకృతం. ఎంత మాత్రం ప్రాకృతం కాదు. అది వేదవ్యాసుల అఖండ యోగికధార. భగవదభిన్న అంతర్వాహినీ మధుర రసం. ఆ భాషయే నేర్వని ఈ క్షుద్ర ప్రాకృత జీవులకు ఆ విషయాన్ని విమర్శించే అధికార మెక్కడుంది ?

ఆధునిక కవులు శృంగారపరంగా కవిత్వం చెప్పదలుచుకొంటే స్త్రీ అంగాంగాల్ని కామవాసనతో అత్యంత హీనంగా, అతిగా వర్ణించి - వర్ణించి ఆనందం అనుభవిస్తుంటారు. చెప్పండి, వ్యాస మహర్షి కూడా ఆధునిక కవుల కోటికి చెందిన వాడేనా ? భగవదభిన్న శృంగార రసాన్ని ఆస్వాదిస్తూ, రాసలీలా దృశ్యాన్ని చూస్తూ, ఆ అనుభవాన్ని శ్లోకరూపంలో జీవులకు అందివ్వాలని వ్యాసమహర్షి దివ్య

సంకల్పం. సాంసారికమైన స్త్రీ పురుషుల కామ సుఖాన్ని వర్ణించాలని ఆయన సంకల్పం ఎంతమాత్రం కానేకాదు. అసలు ప్రాకృత కామ సుఖాన్ని వర్ణించవలసిన అవసర మేముంది ? భగవదభిన్న శృంగార రసం వేదవ్యాసుల అమృతహస్తం నుండి శ్లోక రూపం పొంది ఇలా ప్రాకృత శృంగారానికి తుల్యమైన రూపాన్ని ధరించింది. అంతే కానీ అది ఎంతమాత్రం ప్రాకృత శృంగారం కానేకాదు.

ప్రాకృత శృంగారం వలె అలా ఆ భాష ఎందుకుండాలి? గోపికలకు భౌతిక శరీరాలు లేవు, భౌతిక కామవాసన లేదు. అట్టి స్థితిలో ఆ భాషవలన ఈ భౌతిక జీవుల హృదయాలపై ఎట్టి ప్రభావం వ్యాపిస్తుందో గమనించవలసిన అవసరం ఆ అంతర్ముఖుల కుండదా ?

అవశ్యం ఉంటుంది. రాసలీలా పారాయణం వలన తాత్కాలికంగా సత్ప్రభావం లేకపోతే లేకపోవచ్చును. అంత మాత్రాన ఆ విషయాన్ని నిందించకూడదు. దాని పరిణామాన్ని ఆలోచించాలి. కథా వస్తువేమిటి ? పాత్రధారు లెటువంటివారు ? రాసలీలా ఉద్దేశ్యమేమిటి ? అని ఆలోచించాలి. నల్లని కళ్ళతో కేవలం నల్లని అక్షరాలను మాత్రమే చదువరాదు. వాని వస్తుస్థితిని ఆలోచించి, మనో వాక్కాయాల్ని ఆ లీలలో లీనం చేయాలి. ఆ దృశ్యాన్ని కళ్ళముందు చూడాలి, హృదయంలో చూడాలి. ఆ లీలలో మనం కూడా ఒకరమై పోవాలి. ఇదే రాసలీలా పారాయణ ఫలం. గోపికా గీతాల్ని పారాయణ చేసినందు

వలన భౌతిక జీవుల కామం నశిస్తుంది, లీలలో ప్రవేశం లభిస్తుంది. జీవుడు గోపిక అవుతాడు, చివరకు రసస్వరూపుడు, భావస్వరూపు డవుతాడు.

"జయతి తేఽధికం జన్మనావ్రజః శ్రయత ఇందిరా శశ్వదత్రహి."

ఈ శ్లోకంతో గోపికాగీతలు ప్రారంభ మయినాయి. ఇవి 19 శ్లోకాలు. శరత్పూర్ణిమ నాటి రాసలీలా సమయంలో, ఈ 19 శ్లోకాల రూపాలలో 19 తరగతులకు చెందిన గోపిక లున్నారు. వారు శ్రుతులు - ఋషులు, (శ్రీ వల్లభాచార్య కృత భాగవత వ్యాఖ్య - శ్రీ సుబోధినీ). ఆ 19 తరగతుల గోపికల విరహరసం - 'భగవదభిన్న శృంగారరసం' ఈ 19 శ్లోకాలుగా - ఈ లీలారూపంగా ప్రవహించింది. మనం ఆ గోపికల్ని - గోపికల హృదయాల్ని - భగవదభిన్న శృంగార రస ప్రవాహాన్ని కళ్ళముందు చూచి, కాయాన్ని దానికి కైంకర్యం చేయగలగాలి. అలా చేయలేకపోతే, వ్యక్తిగతంగా అధికారం లేకపోతే, త్రిగుణాతీత స్థితి లేకపోతే ఈ శ్రీ కృష్ణలీలలోని త్రిగుణాతీతరసం ఆస్వాదనకు రావటం అసంభవం.

ఈ శ్రీ కృష్ణలీలలు భౌతికజీవుల్ని త్రిగుణాతీతుల్నిగా రూపొందించటానికి ఉపయోగిస్తాయి. త్రిగుణాత్మకులైన మానవులు ప్రకృతి వలయంలో చిక్కి, పాపపుణ్యాలు చేస్తు

న్నారు. స్వయం నియమనశక్తి లేక సుఖదుఃఖాలకు లోనై, అశాంతికి సజీవమూర్తులై, ఆక్రందిస్తున్నారు, జీవన సంచాలకుని, ఈ కన్పడే అన్ని రూపాలు తానైన నల్లని రూపాన్ని కనులారా చూడలేక, పిల్లనగ్రోవిని చెవులారా వినలేక, 11ఇంద్రియాలతో తృప్తిగా శ్యామరసాన్ని త్రాగలేక ఎన్నో అమూల్య జన్మల్ని దౌర్భాగ్యులై నాశనం చేసుకొంటున్నారు. బలవంతంగా నైనా వీరిని సన్మార్గంలో నడిపించటానికి ఉపాయం ఏమీ లేనేలేదా? అష్టాదశ పురాణాలు వ్రాసిన తరువాత వేదవ్యాసుడిలా అపారవేదన ననుభవించాడు, చివరకు నారద సహకారంతో వేదసారంగా త్రిగుణాతీత భగవదభిన్న రసధారల్ని అద్భుతంగా ప్రవహింప చేశాడు. ఆ ధారలే శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యాలు. ఆ భాగవతం రసస్వరూపుడు గోపాలుని శ్రీ విగ్రహం. ఆ భాగవత కథలు సాధారణ జీవులకు ఎంత మాత్రం అనుకరణీయాలు కావు, వానిని కేవలం చదివితే చాలును, వింటే చాలును, నిస్సంశయంగా మనోవాక్కాయాలు కృష్ణమయా లవుతాయి.

సమస్త పురాణాలకు మూడు విధాల అర్థాలుంటాయి. "ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే." (శ్రుతి) (1) ఆధ్యాత్మికం (2) ఆధిదైవికం (3) ఆధిభౌతికం. ఆత్మ సంబంధమైనది ఆధ్యాత్మికం, దైవ సంబంధమైనది ఆధిదైవికం. పంచభూత సంబంధమైనది ఆధిభౌతికం. ఇలా

మూడు రకాలైన అర్థాలను భాగవత కథలు ప్రతిపాదిస్తు న్నాయి. అందరకు తెలిసిన సాధారణ శ్రీ కృష్ణ కథ పంచభూత సంబంధాన్ని పొందినట్లుగా కన్పిస్తోంది కనుక ఆధిభౌతికం. ఇది ఒకటవ తరగతి పాఠం. ఈ కథా పఠనం జీవుల సుషుమ్నా నాడీ గతాలైన షట్చక్రద్వారాలను తెరచి, రససంచారం కలిగించి తీరుతుంది. సహస్రారం నుండి అఖండ రసవర్షం కురిపించి తీరుతుంది. ఆపద్ధతిలో మనో వాక్కాయాల్ని నియమించి కథాపఠనం చేయాలి, శ్లోక పారాయణం చేయాలి. అప్పుడే పురాణాలకు - పురాణ పురుషులకు సరైన న్యాయం చేకూరుతుంది, పురాణరచనా లక్ష్యం సిద్ధిస్తుంది. అంటే అస్మదాదులం రసస్వరూపులమై శ్రీ కృష్ణపరివారంలో సభ్యుల మవుతాము.

ఇప్పుడు చెప్పండి, భాగవత కథలు సాధారణ జీవుల కథలా ? లేక దివ్య రస నిధానాలా ?

శ్రీ రాధాకృష్ణులకు - గోపికలకు - ఇతర కథాపాత్ర లకు మానవ ధర్మాలే కనుక వర్తించే టట్లయితే, వారు అరిషడ్వర్గాలచే పీడింపబడే వారయితే వారు కూడ సాధారణ మానవతుల్యులే అవుతారు. అట్టి స్థితిలో వారి కథల్ని చదువవలసిన అవసరమే ఉండదు. భాగవత కథా పాత్రలలో కామముంది, వారు కూడా క్రోధానికి వశులైనారు, లోక విరుద్ధాచరణ చేశారు. ఇందులోని రహస్యమేమిటి? వారు

మానవధర్మాలకు నిస్సంశయంగా అతీతులు. భగవ
వారి ఏకాదశేంద్రియాలకు ఇంద్రియ ధర్మాలయినాడు,
యాలలో రసధారలయినాడు. ఆ పాత్రలన్నియు రసస
పుడు భగవానునకు అభిన్నవిగ్రహాలు. భగవద్ధర్మం
లయిన ఆ భాగవతుల కథలలోని అప్రాకృత త్రిగుణాతీ
ధార తన ప్రబలవేగంతో భౌతికజీవుల సామాన్య ధర్మా
సబీజంగా నివృత్తి చేస్తుంది, మానవులలోని అరిషడ్వర్గ
మటుమాయం చేస్తుంది. మరణధర్మజీవుల్ని అమృతస్వ
పుల్ని— భగవత్స్వరూపుల్ని చేస్తుంది. అందువలననే
మా భాగవతకథాపఠనంలో నిరంతరం మనోవాక్కాయ
లీనం చేయాలి. అప్పుడింక ప్రశ్నలుండవు, సమాధానా
అసలే ఉండవు. భౌతికక్షుద్రమానవబుద్ధి దివ్యమైన
వద్ధర్మవిశిష్టతను ఎట్లా అర్థం చేసికొనగలుగుతుంది?
కొనుట నిస్సంశయంగా అసంభవం. ఆ రసస్వరూపుడే
లీలలోని రహస్యాన్ని ఎంతమాత్రం, లేశమైనా గ్రహి
లేదు. ఇక అన్యులేపాటి ? బ్రహ్మదేవుడు గోపాలుర ఉ
ష్టాన్ని భుజించే వేణుగోపాలుని చూచి, "ఈతడు
వేద్యుడా ?" యని ఆశ్చర్యచకితుడైనాడు, దేవేంద్రుడు
దినాలు పరీక్షించి, ఆ తరువాత గోపాలునికి దాసుడ
విషయాన్ని మరల తెలియచేయవలసిన అవసరం లేదు,
లీలారహస్యాన్ని గ్రహించలేక దేవతలు— ఋష

ఎందరో మనోవిభ్రమానికి లోనయినారు. శ్రీరామచంద్రుని భగవత్త్వాన్ని దాక్షాయణి మరియు విష్ణువాహనమైన గరుత్మంతుడు శంకించారంటే, ఇంక క్షుద్రమానవులం మనమేం మాట్లాడగలం ? శ్రీమహావిష్ణువు జగన్మోహినీరూపాన్ని చూచి కామారి విశ్వనాథుడే కామవశుడైనాడు. అయితే ఈ పురాణకథల రహస్యాన్ని లేఖకులు వ్రాయలేరు, పాఠకులు చదువలేరు. తద్ద్వారా సంశయరాహిత్యాన్ని పొందగలగటం అసాధ్యం. హృదయద్వారాన్ని తెరచి, మనోవాక్కాయ ద్వారాల్ని నిరోధించి, రసస్వరూపుడు హృదయేశ్వరునితో జీవితేశ్వరునిగా సంబంధాన్ని సంపాదించాలి, అర్ధాంగాన్ని సంపాదించాలి, ఆ భావబంధంలో బంధితులమై, పరమ ప్రియుడు గోపాలుని అప్రాకృత లీలారసంలోనికి ప్రవేశించాలి. అప్పుడే ఈ జీవులకు భగవద్విషయమై ఇష్టాగోష్ఠి జరపటానికి స్వల్పంగా అధికారం సిద్ధిస్తుంది. అయితే వారు ఆ స్థితిలో ఉండి మాట్లాడలేరు, మనం వినలేం. ఒకప్పుడు అలా అంతర్ముఖులుగా ఉండగా, భగవదభిన్నమూర్తుల త్రిగుణాతీతావస్థలో ప్రకటమయినవేగదా ఈ శ్రుతులు- రామాయణ భాగవతాదులు. కాన వానిలో మనోవాక్కాయాల్ని లీనం చేసి, భగవదభిన్నస్థితిని సాధించటమే ప్రత్యేక మానవ కర్తవ్యం.

శ్లో॥ శ్రోత్రేణ శ్రవణం తస్య వచసా కీర్తనం తథా,
మనసా మననం తస్య మహాసాధనముచ్యతే॥

"శ్రోత్రాలతో భగవత్కథా శ్రవణం చేయాలి, వాక్కుతో భగవద్గుణగనాల్ని గానంచేయాలి, మనసుతో మననం చేయాలి. ఇంతే ! ఇదే మహాసాధన."

శ్లో॥ జన్మకర్మచ మేదివ్య మేవం యోవేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥
( భగవద్గీత, అ 4 - శ్లో 9. )

" అర్జునా! ఎవరు నా జన్మకర్మల రహస్యాన్ని అనుభవ పూర్వకంగా తెలిసికొంటాడో, శరీర త్యాగానం తరం నన్నే చేరుతాడు. నా జన్మకర్మలు దివ్యములు సుమా!"

*　　　*　　　*

## (9) రాసలీల దివ్యదేహంతో జరుగుతుంది.

శ్లో॥ నా సూయన్ ఖలు కృష్ణాయ మోహితా స్తస్య మాయయా,
మన్యమానాః స్వపార్శ్వ స్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః॥
( శ్రీమద్భాగవతం, స్కం 10-అ 33-శ్లో 38. )

" శ్రీకృష్ణ మాయామోహితులైన ఆ గోపికల భర్తలు తమ పత్నులు తమ ప్రక్కనే పరుండి యున్నట్లు తెలిసికొని అసూయను చెందలేదు."

వేణుగానం గోపికల రాగాన్ని వృద్ధిచేసింది. కొందరు గోపికలు అసంపూర్ణ శృంగారాలతోనే కృష్ణ సన్నిధికి వివ

శతతో పరుగు దీశారు. వారలా వెళ్ళటం అందరు చూశారు. మదనగోపాలుడు ప్రకృతి సంసర్గంతో త్రిగుణాత్మక ఆవరణ గల వారి శరీరాల్ని ఇంటికి పంపించేశాడు. శ్రీ కృష్ణ మాయా మోహితులై ఎవరు వారి రాకను గుర్తించలేదు. వారు ఇళ్ళ నుండి వెళ్ళిన విషయాన్ని కూడా పూర్తిగా విస్మరించారు.

కొందరు గోపికల్ని వారి భర్తలు ఇళ్ళలోనే బంధించారు. ఆ గోపికలు యోగాగ్నితో తమ శరీరాల్ని త్యజించి, దివ్య దేహాలతో రాసలీలలో పాల్గొన్నారు.

ఇందువలన సుస్పష్టం. రాసలీల ద్వివ దేహంతోనే జరుగుతుంది. ఇది ద్వాపరంనాటి గోపికల విషయం.

సామాన్య జీవుల విషయంలో శ్రీ కృష్ణ భజనం - కథాశ్రవణం భౌతికతను రూపుమాపి, వారిని అమృతపథాన పయనింప చేస్తాయి, గోపికా రూపాన్నిచ్చి, రాసలీలా ప్రవేశం కలుగ చేస్తాయి. అప్పుడు జీవుడు దివ్య భావ శరీరంతో రాసలీలా రసాస్వాదన చేస్తాడు.

శరీరం రెండు విధాలు. (1) కర్మశరీరం (2) మంత్ర శరీరం లేక భావశరీరం.

సాధారణంగా మాతాపితరుల రజోవీర్య సంయోగంతో జీవులకు శరీరాలు లభిస్తాయి, క్రిమికీటకాదులకు రజోవీర్య సంయోగం లేకుండానే శరీరాలు లభిస్తాయి.

గురూపదిష్ట మంత్రం సాధకులకు భావనానుకూలంగా దివ్యశరీరాల్ని అనుగ్రహిస్తుంది.

శ్రీకృష్ణమంత్రజపం ప్రేమికులకు శాంత - దాస్య-సఖ్య - వాత్సల్య - మధుర భావాలకు అనుకూలంగా రసాస్వాదనకు యోగ్యమైన శరీరాల్ని అనుగ్రహిస్తుంది. ప్రేమ అప్రాకృతం. దాన్ని ఆస్వాదించటానికి ఈ భౌతిక శరీరం సర్వథా అసమర్థం. అందువలన భక్తులను అప్రాకృత భావ శరీరం వరిస్తుంది. శాంత-దాస్య-సఖ్య రసాల వరకు అనుభవించటానికి ఈ భౌతిక శరీరానికే అధికారముంది. మహోన్నతాలైన వాత్సల్య-మాధుర్యరస ప్రవాహవేగాన్ని మాత్రం భౌతికశరీరం సహించలేదు, అట్టి స్థితిలో ప్రేమికుడు క్రమంగా దివ్యభావశరీరంలో ప్రవేశించి, శాశ్వతంగా శ్రీ కృష్ణ పరివారంలో సభ్యుడవుతాడు.

శ్లో॥ శరీరే దేహాని యథా స్థూలం సూక్ష్మంచ కారణమ్,
తథైవాన్యద్ దేహం జ్ఞేయం భావదేహం ప్రకీర్తితమ్,
కృపాలబ్ధ మిదం దేహం సహజం జన్మజన్మని,
అథవా సాధనాలబ్ధం కదాపివా మహేశ్వరి,
న సగుణం నిర్గుణం వా దేహమిదం పరాత్మకమ్,
కుత్రాపి నహి ద్రష్టవ్యం లోకే బృందావనం వినా,
సంగతం సహకృష్ణేన గోపీనాంచరితం చ యత్,
తన్న కామాదకామాద్వా భావదేహేన తత్కృతమ్"

(రసోల్లాసతంత్రం)

అది పార్వతీ పరమేశ్వరుల వార్తాలాప దృశ్యం. పరమేశ్వరుడు చెప్తున్నాడు; "ప్రియే! స్థూల సూక్ష్మకారణా లని శరీరాలు మూడు విధాలు. ఇట్లే 'భావదేహ' మని మరొక శరీర ముంది. ఇది కేవలం భగవత్కృపాలబ్ధం. హే మహేశ్వరి! అప్పుడప్పుడిట్టి దేహం సాధనవలన కూడ లభిస్తుంది. ఈ భావ దేహం సగుణం కాదు, నిర్గుణం కాదు, పరాత్మక దేహం. బృందావన నివాసం అథవా బృందావన ప్రేమభావం లేక ఈ దేహం లభించనే లభించదు. శ్రీకృష్ణుని తోటి గోపికల మిళనం సకామం కాదు, అకామం కాదు, భావదేహ కృతం."

ఈ విధంగా పార్వతికి పరమేశ్వరుడు చెప్పాడు.

శ్లో॥ కృష్ణం స్మరన్ జనంచాస్య ప్రేష్ఠం నిజ సమీహితమ్,
తత్తత్కథా రతశ్చాసౌ కుర్యాద్వాసం వ్రజే సదాః॥
(భక్తిరసామృత సింధువు.)

గోపాలుని, ఆతని ప్రియ భక్తుల్ని నిరంతరం స్మరించి, సేవిస్తూ, శ్రీకృష్ణ రూపమయిన బృందావనంలో సాధకుడు నివసించాలి. తన హృద్గత భావాని కనుగుణ్యంగా, భావ పోషకాలైన రస విధానాల్ని అనుష్ఠించాలి. భాగవత కథా శ్రవణం చేయాలి, భాగవతోచ్ఛిష్టాన్ని భుజించాలి, గోపాలుని సహచరునిగా, అంతః బహిః ప్రాణంగా స్థూల శరీరంతో - మానసశరీరంతో నిరంతరం చింతించాలి. సమస్తేంద్రియాలు తద్రూపమయ్యే విధంగా నిరంతరం చింతించాలి. యమునా

స్నానం చేయాలి, బాంకే బిహారీ దర్శనం చేయాలి, ఆర్తుడై
ఉన్మత్తుడై, వ్రజలతల వెంట జీవనయాపనం చేస్తూ, బృంద
వనరజాన్ని, లేక వ్రజరజాన్ని భావాభివృద్ధి నిమిత్తం గోపా
స్వరూపంగా ఆరాధించాలి. నమ్మండి, బృందావన నివాస
నేటికిని, ఏనాటికైనా కూడా నిస్సంశయంగా దివ్యభా
శరీరాన్ని అనుగ్రహించి తీరుతుంది.

శ్లో॥ సేవాసాధక రూపేణ సిద్ధరూపేణ చాత్రహి,
తద్భావ లిప్సునా కార్యా వ్రజలోకానుసారతః॥
(భక్తిరసామృత సింధువు

సాధకుల రాగానుగభక్తి సుదృఢం - సద్యః ఫ
ప్రదం కావాలంటే ఉపాయం చెప్పబడుతోంది వినండి
రాగానుగమార్గంలో సిద్ధుడు, కృష్ణ ప్రేష్ఠుడు, వ్రజస్థితు
నగు రసికుని పాద పద్మాల్ని ముందుగా ఆశ్రయించి తీరా
గురుమహారాజుని భావాన్ని అనుగమిస్తూ, స్థూలదేహంతో
కీర్తనభక్తి చేయాలి. స్థూలదేహంతో, స్వరూపసిద్ధి - భా
తన్మయత్వం ప్రాప్తించినప్పుడు మానసదేహంతో, సజాతీయ
వాసనా విశిష్టులైన వ్రజ జనుల్ని నిరంతరం సేవించా
అబ్బ! చేయగలిగిన వారికి ఇంతకు మించిన సుగమ సర
సాధనం, రసాస్వాదనోపాయం ఇంకేముంటుంది !

శ్లో॥ తత్తద్భావాది మాధుర్యే శ్రుతే ధీర్యదపేక్షతే,
నాఽత్ర శాస్త్రం నయుక్తించ తల్లోభోత్పత్తి లక్షణం
(భక్తిరసామృత సింధువు

అనురాగీ వ్రజ జనుల్ని అనుగమించేవారు శాస్త్రీయ కర్మ సిద్ధాంతాన్ని, జ్ఞాన సిద్ధాంతాన్ని భావపుష్టి యందు, భావసిద్ధి నిమిత్తం తృణప్రాయాలుగా పరిత్యజించాలి, బుద్ధి వాదాన్ని విడనాడాలి. కేవలం ఆనంద చిన్మయ రసభావ పరినిష్ఠులై జీవనయాపన చేయాలి.

నేడు కూడ వ్రజవాసుల భావంలో " దేవు డనేవాడు ఎవడూ లేడు, శాస్త్రమనేది ఏదీ లేదు." వారి దగ్గర గోపాలుడనే ప్రేమరసతత్త్వం ఒకటే సావయవమై ఉంది. (1) భావుకత, (2) ఆత్మీయత, (3) అనన్యత, (4) తన్మయత, (5) విహ్వాలత అనే అయిదు అద్భుత ప్రేమరసాయనాలున్నాయి. రసాలయాలయిన వ్రజలతాగుల్మాదులున్నాయి, రసనిధానమై, గోపాల రూపంగా శ్రీధామం బృందావనముంది, ఇంకేం కావాలి! ప్రారంభంలో శ్రద్ధా విశ్వాసాలు అత్యంతావశ్యకం. అవే క్రమంగా, దివ్య ప్రేమరసాన్ని అఖండంగా ప్రవహింప చేస్తాయి. ప్రేమీ భక్తులారా! బృందావన నివాసభాగ్యాన్ని వదులుకోకండి. జాగ్రదవస్థలో ఏ కార్యం చేస్తున్నా, స్వప్నావస్థలో, సుషుప్త్యవస్థలో, సర్వ కాల సర్వావస్థలలో రాధానామాన్ని, బృందావనేశ్వరీ - శ్రీకృష్ణగతప్రాణా శ్రీరాధానామాన్ని స్మరించటం మాత్రం మరువకండి. చాలును. ఇంక మీరు గోపాలుని వారవుతారు, గోపాలుడు మీ వాడౌతాడు. ఇంతే! ఇదే ప్రేమరసం - భాగవతరసం.

# భాగవతరసం — అవతారిక

## (10) రస నిష్పత్తి

శ్లో॥ విభావా అనుభావాశ్చ కథ్యంతే వ్యభిచారిణః,
వ్యక్తః సతైర్విభావాద్యైః స్థాయీభావో రసాస్మృతః॥
( శ్రీ ముమ్మటాచార్య. )

"విభావానుభావ వ్యభిచారిభావ సంయోగాద్రస నిష్పత్తిః"
(భరతముని సూత్రాలు.)

" స్థాయీ భావ-సాత్త్వికభావ-విభావ-అనుభావ - వ్యభిచారీభావాల సంయోగంలో ప్రవహించే భగవదభిన్న తత్త్వాన్ని 'రసం' అంటారు."

మధుర రస రాజ్యం (1) స్థాయీ భావాలు - 7

(1) అభియోగం: శారీరక చేష్టలద్వారా ప్రేమ భావాభివ్యక్తి.

(2) విషయం: శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయాలకు మదనగోపాలుని ఆశ్రయోపలబ్ధి.

(3) సంబంధం: గోపాలునితో సంబంధ స్థాపన.

(4) అభిమానం: "గోపాలుడు శాశ్వతంగా నావాడు." ఎంత అభిమానం!

(5) శ్రీకృష్ణ విశేషాలు : శ్రీ కృష్ణుని విశేషాలందు, శ్రీకృష్ణపరివారమందు చిత్తవృత్తి యొక్క తాదాత్మ్యం.

(6) ఉపమా : శ్రీకృష్ణ సాదృశ్యం గల వస్తువులందు ప్రియ సమాగమానుభవం.

(7) స్వభావం: ఇది రెండు రకాలు. (1) నిసర్గం: అభ్యాసం వలన సిద్ధించిన శ్రీ కృష్ణప్రేమ. (2) స్వరూపం: జన్మ సహజ శ్రీకృష్ణ ప్రేమ.

## (2) సాత్త్వికభావాలు - 8.

(1) శరీరం స్తంభంవలె స్తంభించటం స్తంభం, (2) చెమటలు పట్టటం స్వేదం. (3) శరీరం గగుర్పొడచటం రోమాంచం (4) కంఠం రుద్ధమవటం, మాట సరిగా రాకుండటం స్వరభంగం (5) శరీరం కంపించటం కంపం. (6) శరీర వర్ణం మార్పు చెందటం వివర్ణం. (7) హర్ష - రోష - విషాదాలు కారణాలుగా నేత్రాలు అశ్రువుల్ని ప్రవహింప చేయటం అశ్రుపాతం. (8) మనశ్శరీరాల అచంచల స్థితి, ఇంద్రియ జ్ఞానరాహిత్యం ప్రళయం.

## (3) విభావం

శ్రీకృష్ణ రతిని వృద్ధి చేసే ప్రక్రియను 'విభావ' మంటారు. ఇవి నానావిధాలు. అవి ఇచట అనవసరాలు.

## (4) అ ను భా వా లు - 9

శ్లో॥ క్షాంతి రవ్యర్థ కాలత్వం విర క్తి ర్మానశూన్యతా,
ఆశాబంధః సముత్కంఠా నామగానే సదారుచిః,
ఆస క్తి స్తద్గుణాఖ్యానే ప్రీతి స్తద్వసతిస్థలే.
ఇత్యాదయోఽనుభావాః స్యుర్జాత భావాంకు రేజనే॥
(భ క్తి రసామృత సింధువు.)

(1) క్షాంతి: ధనపుత్రమాన నాశం, అసఫలత, నింద, వ్యాధిప్రభృతి కఠిన విపత్పరిస్థితులలో శ్రీకృష్ణ ప్రేమయందు చి త్తవృ త్తి యొక్క అచంచలత.

(2) అవ్యర్థ కాలత్వం : ఒక్క నిముషాన్ని కూడా వ్యర్థం చేయకుండా శ్రవణం – ధ్యానం - జపం – సత్సంగం మొదలైన వానిలో చి త్తవృ త్తిని లీనం చేయాలి.

(3) విర క్తి: విషయ విముఖత.

(4) మానశూన్యత: భ క్తుడననే అహంభావం యొక్క అభావం.

(5) ఆశ: గోపాలుడు రక్షింపగలడనే దృఢవిశ్వాసం.

(6) సముత్కంఠ: గోపాలుని కలియుట కై అసహనీయ తాపం.

(7) సదా నామగాన మందురుచి.

(8) గుణగానంలో – లీలాపఠనంలో అపారాస క్తి.

(9) శ్రీధామం బృందావనంలో నివాసం.

ఇవి సాధకునకు ఒకటి తరువాత మరొకటిగా ప్రా ప్తి స్తాయి.

## అనుభావాలు మరొక క్రమంలో 13

(1) నృత్యం, (2) విలుఠనం, (3) గీతం, (4) క్రోశనం, (5) తను మోటనం, (6) హుంకారం, (7) జృంభణం, (8) శ్వాసవృద్ధి, (9) లోకాపేక్షా త్యాగం, (10) లాలా స్రావం, (11) అట్టహాసం, (42) ఘూర్ణనం, (13) హిక్క.

## (5) వ్యభిచార భావాలు - 33

(1) నిర్వేదం, (2) విషాదం, (3) దైన్యం, (4) గ్లాని (5) శ్రమ, (6) మదం, (7) గర్వం. (8) శంక, (9) త్రాస, (10) ఆవేగం, (11) ఉన్మాదం, (12) అపస్మారం, (12) వ్యాధి (14) మోహం (15) మరణం, (16) ఆలస్యం (17) జాడ్యం (18) లజ్జ, (19) అనుభావ గోపనం (20) స్మృతి, (21) వితర్కం, (22) చింత, (23) మతి, (24) ధృతి, (25) హర్షం, (26) ఉత్సుకత, (27) ఉగ్రత, (28) అమర్షం, (29) అసూయ (30) చపలత, (31) నిద్ర, (32) సుప్తి, (33) బోధ.

ఈ రసవిధానమంతా ప్రేమభక్తిలో చేరుతుంది.

ఉత్తమ భక్తి చిత్స్వరూపం. దానికి మూడవయవాలు.

(1) ఇంద్రియాలతో సాధనచేయటానికి యోగ్యమైనది- 'సాధనభక్తి' ;

(2) అనుభావ నవకంతో కూడింది, భావాన్ని పోషించేది- 'భావభక్తి' ;

(3) అఖండ రస ప్రవాహ రూపమయింది— 'ప్రేమ

(1) సాధనభక్తి క్లేశనాశకం — శుభద

క్లేశాలకు కారణాలు అవిద్య— వాసన— భగవద్వి

సాధనభక్తివలన ఇవి నశిస్తాయి. విశ్వమందు అనుర

సేవాభక్తిభావం జనించటాన్నే 'శుభం' ప్రా

అంటారు. సాధనభక్తివలన ఇవి జన్మిస్తాయి.

(2) భావభక్తిలోని సుఖం మోక్షసుఖంకన్న

గొప్పది. 'మోక్ష' మంటే మోహక్షయం—బంధ

భావభక్తి తదనంతర రసాస్వాదన ప్రక్రియ. ఇది సి

చాలా కష్టం. బ్రహ్మరుద్రేంద్రాదులైనా సరే భా

పొందాలంటే తపస్సులు కావలసిందే. గోపాలకృష్ణు

మనోవాక్కాయాలలో శ్రీరాధారాణిని నిలిపి

తపం చేస్తుంటాడు. ఎందు నిమిత్తం? ప్రేమ ని

క్షుద్ర త్రిగుణాత్మక వ్యాపారాలలో అంతటి ప్ర

ప్రవహిస్తుందా? ప్రవహించదు. త్రిగుణాతీత స్థితిని

రసాస్వాదన వలన రసస్వరూపాన్ని పొందటానికై

వారయినా సమస్త ప్రవృత్తులు నుండి నివృత్తులై, త

ప్రేమ భిక్షు నిమిత్తం విహ్వాలులు కావలసిందే.

(3) ప్రేమభక్తి: ఇది సాంద్రానంద విశేషాత్మ

శ్లో॥ సార్వభౌమాది కానందాః పూర్వేభ్యః శత సం

పరేధికా స్తేతు లేశా బ్రహ్మానందస్య బిందువ

(శ్రీవిద్యార

సమస్త భూమండలంలో అధిక విషయసుఖ సంపన్నుడు భూపతి కావచ్చును. ఇక ఈ విషయానందంనుండి చెప్పబోవు ఆనందాలు క్రమంగా ఒకదాని కన్న నొకటి నూరు రెట్లెక్కువ. (1) గంధర్వానందం, (2) పితరుల ఆనందం, (3) దేవతల ఆనందం, (4) అజాన దేవతల ఆనందం, (5) బృహస్పతి ఆనందం, (6) ప్రజాపతుల ఆనందం, (7) సిద్ధుల ఆనందం, (8) చతుర్ముఖ బ్రహ్మ ఆనందం, ఇట్టి చతుర్ముఖ బ్రహ్మ ఆనందం బ్రహ్మానందంలో ఒక్క బిందువు మాత్రమే. మరువ రాదు, భక్తి రసామృత సింధువులో బ్రహ్మానందం ఒక్క బిందువు మాత్రమే.

శ్లో॥ భుక్తిముక్తి స్పృహా యావ త్పిశాచీ హృదివర్తతే,
తావద్భక్తి సుఖస్యాత్ర కథ మభ్యుదయో భవేత్॥
(భక్తి రసామృతసింధువు)

"భుక్తి కాంక్ష—ముక్తి కాంక్ష. ఈ రెండు పిశాచాలు. పిశాచాలుండే హృదయంలో భక్తి మహారాణి ఎట్లా నివసిస్తుంది ?"

శ్లో॥ క్లేశఘ్నీ శుభదా మోక్ష లఘుతాకృత్ సుదుర్లభా,
సాంద్రానంద విశేషాత్మా శ్రీకృష్ణా కర్షిణీ చ సా॥
(భక్తిరసామృత సింధువు – శ్రీరూపగోస్వామి.)

"భక్తి మహారాణి షడైశ్వర్య సంపన్న (1) సమస్త క్లేశాల్ని సబీజంగా నశింప చేస్తుంది. (2) సమస్త శుభాలు కలుగ చేస్తుంది. (3) మోక్ష సుఖాన్ని హీనం చేస్తుంది. (4) ఆ మహారాణి మనదిగా, మనచెంత నిలవటం సుదుర్లభం. (5) ఇంకా ఆమె సర్వోత్కృష్టానందాన్ని విశేషంగా కలిగి వుంది. (6) ప్రధానంగా మదనగోపాలుని ఆకర్షిస్తోంది.

'భక్తి' - ముఖ్యంగా 'ప్రేమభక్తి' లో పై ఆరు విశేషాలు ఉండితీరుతాయి.

*　　　*　　　*

## (11) గోపాలుడు - ప్రేమరసం

ప్రేమభక్తి శ్రీకృష్ణాకర్షకం

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥
(భగవద్గీత, అ 7 - శ్లో 7.)

"ధనంజయా! నాకు భిన్నమైన వస్తువు ఎచట చూచినా లేశమైనా లేనే లేదు. మణిహార గర్భంలో సూత్ర మెట్లా ఉంటుందో అట్లే ఈ బ్రహ్మాండగర్భంలో నేనున్నాను. సమస్త బ్రహ్మాండాలకు ఏకైక మూలకారణం నేనే."

శ్లో॥ ఏతేచాంశ కళాపుంసః కృష్ణస్తు భగవాన్ స్వయం,
(శ్రీమద్భాగవతం. 1స్కం- 3 అ - 28 శ్లో.)

"శ్రీకృష్ణుడు అవతారి. సమస్తావతారాలు ఆ పూర్ణ పురుషునికి అంశలు."

శ్లో॥ వయసో వివిధత్వేపి సర్వభక్తి రసాశ్రయః,
ధర్మీ కిశోర ఏవాత్ర నిత్యలీలా విలాసవాన్॥
(విభావలహరి - 27 శ్లోకం.) (భక్తిరసామృత సింధువు.)

"శ్రీకృష్ణుడు బాల్య - పౌంగడ-కైశోరాది భేదాలు గల వయస్సులలో ప్రకట మవుతుంటాడు. అయినా అన్ని వయోధర్మాలతో విశిష్టతను సంతరించు కొనేది ఒక్క కిశోర రూపం మాత్రమే. ఆ రూపం సర్వభక్తిరసాలకు ఆశ్రయం,

పూర్ణతమం. ఆ రూపంతో గోపాలుడు వ్రజభూమిలో 24 గంటలు తన అవతారకాలలీల లన్నింటిని ప్రదర్శిస్తున్నాడు."

ఒకటే మాట! భక్తిరసం పరిపూర్ణతను పొందాలంటే, భక్తులు పరాకాష్ఠ రసాన్ని పరిపూర్ణంగా ఆస్వాదించి, రసస్వరూపులు కావాలంటే ఒక్క మదన గోపాలునే ఆశ్రయించాలి. ఇది తప్ప, ప్రేమించాలి. దేహాన్ని మనం ప్రేమిస్తూనే ఉన్నాం గదా, దేహంలో ఉండేవానిని ప్రేమించటం ఏంకష్టం చెప్పండి. స్వల్ప అభ్యాసం చేస్తే చాలును, అది చాలా సహజమైపోతుంది. ఏమీ కష్టం ఉండదు. దేహాన్ని, క్షేత్రాన్ని ప్రేమించటం మానుకోవాలి, అప్పుడే మనం క్షేత్రజ్ఞుని, మదనగోపాలుని ప్రేమించ గలుగుతాం. మనవకండి, ప్రయత్నించి చూడండి.

శ్లో॥ అఖిల రసామృతమూర్తిః ప్రసృమర రుచిరుద్ధ తారకాపాళిః,

కలిత శ్యామా లలితో రాధా ప్రేయాన్ విధుర్జయతి॥

(భక్తిరసామృత సింధువు.)

"పంచవిధాలయిన శాంతాది రసాలు, హాస్యాది గౌణరసాలు, గోపాలుని స్వరూపాలు. తారక-పాళి, శ్యామ - లలిత యను గోపికలను స్నేహసౌందర్యాలతో ఆకర్షించి, స్వపరివారంలో చేర్చుకొన్న రాధాప్రాణనాథుడు ఈ మదన గోపాలుడు సర్వోత్కృష్టుడై విరాజిల్లు గాక!"

శ్లో॥ మధురం మధురం వపురస్యవిభో
ర్మధురం మధురం వదనం మధురం,
మధుగంధి మృదుస్మిత మేతదహో
మధురం - మధురం - మధురం - మధురమ్॥
(శ్రీకృష్ణ కర్ణామృతం.)

ఆ గోపాలుని వపువు (శరీరం) ఎంత మధురం ! ఎంత మధురం వదనం! మధుసౌరభంతో కూడిన ఆ మందహాసం ఎంతో మధురం! ఎంతెంతో మధురం!!

శ్లో॥ త్వచ్ఛైశవం త్రిభువనాద్భుత మిత్యవేహి
మచ్చాపలంచ తవవా మమవాఽధి గమ్యమ్,
తత్కిం కరోమి విరళం మురళీ విలాసి
ముగ్ధం ముఖాంబుజ ముదీక్షితు మీక్షణాభ్యాం॥

“ గోపాలా ! ఒక విన్నపం. నీ బాల్యావస్థలోని సౌందర్యం, లీలలలోని మాధుర్యం మూడు లోకాలలో మరెచ్చటా లేనే లేవు. వానిని కనులారా చూడాలని నా చాపల్యం అత్యుత్కటంగా ఉంది. ఇక జీవనయాపన చేయటం చాలా కష్టం కూడా అవుతుంది. మురళీగానలోలా! వేణు గోపాలా! నీ సుందరముఖారవిందాన్ని నా యీ కళ్ళతో చూడాలంటే నేనేం చేయాలి ? ”

మనసు _ వాక్కు - శరీరం అనే మూడు పాత్రలలో నిండుగా ఆ శ్యామరూపాన్నే నింపుకోవాలి, శ్యామరసాన్నే

నింపుకోవాలి. అప్పుడు సర్వేంద్రియాలు రసోన్మత్తాలయి, విహ్వలా లవుతాయి, విశ్వమంతా వేణుగోపాల మయం అవుతుంది. సర్వేసర్వత్రా వేణుగానమే; వేణుగానం లలిత నర్తనం చేస్తుంది. కృష్ణ తృష్ణ సమస్త పరిసరాల్ని, జీవుల్ని, బ్రహ్మాండాల్ని కృష్ణ మయం చేసి తీరుతుంది, కృష్ణుని దాసునిగా చేసితీరుతుంది.

శ్లో॥ విదగ్ధో నవతారుణ్యః పరిహాస విశారదః,
నిశ్చింతో ధీరలలితః స్యాత్ ప్రాయః ప్రేయసీ వశః॥
(భక్తిరసామృత సింధువు)

" గోపాలుడు రసికుడు, నవయౌవనవంతుడు, పరిహాస నిపుణుడు, ఉద్వేగరహితుడు, ధీరుడు, లలితనాయక శిరోమణి. ప్రేయసీగణం ఎట్టి ప్రేమభావంతో ఆతనివారవుతారో ఆతడు కూడా అదే ప్రేమరసరూపంతో ఆ ప్రేయసీ గణానికి వశుడవుతుంటాడు."

భావం ఎట్టిదో రసం అట్టిది. రసమెట్టిదో రూపంఅట్టిది. ఒకటే మాట! గోపాలుడు అందరివాడు, అందరు గోపాలుని వారు.

శ్లో॥ పుంజీభూతం ప్రేమ గోపాంగనానామ్,
ఏకీభూతం గుప్తవిత్తం శ్రుతీనామ్,
మూర్తీభూతం భాగధేయం యదూనామ్,
శ్యామీభూతం బ్రహ్మమే సంనిధత్తామ్॥

వ్రిజబాలల ప్రేమ సాకారమయింది. శ్రుతులలోని
ఏకత్రితమయింది, యదువంశీయుల భాగ్యం మూర్తివంత
యింది. అదే శ్యామరూపం. ఆతడే వేణుగోపాలుడు -
దనగోపాలుడు. శ్రీ రాధారాణి గోపాలున కంగ సౌందర్య
యింది, గోపాలుడు శ్రీ రాధారాణి కంగ సౌందర్యమయి
డు. అంటే ప్రేమరసం అలా ప్రియాప్రియతముల రూపా
లో ప్రకట మయింది. ప్రేమరసమంటే సాత్త్వికభావాలే
నా! సాత్త్విక భావాలతో శ్రీ ప్రియాప్రియతములు నిత్యం
స్నానం చేస్తారు, శృంగారం చేసికొంటారు, వస్త్రాభరణాలు
స్తారు. సాత్త్వికభావాలే వారికి గంధం, కస్తూరి, కాటుక,
ప్పురు, పసుపు, కుంకుమ. సాత్త్వికభావాలే అన్నిరూపా
గా కన్పిస్తున్నారు, దివ్య శృంగారరసంతో దినచర్యను
యిస్తున్నాయి. ఇంకా చదవండి. భగవదభిన్నమైన ఆ
ప్రాకృత దివ్యశృంగారరసం తన స్వరూపాన్ని విస్తరింప
మూలనుకొంది, వ్రిజబాల లయింది.

ఆ వ్రజబాలలు రసాలాలు. రసస్వరూపుడు గోపాలుని
పం, రూపరసం వారిలో ఒక్కొక్కరిలో ఒక్కొక్క
సంగా ప్రకటమవుతోంది. రూపంలో నిత్యనూతనత్వం,
ంలో నిత్యనూతనత్వం, లీలలో నిత్యనూతనత్వం. రాధా
ష్ణులు నిత్యనూతనులు. వారి సంబంధాన్ని పొందినవన్నీ
డా, ప్రేమీభక్తులు, గోలోక బృందావనాలు కూడా

వ్రజబాలల ప్రేమ సాకారమయింది. శ్రుతులలోని నిధి ప్రకటితమయింది, యదువంశీయుల భాగ్యం మూర్తివంత మయింది. అదే శ్యామరూపం. అతడే వేణుగోపాలుడు - మదనగోపాలుడు. శ్రీ రాధారాణి గోపాలున కంగ సౌందర్య మయింది, గోపాలుడు శ్రీ రాధారాణి కంగ సౌందర్యమయి నాడు. అంటే ప్రేమరసం అలా ప్రియాప్రియతముల రూపా లలో ప్రకట మయింది. ప్రేమరసమంటే సాత్త్వికభావాలే గదా! సాత్త్విక భావాలతో శ్రీప్రియాప్రియతములు నిత్యం స్నానం చేస్తారు, శృంగారం చేసికొంటారు, వస్త్రాభరణాలు ధరిస్తారు. సాత్త్వికభావాలే వారికి గంధం, కస్తూరి, కాటుక, పన్నీరు, పసువు, కుంకుమ. సాత్త్వికభావాలే అన్నిరూపా లుగా కన్పిస్తున్నారు, దివ్య శృంగారరసంతో దినచర్యను చేయిస్తున్నాయి. ఇంకా చదవండి. భగవదభిన్నమైన ఆ అప్రాకృత దివ్యశృంగారరసం తన స్వరూపాన్ని విస్తరింప చేయాలనుకొంది, వ్రజబాల లయింది.

ఆ వ్రజబాలలు రసాలాలు. రసస్వరూపుడు గోపాలుని రూపం, రూపరసం వారిలో ఒక్కొక్కరిలో ఒక్కొక్క విధంగా ప్రకటమవుతోంది. రూపంలో నిత్యనూతనత్వం, రసంలో నిత్యనూతనత్వం, లీలలో నిత్యనూతనత్వం. రాధా కృష్ణులు నిత్యనూతనులు. వారి సంబంధాన్ని పొందినవన్నీ కూడా, ప్రేమీభక్తులు, గోలోక బృందావనాలు కూడా

నిత్యనూతనాలే. శ్రీకృష్ణలీలలు, ముఖ్యంగా రాసలీల నిత్య నూతనాలు కావటంవల్లనే ఇంతటి అద్వితీయతను, రసవత్త మత్వమును సాధింపగలిగాయి. "అనారోపితాకారం తత్త్వం." ఇంకా సావయవం కాని మూలాన్ని 'తత్త్వ' మంటారు. అంటే ఆభరణాల రూపం పొందని స్వర్ణం తత్త్వమన్న మాట. శృంగారరసం కూడా తత్త్వమే. అది సగుణ-నిర్గుణా లకు అతీతం. సగుణం మరియు నిర్గుణం. అదే శ్రీరాధా కృష్ణులు మరియు గోపికలు. క్రియారూపాన్ని కూడా ధరిం చింది. అది భగవదభిన్న శృంగారరసం. అద్భుతం - అప్రా కృతం.

శ్లో॥ వాగ్భిస్తువంతో మనసాస్మరంతః

తన్వా నమంతోఽప్యనిశం న తృప్తాః,

భక్తాఃస్రవన్నేత్రజలాః సమగ్ర

మాయుర్హరే రేవ సమర్పయంతి॥

(హరిభక్తి సుధోదయం.)

"గోపాలా! వాక్కుతో నీ గుణాల్ని కీర్తించాం, మన సుతో స్మరించాం, శరీరంతో సేవ చేశాం. ఇంక చేయగలి గిందేమీ కానరావటం లేదు. కాన గోపాలా! మా ఆయు వునే ఈకన్నీటిరూపంలో నీకు ధారపోస్తున్నాం. స్వీకరించవూ?"

ఒక్కమాట! గోపికలు కాదలచే వారందరు ఇలాగే చేయాలి.

భాగవతరసం - అవతారిక సమాప్తం.

# భాగవతరసం - పశువులు

శ్లో॥ యావద్ వత్సపవత్స కాల్పక వపుర్యావత్ కరాం
ఘ్ర్యాదికమ్,
యావద్ యష్టి విషాణవేణుదలశిగ్ యావద్విభూ
షాంబరమ్,
యావచ్ఛీల గుణాభిధాకృతి వయో యావద్విహా
రాదికమ్,
సర్వం విష్ణుమయం గిరోఽఙ్గవదజః సర్వస్వరూపో
బభౌ॥

(శ్రీమద్భాగవతం, స్కం.10-అ13-శ్లో19)

అది బ్రహ్మపరీక్షాసమయం. గోవత్సములు, గోపాలుర మాత్రం దొంగిలింపబడ్డారు. ఆవులు—ముదుసలి గొల్ల వాండ్రు మాత్రం పాతవారే. మన మదనగోపాలుడే ఆవు దూడలుగ—గోపబాలురుగ ప్రకటమైనాడు. పాత గోపాలుర బెత్తాలు ఎట్టివో, ఎంత ప్రమాణంగలవో అంతలోనే ప్రకటమైనాడు. మురళీ వస్త్రాభూషణాల రూపాలలో గూడా సర్వవిధాలుగా పాతగోపాలుర స్వభావాన్నిగూడా పరిగ్రహించి, ప్రకటమైనాడు. యథావత్ శీల, స్వభావ, గుణ, నామ, రూప అవస్థల కనుకూలంగా ప్రకటమైనాడు. ప్రకటమేమైనాడు ? అప్రాకృత ప్రేమరసం అఖండంగా ప్రవహించింది. "సర్వం విష్ణుమయం జగత్."

శ్లో॥ గావ స్తతో గోష్ఠముపేత్య సత్వరమ్
హుంకార ఘోషైః పరిహూత సంగతాన్,
స్వకాన్ స్వకాన్ వత్సతరా నపాయయన్
ముహుర్లి హంత్యః స్రవదౌధసం పయః॥
(శ్రీమద్భాగవతం, స్కం.10-అ13-శ్లో 24)

దూడలకు దుగ్ధపానం చేయించాలని ఆ యావుల లాలస. త్వరత్వరగా పచ్చిగడ్డిమేసి వెనుదిరిగినాయి. పరా కాష్ఠ భావం. శరీరాలు సాత్త్విక భావపూర్ణాలు-నయనాలు వాత్సల్యరసపూర్ణాలు. నాదం రసప్రవాహానికి జన్మస్థానం. ఆవులు హుంకారం చేశాయి. భావం ఝుంకారం చేసింది. క్లీంకారం ప్రేమరస ప్రవాహమయింది. ఓంకారరూపి కెంత ఆనందం! ఎంత ఆనందం!! ప్రేమ క్షీరములుకాగా ఆవు దూడలకు భావం నిమిత్తం ఆకలిఅయింది. గోవులు వాత్సల్య రస ప్రతీకాలు - దూడలు రసవిస్తారకాలు. గోవుల హృద యాలలో గోపాలుడు, నయనాలలో గోపాలుడు, ఆహారం గోపాలుడు, ఆవేదన గోపాలుడు. గోపాలుడంటే ప్రేమరసం. ఆ గోసంఘం భావసజీవం, భావవిహ్వాలం. మరి యావత్సలో రాసవిహారి బాంకే బిహారి ముని మనహారి గిరిధారి మదన గోపాలుడు. ఆవులు వత్సల శరీరాలను విశుద్ధలాలసలో, విహ్వాలతలో నిర్విరామంగా నాకుతున్నాయి. శాబాశ్! అదిగో అదే 'లాలస.' దానినే 'రస' మంటారు. ఆ రసనం

సర్గంలో, రాసవిహారి సంసర్గంలో సమస్త జడచేతనాత్మక ప్రకృతి చిన్మయమై, రసప్రవాహ మయింది.

"వ్రజతి భగవత్ సమీపం స వ్రజః
తే జన్మనావ్రజః అధికం జయతి."

జీవుని భగవత్సన్నిధానానికి ప్రయాణింపచేసేది వ్రజం. అదే శరీరం. "వ్రజమిత్యేవ శరీరమ్." (శ్రీమద్భాగవత భాష్యం.) అందలి మదనగోపాలుడు అప్రకటస్థితినుండి ప్రకట స్థితికి మారాడు. ఆ సహస్రార సుధావర్షమే ఈ రసానుభవం. 84 క్రోసుల లీలాభూమిని 'వ్రజ' మంటారు. ఆ ద్వాపర శ్రీకృష్ణలీలలన్నీ బృందావనమున ఈ రోజు కూడా జరుగు తున్నాయి. వాసివలన నాటికి, నేటికి, ఏనాటికి జడం చేతనం కావలసిందే. చేతనం జడం కావలసిందే. ప్రేమికుడు, అప్రేమి కుడు సమస్త జనత రసస్వరూపులు కావలసిందే. జడ చేత నాత్మక సమస్త ప్రకృతి భగవానున కుపాధి, జీవున కుపాధి అవిద్య. ప్రేమ మురళీగానం. దానికి సమస్త జడచేతనాత్మక ప్రకృతి మధురభావవాహిని. విరాగం నుండి రాగోదయ మవు తుంది. అందు జగమంతా జగన్మోహనుడవుతుంది. జీవుడా జగన్మోహనుని మాత్రమే భోగించాలి. భౌతికశరీరం మురళి. శబ్ద బ్రహ్మ అందలి రవం. సహస్రారరసం ఆ రసవాహిని. భావం దానికి సుమనోహర పరిమళం.

శ్లో॥ తథా పరమహంసానాం మునీనా మమలాత్మనామ్,
భక్తియోగవిధానార్థం కథం పశ్యేమహిస్త్రియః॥
(శ్రీమద్భా. 1 స్కం. అ8-శ్లో 20.)

"కుంతీ స్తుతి ప్రవాహాగతి కలితం. భగవన్! పరమ హంసలు అంతరారాములు. వారు మననశీలురు. మన+న= మనసును నశింపచేసేది మననం. వారు తపోనిధులు, అమలాత్ములు. అట్టివారిని భక్తి మార్గమున నడిపించుటకే మీ ప్రాకట్యం - నరనాట్యం జరుగుతున్నాయి. మేము స్త్రీలం. బుద్ధి యందల్పులం. మిమ్మెట్లు గుర్తింపగలం ?"

అమలులై మునులు మననశీలతను సాధించారు, మననశీలురై అంతరారాములైనారు.

తస్యా శ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః,
సబ్రహ్మ సశివః సహరిః స ఇంద్ర స్సోఽక్షరః పరమ
స్స్వరాట్ ॥
(మంత్రపుష్పం)

హృదయ శిఖా మధ్యభాగం పరమాత్మ ప్రాంగణం. ఆ పరమాత్మ వివిధరూపాలే బ్రహ్మేంద్ర శివవిష్ణ్వాదులు. బీజ మొక్కటే. దాని పత్ర పుష్పఫలాలనంతాలు. ఆ బీజము వీని అన్నింటికి కారణం. మరియు భిన్నం. సాంత వస్తువైతే ఇట్లుండదు. అది అనంత తత్త్వం కనుక సాంత వస్తువు లన్నియు తానై, ఏతద్భిన్నంగా కూడా ఉండ గలుగుతోంది.

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్॥
(భగవద్గీత అ 9 - శ్లో 18)

"అర్జునా! సమస్త జీవులకు ఆధారమెవడు? భరించువాడు, ప్రభువు, సాక్షిమాత్రుడు, నివాసస్థానము ఎవడు? ఎవడు ఉత్పత్తి లయ స్థానం? ఎవడు నిధానం? ఎవడు అవినాశ బీజం? ఈ అన్ని ప్రశ్నలకు సమాధానం 'నేను.' అర్జునా! నేనొక్కడనే."

ఆ అనంత తత్త్వం యొక్క అనంత ముఖీరసవాహిని మరల ఒక్కటే. కారణం బీజం ఒక్కటే గదా!

ఆ అంతరారాములు పరమహంసలే ఈ బృందావన వృక్షపాషాణాలు, పక్షులు.

శ్లో॥ వనలతాస్తరవ ఆత్మని విష్ణుమ్
వ్యంజయంత్య ఇవ పుష్ప ఫలాఢ్యాః,
ప్రణతి భార విటపా మధుధారాః
ప్రేమ హృష్ట తనవః ససృజుః స్మ॥
(శ్రీమద్భా. స్కం 10 - అ 35 - శ్లో 9)

సమస్త బృందావన వృక్షాలు ఫలపుష్పసంశోభితాలు, ఆ భారం కొమ్మలచే భూమిని స్పృశింపచేస్తోంది. బహుశా అవి భూమాతకు నమస్కరిస్తున్నా ఏమో! సమస్త వృక్షాలు - లతలు వాని ప్రతి ఆకు గోపాల స్వరూపమే. "వృక్షే వృక్షే వేణుధారీ పత్రే పత్రే చతుర్భుజః." ప్రతి వృక్షం వేణుగోపాలుడు, ప్రతి ఆకు చతుర్భుజుడు. ఈ సుందరాభివ్యక్తియే ఫలపుష్ప వికాసం. విచిత్రం! వాని ప్రతి

ఆసు నుండి మధురరసధార. వాస్తవంగా మధుర రసధార. బృందావనం ప్రాకృతమా? కాదు, భగవానుని సంవిధాశక్తి.

గోవులు వాత్సల్యరసాన్ని, గోపాలరసాన్ని, శ్యామ రసాన్ని ప్రవహింప చేస్తున్నాయి. ఆశ్చర్య మేముంది? గోపికలు గోవుల భాగ్యానికి ఎంత అసూయాగ్రస్తలో చూడండి.

శ్లో॥ గావశ్చ కృష్ణ ముఖ నిర్గత వేణుగీత
పీయూష ముత్తభిత కర్ణపుటైః పిబంత్యః,
శావాః స్నుత స్తనపయః కవళాః స్మతస్థు -
ర్గోవింద మాత్మని దృశాశ్రు కళాః స్పృశంత్యః॥
(శ్రీమద్భా. స్కం 10 - అ 21 - శ్లో 13)

మదనగోపాలుడు త్రివక్ర మోహనాకారుడు, మురళీ గాన లోలుడు. నాదం లేక నామరూపాలు లేవు, జగం లేదు, రసం లేదు. మురళీగాన సుధ ప్రవాహం. ఆ గోవులు తమ రెండు చెవులను, రెండు నేత్రాలను పాత్రలుగా చేసికొని రసాస్వాదన చేస్తున్నాయి. ఒక్క జిహ్వతో తృప్తిగా త్రాగ లేవు గదా! చెవులకు గానరసం, నేత్రాలకు రూపరసం, సర్వేంద్రియాలకు శ్యామరసమే శ్యామరసం అఖండంగా అందుతోంది. వత్సలు తల్లి పొదుగును నోట్లో పెట్టు కొన్నాయి, గోమాతలు పచ్చిగడ్డిని నోట్లో పెట్టుకొన్నాయి. అంతే! అట్లే స్తంభించి పోయాయి. సాత్త్విక భావాలు సరస నర్తనం చేశాయి. ఇంద్రియ మార్గముగా ప్రవహించు శ్యామ

రసాన్ని, రాసవిహారిని ఆ గోవుల హృదయం గాఢాలింగనంలో బంధించివేసింది. ప్రేమ అక్కడ క్షీరము లయింది, భావం నయననీరము లయింది. హృదయేశ్వరుడు గోపాలుడు వీనిలో ప్రవహించాడు, సమస్త వ్రజభూమిని ప్రవహింపచేశాడు. ఏ ఆవునకు శరీర జ్ఞానం లేదు. ఎట్లుండగలదు? దేహమున్నది కానీ అక్కడ 'అహం' లేదు. ముక్తి ఉన్నది, లయం లేదు, జగమున్నది మాయలేదు, రోదనమున్నది దుఃఖం లేదు, ప్రేమ అప్రాకృతం. అందులో మానవీయ సుఖ దుఃఖము లెట్లా ఉంటాయి? జీవి చిన్మయ శరీరుడు. అది భగవానుని రసవిస్తరణ వినోదం. ఆ స్వరూప విస్తరణోత్సవంలోని సుఖ దుఃఖాలు, దుఃఖసాగరంలోని ఒకే ఒక్క బిందువు సమస్త ప్రాకృత సుఖదుఃఖాల్ని హీనం చేస్తుంది, సమస్త బ్రహ్మానందాన్ని కూడా చాలా తక్కువ చేస్తుంది. అక్కడున్నది ఒక్కటే 'నేను'. అది విశుద్ధం. అదే గోపాలుడు. ఆ ఒక్కటే అనేక మయింది. అనేకం మరల ఒక్కటి కావాలి. అప్పుడే ప్రేమరసం ఆస్వాదనకు వస్తుంది. స్వస్వరూపానుసంధానం జరుగాలి. 'అదే భక్తి'. "స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే." (శ్రీ ఆదిశంకరులు—వివేకచూడామణి.)

ఆశ్రితులు ఆనందించాలి. ఇందుకు విశ్వమూర్తి వివిధ, వివిధ రూపాలతో విచిత్ర, విచిత్ర వినోదాలు చేస్తున్నాడు. ఒకప్పుడు బ్రహ్మాండాలను బహిరంగం చేస్తున్నాడు, మరొక ప్పుడు తనలోకి సంగ్రహించుకొంటున్నాడు. సత్త్వరజస్తమో గుణములు కలవారు శ్రీకృష్ణలీలల్ని అర్థంచేసికోలేరు. అర్థం కావలసిన అవసరంకూడా లేదు. కారణం అవి అనుకర ణీయాలు కావు. వానిని శ్రవణం చేస్తేచాలు, చదివితే చాలు. భగవత్కథ భగవద్రూపమే. అందులో మనకు తీయు తీయని అనుభవాలు రావాలి, మన గోపాలుని కథ కావాలి. జీవితంలో మార్పు రావాలంటే ఇంకొక జీవితాన్ని ఆలంబ నంగా గ్రహించాలి. స్వభావ ప్రభావం - ఉత్తమ జీవిత ప్రభావం మనసుపై చాలా బలంగా ఉంటుంది. గోపాలుడు గుణ కర్మలకు అతీతుడు. గుణ కర్మలకు అధీనుడైనట్లుగా నటిస్తాడు గుణకర్మాధీన జీవులను తన హృదయంలోకి ఆహ్వానించుకొంటాడు. భగవానుని దివ్య జన్మకర్మలు మాన వుల జన్మకర్మలను నివృత్తి చేస్తాయి, దివ్యులను చేస్తాయి. "జన్మకర్మచ మే దివ్యం" (గీత). ఆ శ్యామవర్ణం, ఆ లీలా వర్ణం మనలో మనరూపు చెందాలి. అంతే! జీవుడు ప్రేమ స్వరూపుడై తీరుతాడు. త్రిగుణాతీత స్థితి కావాలా? అయితే త్రిగుణాతీతులు శ్రీ రాధాకృష్ణులను ప్రేమించి తీరాలి.

శ్లో॥ ధన్యాః స్మ మూఢ మతయోఽపి హరిణ్య ఏతా
యా నందనందన ముపాత్త విచిత్రవేషమ్,
ఆకర్ణ్య వేణురణితం సహకృష్ణ సారాః
పూజాం దధుర్విరచితాం ప్రణయావలోకైః॥
(శ్రీమద్భాగవతం, స్కం.10-అ21-శ్లో11)

ఏమి యీ పశుపక్ష్యాదుల భాగ్యం! మురళీగానసుధ ప్రవాహం. ఆ ప్రవాహానికి సుందర విశ్రామతీరాలు గోపాల శ్రీచరణ యుగళం. సమస్త హరిణాలు తమ పతిబృంద ముతో ఆ తీరానికి కొట్టుకొని పోయినాయి. వాని నయనాలు పద్మపత్రాలు. అందున్నది అప్రాకృత శ్యామరసం. గోపా లుని మందహాసం ఆ రసవాహినికి సుమనోహర పరిమళం. హరిణాలు పరవశం — పరమాత్మ వశం. ఓహో! ఏమి యీ ప్రకాశం!

శ్లో॥ ప్రాయో బతాంబ విహగా మునయోవనేఽస్మిన్
కృష్ణేక్షితం తదుదితం కలవేణు గీతమ్,
ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిర ప్రవాళాన్
శృణ్వంత్య మీలిత దృశో విగతాన్యవాచః॥
(శ్రీమద్భాగవతం, స్కం.10-అ21-శ్లో14)

ఆ బృందావన వృక్షశాఖ లందున్న పక్షి బృందాన్ని ఎవరు స్మరింపనైన స్మరింపరేమి? పక్షులా యవి? కానే కావు. శ్రీకృష్ణరూప మాధుర్యం ఆస్వాదించాలని పరమహంసలు

బృందావనంలో పశువు లయ్యారు. వాని చూపులన్ని శ్యామ వర్ణంలో కేంద్రీకృతమైనాయి. శ్యామవర్ణం - వేణుగీతం - చంచలనేత్రాలు - మందహాసం వాని చూపులలో ఇట్లు కట్టు కొన్నాయి. వానికి జీవనం మురళీగానంలో. అతృప్తి - విహ్వాలతలే వానికి జీవనం. గోపికలు అసూయాగ్రస్తలు; "మన జీవన మదేల కాల్పనా!" ఉన్నతికాము డెవడు ఈర్ష్య చెందడు? ప్రేమమార్గంలో ఈర్ష్యవలన ప్రేమవృద్ధి అవుతుంది. కనుక ఇది దోషంకాదు, గుణమే.

"గోపాలా ! అంతటి ప్రేమ మాకీ నరజన్మలో లేనే లేదా ? అయితే మమ్ములను కూడ నీ బృందావనమున పశు పక్ష్యాదులుగా పుట్టించవూ ?"

"అబ్బా ! అదేమి వేణుగానం ! ఎంత కుటిలం !! ఇతరులయందు దయ చూపటం దానికి తెలియనే తెలియదు. దానివలననే మేము ప్రేమవ్యాధిచే పీడింపబడుతున్నాం."

దీని కొక్కటే ఘనౌషధం. అది మదనగోపాలుని గాఢాలింగనమే. అదెప్పుడు ? ఎట్లు ?

* * *

శ్లో॥ ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే,
కుర్వంత్యహైతుకీం భక్తి మిత్థం భూత గుణోహరిః॥
(శ్రీమద్భా. స్క 1 - అ7 - శ్లో10.)

"ప్రాచీనకాలంలో మునులు ఆత్మారాములు, వాంఛా హీనులు. అయినను కారణం లేకుండా ప్రేమించటం వారికి

స్వభావంగా ఉండేది. శ్రీహరి ప్రేమరసామృత వారిధి. ఆయనను ప్రేమింపకుండటం ఎట్లా సాధ్యం ?"

మననశీలురు మునులు. మనసును నశింపచేసే ప్రయత్నంలో తత్పరులు. ప్రపంచ విషయాలు వారిని బంధించలేవు ఆత్మారాములు. ఆత్మరమణం ఆనందం కావాలనే గదా! అయినా వారు వాంఛాహీనులు - అమనస్కులే. వారి మనసులో భౌతికప్రపంచం లేదు. రసప్రపంచం - మదనగోపాలుడు ఉన్నారు. గోపాలుడు అవాఙ్మానస గోచరుడు. అయినా కృపాపరవశుడై వీసిలోనికి దిగివస్తాడు. ఆ మునులు ఆకారాసక్తులు-సంభోగాసక్తులు. ఆత్మలోలత-మననశీలత-వాంఛాహీనత ప్రేమరసధార నఖండం చేస్తాయి.

భగవన్నామ రూపములను చింతిస్తే చింతాక్రాంత జీవులు అమృతస్వరూపు లవుతారు. ఇక భగవానుడే, గోపాలుడే అనుగ్రహింప దలిస్తే ఏమివ్వలేరు! స్వధామాన్ని, స్వరూపాన్ని, ఇంత ఏల సమస్తాన్ని, ఆసమస్తంలో ఉన్నతనని, తనలో ఉన్న హృదయాన్ని, హృదయంలో ఉన్న ప్రేమని గోపాలుడు పరిపూర్ణంగా ప్రేమికుని స్వంతం చేస్తాడు. ఒకటే మాట ! ఏమోనో విషయాలను ఏల కోరుకుంటారు. గోపాలుని కోరుకోండి. సమస్తం ఆ రూపంలోనే ఉన్నాయి. భగవద్దర్శనం లభించటం గొప్పవిషయం కాదు, అనుగ్రహం-ప్రేమ లభించటమే గొప్ప. బజారున పోతూ చక్రవర్తిని

చూశాం. ఏమి లాభం ? స్నేహంచేసి ప్రేమలాభం పొందితేనే గదా ఆనందం. భగవద్విషయం కూడా ఇంతే.

భక్తి రెండు విధాలు. (1) సాధన భక్తి (2) సాధ్య భక్తి. భావము - ప్రేమ సాధ్యాలు. యథార్థం చెప్పాలంటే ఇవి సాధ్యాలా ? జీవునకు సహజంగా హృద్గతాలు. స్వవిషయంలో 'స్వ' స్థానంలోకి గోపాలుడు రావాలి. ఆ 'స్వ' లో ఉన్నది వాస్తవంగా మదనగోపాలుడే. భగవంతుడు - భావం జీవునకు దూరంగా లేవు. అవి అప్రకట స్థితి నుండి ప్రకట స్థితికి రావాలి. ఇందుకే అనుసంధానం కావాలి. ప్రపంచాన్ని, విషయాలను, అహం భావాన్ని, దేహాహంభావాన్ని సంహరించాలి. అప్పుడు భావ - ప్రేమలు ప్రకటమై తీరుతాయి.

సాధనభక్తి రెండువిధాలు. (1) వైధీ. (2) రాగాత్మిక. గోపాలుని యందు అనురాగం లేదు. ఉండి తీరాలని శాస్త్రం చెపుతోంది. కనుక బలవంతంగా ఆ విధుల నాచరించటాన్ని 'వైధీభక్తి' అంటారు. స్వాభావికమైన సతృష్ణ ప్రేమను 'రాగాత్మికాభక్తి' అంటారు.

రాగాత్మికా భక్తికి రెండవయవాలు. (1) కామరూప (2) సంబంధరూప. కామం ప్రేమగా మారితే, సమస్తవ్యవహారాలు గోపాలునకు వస్తుస్థితిలో సమర్పణం చేయబడితే ఆ స్థితిని 'కామరూపా' లేక 'గోపికాభక్తి' అంటారు. ఇదే విశేషమాధుర్యాన్ని సంతరించు కొంటే ప్రేమికుని కనుల ముందు ఆలీలాదృశ్యాన్ని అద్భుతంగా ఆవిష్కరిస్తుంది.

"గోపాలుడు నా పుత్రుడు. నేనాతనికి తల్లిని-తండ్రిని." ఈ చిత్తవృత్తి విశేషాన్ని "సంబంధరూపా రాగాత్మికా భక్తి" అంటారు.

రాగాత్మికాభక్తికి మరిరెండు స్వరూపాలు. (1) కామానుగా. (2) సంబంధానుగా. 'కామానుగ' లో కామరూపా రాగాత్మికా భక్తిలో వలెనే గోపాలుని యందు తృష్ణ ఉంటుంది. ఇది రెండు విధాలు. (1) సంభోగేచ్ఛామయి= ఇందులో కేళి సంబంధమైన అభిలాష ఉంటుంది. (2)"యూథేశ్వరీ వ్రజదేవీ భావాన్ని, ఆ మాధుర్యాన్ని పొందాలి." ఈ లాలసను "తత్తద్భావేచ్ఛామయి" అంటారు.

శ్రీవిగ్రహ సందర్శనం, నామజపం, గుణగానం అంతర్గత వాసనను జాగృతం చేయాలి. వాస్తవంగా అట్టి జాగృతిని పొందిన వారు మాత్రమే పైన చెప్పబడిన కామానుగా భక్తికి అధికారులు.

గోపాలునితో ప్రేమ సంబంధాన్ని స్థాపించుకోవాలి, ఆభావ మాధుర్యంతో శ్రీకృష్ణ పరివారంలో సభ్యులం కావాలి. దీన్ని "సంబంధానుగ భక్తి" యని అంటారు.

* * *

# భాగవతరసం - గోపాలురు

శ్లో॥ ఉక్తం పురస్తా దేతత్తే చైద్యః సిద్ధిం యథాగతః,
ద్విషన్నపి హృషీకేశం కిముతాధోక్షజ ప్రియాః॥
(శ్రీమద్భాగవతం, స్కం.10-అ26-శ్లో13)

"శిశుపాలాదులు శత్రుభావంతో భగవాను ననుకరించారు. అయినా భగవద్భావాపన్నులైనారు. ఇక ప్రేమతో భగవద్భజనం చేస్తే ఏమైనా సాక్షాంపవచ్చు, ప్రేమయే కావచ్చు."

శ్లో॥ యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవ
భజామ్యహం।
(భగవద్గీత, అ4-శ్లో11)

"భక్తులు భగవాను నెట్లా భజిస్తారో భగవానుడును భక్తుల నట్లే భజిస్తాడు."

భగవానునితో ప్రేమ సంబంధం కావాలి, భగవానుడు గోపాలుడు కావాలి, మిత్రుడు - పుత్రుడు - భర్త కావాలి. అదే ప్రేమ అందులోనే రసం.

అరిషడ్వర్గాలు బాధిస్తుంటే ప్రేమభావం ఎట్లా దృఢమవుతుంది ? గంట సమయం జపం చేస్తాము, పూజ చేస్తాము, కామక్రోధ్భవ వేగాన్ని నిరోధించ లేం. ఏం చేయాలి ?

ఆ కామక్రోధాదులను భగవన్ముఖంగా ప్రయాణం చేయించాలి, భగవన్ముఖం ఈయాలి. అప్పుడే సుఖం.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్,
కామక్రోధో ద్భవం వేగం సయుక్త స్ససుఖీ నరః॥

 (భగవద్గీత అ 5 - శ్లో 23)

"ఎవడు సుఖవంతుడు? యుక్తవయస్సున కామక్రోధో ద్భవ వేగాన్ని నిరోధించిన వాడు మాత్రమే."



అరిషడ్వర్గాలు మనసు నుండి జన్మిస్తాయి. ఆత్మ ఆ మనసున కావల ఉంది. ఆ యాత్మయే గోపాలకృష్ణ భగవానుడు. మనసును ఆత్మ యందు నియమించాలి. ఆ తరువాత కూడ అరిషడ్వర్గము లుంటాయి. కాని ఆ నియమనం వీని నుండి వచ్చు బాధను నివృత్తి చేస్తుంది. ఈ శత్రువులు మిత్రులవుతాయి, జీవన చాలనార్థం ఉపయోగానికి వస్తాయి. ఆ తరువాత సమస్త సద్గుణాలు సాధకునిలో ప్రకాశిస్తాయి.

శ్లో॥ శనై శ్శనై రుపరమేద్ బుద్ధ్యాధృతి గృహీత యా,
ఆత్మ సంస్థం మనః కృత్వా నకించి దపి చింతయేత్॥

 (భగవద్గీత అ 6 - శ్లో 25)

"మెల్ల మెల్లగా బుద్ధి సహాయంతో—సద సద్వివేచనా శక్తితో మనసును ఆత్మయందు నియమించాలి. ఆ నియమన సమయంలో మనసు శుద్ధంగా ఉండాలి. అందువలన ఇతరము నెంత మాత్రం చింతించరాదు."

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్ప
రాయణః॥
(భగవద్గీత అ 9 - శ్లో 34)

"అర్జునా ! నీ మనసును నా యందు లగ్నను చేయి, ధ్యానివి కా ! నా భక్తుడవు కా ! నన్ను పూజించు. నాకు యజ్ఞము చేయి. నాకు నమస్కరించు. నన్ను సేవించు. సర్వథా శరణాగతుడవు కా ? నా వాడవై జీవించు."

సమస్తేంద్రియాలు మనసున కధీనాలు. మనసు వశమైనదా సమస్తేంద్రియాలు వశమైనట్లే. ఏకాదశేంద్రియ వ్యాపారాలు ఆత్మయందు లయించాలి. ఇదే సమాధి. ఇందే సుఖం.

ధర్మ ప్రభువు ఒకొక్క ఇంద్రియానికి ఒకొక్క ధర్మాన్ని విధించి, సాక్షిమాత్రుడై ఉన్నాడు. నేత్రాలకు చూడటం, చెవులకు వినటం, జిహ్వకు రుచి చూడటం ఇత్యాది ధర్మాలు. ఈ ధర్మాలు లేక జీవితమే లేదు. అయితే మానవునకు ఇంకో పరమధర్మముంది. ఏమిటది ? ఆ ధర్మ ప్రభువునకు కృతజ్ఞతలు చెప్పటం. ఎట్లా చెప్పాలి? ఈ సమస్త ఇంద్రియ ధర్మాలను ధర్మ ప్రభువునకు నివేదించాలి. ఆ ధర్మ ప్రభువు లేక ఈ ఇంద్రియాలకు వ్యాపారాలే లేవు. "సర్వస్య చాహం హృది సంనివిష్టోమత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ."
(భగవద్గీత అ 15 - శ్లో 15)

ఇంద్రియాలున్నాయి, వాని ముందు విషయాలున్నాయి. గోపాలుడెక్కడ ఉన్నాడు ? ఈ ఇంద్రియ ధర్మాలే తానై ఉన్నాడు. ప్రపంచం – గోపాలుడు. మనసునందు రెండుండ లేవు. ఒక్కదానికే స్థానం. నేత్రాలున్నాయి, అవి చూడకుండ ఉండలేవు. చూడటమే వానికి జీవనం. ఇట్లే ఇతరేంద్రియాలను, వాని వ్యాపారాలను అర్థం చేసికోవాలి. ఆ ఇంద్రియ వ్యాపారాలందు ధర్మప్రభువు ఉండనే ఉన్నాడు. కానీ ఆ ధర్మప్రభువు గోపాలునిలో మన ప్రేమభావం ప్రాణమై, ప్రాణాప్రాణమై ప్రవేశించాలి.

నేత్రం ప్రయాణం చేసే స్థానస్థానంలో గోపాలుడు సాక్షాత్కరించాలి. జగాన్ని జగన్మోహనునిగా చూడాలి. అప్పుడే లోనున్న గోపాలుడు సాక్షాత్కరిస్తాడు.

శ్లో॥ యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి ॥
(భగవద్గీత అ 6 – శ్లో 30)

"అర్జునా ! నేను సమస్త జీవుల కాత్మను. కాన వాసుదేవుడను. ఎవడు సమస్త భూతాలలో నన్ను, నాలో సమస్త భూతాలను చూస్తాడో వానికి నేనదృశ్యుడనుగా ఉండలేను."

ఈ సమస్త ప్రపంచం – జీవులు – వారి సుఖాలు గోపాలుడే.

ఈ జీవుల్ని ప్రేమించాలి, సేవించాలి. అప్పుడే ప
గోపాలుని ప్రేమింప గలుగుతాం. గోపాలుడు మ
ప్రేమింప గలుగుతాడు.

మేఘాల శ్యామవర్ణాన్ని, చంద్రుడి ధవళహాస
చూచినప్పుడు శ్యామగోపాలుని శ్యామవర్ణం, మధురహ
స్మృతిలోకి రావాలి. ఏ శబ్దం విన్నా మురళీ నాద
ఏ రూపం చూచినా త్రివక్రమోహనాకారంగా అను
రావాలి. అదే భక్తి.

శ్లో॥ బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి నకాంక్ష
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పర
(భగవద్గీత అ 18 – శ్లో

"బ్రహ్మను పొందిన జ్ఞాని ప్రసన్నుడుగా ఉంట
అందువల్ల దేనికి చింతించడు, దేనినీ కాంక్షించడు. ఈ
తీతత్వం వల్ల సమస్త భూతాలలో ఆత్మను, పరమా
చూస్తాడు. అట్టివాడే జ్ఞానానికి పరాకాష్ఠ స్వరూపమైన
భక్తిని పొందగలుగుతాడు."

అయితే బ్రహ్మజ్ఞానికి కూడా ఈ పరాభక్తి
దగిందన్నమాట ? జ్ఞానులందరు పరాభక్తిని పొంద
భగవత్కృపాపాత్రులే పొందగలుగుతారు.

"భగతి హి గ్యాన హి నహి కఛు భేదా
ఉభయహరహి భవసంభవ ఖేదా"
(శ్రీరామచరితమానసం – ఉత్తర

ఈ జీవుల్ని ప్రేమించాలి, సేవించాలి. అప్పుడే మన
గోపాలుని ప్రేమింప గలుగుతాం. గోపాలుడు మనల్ని
ప్రేమింప గలుగుతాడు.

మేఘాల శ్యామవర్ణాన్ని, చంద్రుడి ధవళహాసాన్ని
చూచినప్పుడు శ్యామగోపాలుని శ్యామవర్ణం, మధురహాస
స్మృతిలోకి రావాలి. ఏ శబ్దం విన్నా మురళీనాదంగా
ఏ రూపం చూచినా త్రివక్రమోహనాకారంగా అనుభవ
రావాలి. అదే భక్తి.

శ్లో॥ బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి నకాంక్షతి,
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం
(భగవద్గీత అ 18 - శ్లో 5

"బ్రహ్మను పొందిన జ్ఞాని ప్రసన్నుడుగా ఉంటాడు
అందువల్ల దేనికి చింతించడు, దేనినీ కాంక్షించడు. ఈ గుణ
తీతత్వం వల్ల సమస్త భూతాలలో ఆత్మను, పరమాత్మ
చూస్తాడు. అట్టివాడే జ్ఞానానికి పరాకాష్ఠ స్వరూపమైన ప
భక్తిని పొందగలుగుతాడు."

అయితే బ్రహ్మజ్ఞానికి కూడా ఈ పరాభక్తి పొం
దగిందన్నమాట ? జ్ఞానులందరు పరాభక్తిని పొందలే
భగవత్కృపాపాత్రులే పొందగలుగుతారు.

"భగతి హి గ్యాన హి నహి కఛు భేదా
ఉభయహరహి భవసంభవఖేదా"
(శ్రీరామచరితమానసం - ఉత్తరకాం

"భక్తికి - జ్ఞానానికి ఏమీ భేదంలేదు. రెండు భవ సంభవ ఖేదాల్ని హరిం చేవే."

జ్ఞానం అజ్ఞానాన్ని ధ్వంసం చేసి అదృశ్యమవుతుంది. భక్తి అట్టిది కాదు. భగవదీతిని ప్రసాదిస్తుంది, భగవద్భావాన్ని, బ్రహ్మ సంస్థితిని ప్రసాదిస్తుంది.

"నిర్గుణరూప సులభ అతి సుగుణజాన్ నహి కోయీ।
సుగమ అగమనానాచరిత సునిముని మనభ్రిమ
హోయి॥

(శ్రీరామచరితమానసం–ఉత్తర కాండ)

నిర్గుణరూపాన్ని అర్థంచేసికొనటం సులభం. ఈ గుణాతీత దివ్య సగుణ రూపాన్నిమాత్రం ఎవరూ అర్థం చేసికోలేరు. సగుణ భగవానుని చరిత్రలు సుగమాలు మరియు అగమాలు. మునులు మనస్సులనే మోహింపచేసే శక్తికలవి."

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి
తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥
(భగవద్గీత, అ 18_శ్లో 55)

"పరాభక్తి ఒక్కటి మాత్రమే యథార్థ స్వరూప జ్ఞానాన్ని కలిగిస్తుంది. దేవు డెవడు? ఎట్లా ఉంటాడు? ఎట్టి రూపంతో ఉంటాడు? ఈ జ్ఞానాన్ని అంకురింపచేసేది పరాభక్తి. ఇంతేనా? అనుభవాన్ని కూడ కలుగచేస్తుంది."

మూలాధారమైన 'భగవద్భావం' సమస్త వృత్తుల లోకి రావాలి. సమస్త వ్యాపారాలు భగవన్మ్ముఖంగా ప్రయాణం చేయాలి. అప్పుడు మాత్రమే ఆత్మస్వరూపుడు - రసస్వరూపుడు రాసవిహారి ఈ ఇంద్రియాలలో ప్రేమరసమై ప్రవహింపగలుగుతాడు.

శ్లో॥ అన్యాభిలాషితా శూన్యం జ్ఞానకర్మా ద్యనావృతాం,
అనుకూల్యేన కృష్ణాను శీలనం భక్తిరుత్తమా॥

(భక్తిరసామృతసింధువు)

ఏది ఉత్తమభక్తి ? అన్యాభిలాషా రహితమైనది, జ్ఞాన కర్మలచే ఆవరింపబడనిది, అనుకూల కృష్ణానుశీలన ప్రధానమైనది మాత్రమే.

సుందర రూప మొకటి కావాలి. అది మన వృత్తుల్ని, వ్యాపారాల్ని, మనల్ని సంగ్రహించి, భరించునదై ఉండాలి, రసామృతసింధువులో మనల్ని ప్రవహింపచేయునదై ఉండాలి.

మనసును సుందర రూపమందు నిరంతరం నియమించాలి. లేకపోతే వృత్తులు మనల్ని బాధించి తీరుతాయి. అంతతః ఇంద్రియాలు శ్యామరసానికి దూరమై, అన్నరసంలో క్షుద్రమవుతాయి. "ఏమేమో చేయాలనుకొంటాము, ఏమీ చేయలేము." ఇందుకు కారణం మనసు రూపమందు నియమింపక పోవటమే.

ప్రేమికుని కర్తవ్యాలు : (1) శ్రీ విగ్రహసేవ, (2) సదా నామజపం. (3) సజాతీయ వాసనా విశిష్ట సత్సాంగత్యం. (4) శ్రీధామనివాసం. (శ్రీ చైతన్యమహాప్రభువు.)

ప్రపంచంలో నామరూపాసక్తి నశించాలంటే గోపాలుని నామరూపాలందు ఆసక్తి జన్మించాలి. ఒకటేమాట! ఆసక్తిని ఆసక్తితోనే నాశనం చేయాలి.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం॥
(భగవద్గీత, అ9-శ్లో27)

"ఏమి చేసినా, తిన్నా, ఏమి హవనం చేసినా, దానం చేసినా, సమస్తాన్ని గోపాలున కర్పించాలి."

గోపాలుడు అంటే ఆతని నామరూపాలు ఈ అన్నింటిలోకి ప్రవేశించాలి, ప్రవహించాలి.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయాలు గోపాల ప్రవేశంతో శ్యామరసం అయినాయా, శరీరం కూడా ఆ ప్రేమభావాలనే ప్రదర్శిస్తుంది. సమస్తచేష్టలు అఖండ ప్రేమ రస స్రావకము లవుతాయి. విషయాలు దివ్యా లవుతాయి, ఇంద్రియాలు చిన్మయపాత్ర లవుతాయి, ఇంద్రియాధిష్ఠాతృ దేవతలు శ్యామరసాస్వాదనకు పరుగుతీస్తారు.

ఇంద్రియాలకు లౌకిక వ్యాపారాలు సహజాలు. ప్రేమ వ్యాపారాలు అంత సహజాలు, వ్యసనాలు కావాలి. అదే భక్తి. అందులోనే రసాస్వాదన.

శ్లో॥ ఏషాంతు భాగ్యమహిమాచ్యుత తావదాస్తా-
మేకాదశైవహి వయం బత భూరి భాగాః।
ఏతద్ధృషీక చషకై రసకృత్ పిబామః
శర్వా దయోంఘ్ర్యు మజమధ్వ మృతాసవం తే॥
(శ్రీమద్భా. స్కం.10-అ14-శ్లో33)

"ఇంద్రియాలు పదునొకండు. వానికి ఒక్కొక్క దేవత నాయకుడు. ఆ అధిదేవత తన ఒక్క ఇంద్రియపాత్రను మాత్రమే చేబూని రసాస్వాదనకు పరుగుతీస్తున్నాడు. కాని వ్రజవాసులో? పదునొకండు ఇంద్రియపాత్రలతో శ్యామ రసాస్వాదన చేస్తున్నారు. ఎంత ధన్యులు!" బ్రహ్మ ప్రశంసా పాత్రులు వ్రజబాలురు నిస్సంశయంగా ధన్యులే.

మదన గోపాలుని కవి వత్సరూపాలు. గోమాతలు వత్సలను నిరంతరం విశుద్ధలాలసతో నాకుతూ ఉండేవి. వానిది నిరావరణ సంగం. సాక్షాత్ అఖండ మధుర రస ప్రవాహం అక్కడ సావయవ మయింది, తన సహజ సుందర మధుర రూపాన్ని అద్భుతంగా సాక్షాత్కరింప చేసింది. ఆ వత్సలకు శరీరాలపై వస్త్రాభరణా లుంటాయా? కేకి పింఛం ఉంటుందా? వైజయంతీ మాల ఉంటుందా? వేణు వుంటుందా? ఒకటేమాట! చిన్మయ రూపాన్ని నాకటమే నాకటం. ఆహా! ఏమి భాగ్యం! ఈ వత్సల నుండి ప్రవహించిందే వాత్సల్యరసం.

శ్లో॥ సౌమీడ్య తేఽభ్రవపుషే తడి దంబరాయ
గుంజావతంస పరిపింఛలసన్ముఖాయ,
వన్యస్రజే కవళవేత్ర విషాణవేణు -
లక్ష్మ శ్రియే మృదుపదే పశుపాంగజాయ॥
(శ్రీమద్భా. స్కం 10 -అ 14 - శ్లో 1)

ఇది బ్రహ్మ స్తుతి. చతుర్వేదాలు చతుర్ముఖాలు. బ్రహ్మకు, శ్రుతులకు మదనగోపాలుని యందు రతి. ప్రీతికి పరాకాష్ఠ. శ్యామల వర్ణం - కోమల శరీరం - లలిత హాసం- గోపాలరూపం - మలయజ పరిమళం - దానిపై విద్యుత్ విహాసనం - దివ్యాభరణాల రూపంలో రసిక మహానుభావుల ఖేలనం. ఆ గొల్లపిల్లల దేమి భాగ్యం ! ఏమి భాగ్యం !! గోపాలునితో రతి, ఆ రసిక మహానుభావులతో రతి. ఎంత శాంతి ! పీతాంబరం - వైజయంతీమాల - మకరాకృతి కుండలాలు ! - శిరముపై కేకిపింఛం - మృదుహస్తంలో దధ్యన్న కబళం - చంక యందు బెత్తం - నడుమున నవరసనిధి వేణువు- కమల సమాన కోమల శ్రీచరణాలు. అబ్బబ్బ ! మా గోపాడెంత సౌందర్య సార సర్వస్వం ! ప్రత్యంగం రసవాహిని. వాస్తవంగా రసవాహిని.

రండి ? దర్శించండి !! అనుభవించండి !!!

గోపాలుడు - రసిక మహాపురుషులు - వ్రజ బాలురు. వీరు అఖండ రసప్రవాహాలు. ఆ వ్రజబాలురకు శ్యామునితో

పాటుగా పింఛ రూపాన్ని పొందిన రసికునితో, కుండల రూపాన్ని పొందిన రసికునితో, వైజయంతీ, వేణు, పీతాంబరాలతో రతి. ఆహా! ఎంత పరాకాష్ఠ రసాస్వాదన. నిర్వేదం! ఆ వైజయంతీమాలలో మనమొక కుసుమం అయివుంటే ఆ సంగంలో శ్యామగోపాలుడు - ఆ వ్రజబాలురు ఎంత సంతసించేవారో ! విహ్వాలత ! ఏనాటికైన మనం ఈ అదృష్టాన్ని సంపాదించి తీరవలసిందే. సంపాదించలేకపోతే మనం ప్రేమికులం కానేకాము.

శ్లో॥ ఏషాం బ్రాహ్మీస్థితిః పార్థనైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వా స్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి"
(భగవద్గీత అ 2 - శ్లో 72)

జ్ఞానం బ్రహ్మప్రకాశకం కాదు, కేవలం మోహనాశకం, దుఃఖనాశకం. బ్రహ్మ స్వయంగానే ప్రకాశిస్తాడు. బ్రహ్మ సంస్థితియే 'బ్రాహ్మీస్థితి.' ఇది భగవద్రతి, జీవుని సహజస్థితి.

భక్తి ఈ 'బ్రహ్మ సంస్థితి'ని ప్రసాదిస్తుంది.

శ్లో॥ క్వచిత్ పల్లవ తల్పేషు నియుద్ధ శ్రమ కర్శితః,
వృక్షమూలాశ్రయః శేతే గోపోత్సంగోప బర్హణః॥
(శ్రీమద్భా. స్కం 10-అ 15-శ్లో 16)

గోపాలుడు-వ్రజబాలురు. వీరిలో ప్రతిదినం ఉచ్ఛిష్ట భోజనం, సరస వార్తాలాపం - చక్కగా శరీరమర్దన, కుస్తీ

క్రీడలు, గాఢాలింగనం, కంపనం, ఆయాసం, అనంతరం సఘన వృక్షచ్ఛాయ యందు గోపబాలుని ఒడిలో వేణుగోపాలుని విశ్రామం. అబ్బ! ఒకటేమిటి! రస ప్రవాహమే ప్రవాహం!

శ్లో॥ అహో భాగ్య మహో భాగ్యం నందగోప వ్రజౌకసాం,
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్॥
(శ్రీమద్భా. స్కం 10 – అ 14 – శ్లో 32)

ఏమి భాగ్యమేమి భాగ్యం! ఆ వ్రజబాలుర దేమి భాగ్యం!! సనాతన పరమానంద పూర్ణబ్రహ్మ వారికి మిత్రుడు. అయితే వారి శరీరమే భాగ్యలక్ష్మి. హృదయమే ప్రేమరసం.

శ్లో॥ యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయం,
యోఽస్మాత్పర స్మాచ్చపర స్తం ప్రపద్యే స్వయంభువమ్
(శ్రీమద్భా, స్కం. 8 – అ 3 – శ్లో 3)

ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై
ఎవ్వని యందు డిందు బరమేశ్వరు డెవ్వడు మూల కారణం
బెవ్వడనాది మధ్యలయు డెవ్వడు సర్వము దాన యైన
వాడెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

(శ్రీమదాంధ్ర మహాభాగవతం–గజేంద్రమోక్షం)

"యతోవా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ తద్ బ్రహ్మేతి."

(తైత్తిరీయోపనిషద్

జగాలు జన్మించి ఎవనియందు నిలిచి ఉన్నాయి వీనికి మూలకారణ మెవడు? అనాదిమధ్యలయు డెవడు సర్వము తానయైన వాడెవడు? సర్వము నంటుండి, సర్వమును తన యందుంచుకొని, సర్వమును ప్రవర్తింప చేస్తూ, సర్వా తీతుడుగా ఉన్నవా డెవడు?

మన మదనగోపాలుడే.

శ్లో॥ అజానతాం త్వత్పదవీ మనాత్మ -
న్యాత్మాత్మనా భాసి వితత్య మాయామ్,
సృష్టా వివాహం జగతో విధాన
ఇవ త్వమే షోఽన్త ఇవ త్రినేత్రః ॥

(శ్రీమద్భా. స్కం 10 - అ 14 - శ్లో 19)

"గోపాలా! నీవే సృష్టి స్థితి లయకర్తవు; బ్రహ్మ విష్ణు, మహేశ్వర స్వరూపుడవు, సమస్త జగాలు నీకు శరీరం, సమస్త జీవులు నీ శరీరావయవాలు. సమస్తానికి నీవే ఆధారం, మూల బీజం, ఉత్పత్తి స్థానం. ఈ విషయం ఎవరికి తెలుస్తుంది?"

శ్లో॥ ఆత్మాన మేవాత్మ తయాఽవిజానతాం
తేనైవ జాతం నిఖిలం ప్రపంచితమ్,
జ్ఞానేన భూయోఽపిచ తత్ప్రలీయతే
రజ్జ్వా మహేర్భోగ భవా భవౌ యథా॥
(శ్రీమద్భా. స్కం.10-అ14-శ్లో25)

సర్వభూతాత్మయే గోపాలుడు, గోపాలుడే సర్వ భూతాత్మ. సర్వభూతాల కాధారమూర్తిని, ఆనంద దాయక మూర్తిని 'కృష్ణు' డంటారు. ఆతనిలో నుండియే సమస్త భూతాలు బ్రహ్మాండాలు ప్రకటమైనాయి. ఇదేమిమాట? గోపాలుడే సమస్త భూతాలు – సమస్త బ్రహ్మాండాలు.

శ్లో॥ వదంతి తత్ తత్త్వవిద స్తత్త్వం యజ్ఞానమద్వయమ్,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే॥
(శ్రీమద్భా. స్కం.1-అ2-శ్లో11)

ఎవడు జ్ఞానులకు బ్రహ్మయో ఆతడే యోగులకు పరమాత్మ భక్తులకు భగవానుడు.

ఆతడే ప్రేమీభక్తులకు గోపాలుడు – వేణుగోపాలుడు – మదనగోపాలుడు.

"గోపాలా! గోపాలా!! గోపాలా!!!"

  

# గోపికలు - త్యాగం

శ్లో॥ దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వ ముచితజ్ఞతా,
అభ్యాసేన నలభ్యంతే చత్వార స్సహజాగుణాః॥

(1) దానబుద్ధి, (2) మధురభాషణం, (3) సుఖ దుఃఖములందు ధైర్యం, (4) కర్తవ్యాకర్తవ్య జ్ఞానం. ఈ నాలుగు పురుష ప్రియత్నంతో సాధింపదగ్గవి కానేకావు, జన్మసహజ ప్రవృత్తులు.

* * *

ఆర్గురు బిడ్డల్ని వసుదేవుడు చేచేతులా కంసుని ఖడ్గానికి కానుక చేశాడు. షడైశ్వర్య సంపన్నుడైన భగవానుని పుత్రునిగా పొంది కూడా ఆతనిని నంద యశోదలకు త్యాగం చేసి విరహాదుఃఖం అనుభవించాడు. త్యాగం! రెండే రెండక్షరాలు. ఎంత గొప్పవి! ఎంత ఉన్నతమైనవి!!

* * *

ఉద్ధవుడు :

శ్లో॥ ఆసామహో చరణరేణు జుషా మహం స్యామ్
బృందావనే కిమపి గుల్మ లతౌషధీనాం,
యాదుస్త్యజం స్వజనమార్య పథంచ హిత్వా
భేజుర్ముకుంద పదవీం శ్రుతిభిర్విమృగ్యామ్॥
(శ్రీమద్భా. స్కం. 10-అ47-శ్లో61)

"స్వజనుల్ని, ఆర్యధర్మ పథాన్ని త్యజించగలగటం చాలా కష్టం. గోపికలు అట్టి వానిని కూడా త్యజించేశారు. కానసే వారి చరణరజాన్ని ఈ బృందావనం చాలా ప్రేమగా స్వీకరిస్తోంది. ఆ ముకుంద ప్రేమమార్గంలో నడువాలని శ్రుతులు ఎంతకాలం నుండో తపిస్తున్నాయి. కానీ వానికా ప్రేమ మార్గం కనబడనే కనబడలేదు. ఓహో! గోపికలు ఎంత ధన్యులు! అట్టి గోపికా చరణరజం ప్రాప్తిస్తే చాలు జన్మ ధన్యమై తీరుతుంది. అయితే బృందావనంలో లతైనా కావాలి, గుల్మమైనా కావాలి, ఓషధైనా కావాలి."

ఉద్ధవుడు ప్రేమోన్మత్తుడు కావటానికి అదొక్కటే ఉపాయం. ఎవరికైనాసరే అదొక్కటే ఉపాయం.

ఎప్పుడో ఏమో కావాలని ఎందుకు బాధపడాలి ? ఇప్పుడు ఎంతో గొప్పశరీరంలో ఉన్నాం. అసమర్థులంకూడా కాదు, కదలండి, బృందావనంలో కాలు పెట్టండి, ఆ రజంతో స్నానం చేయండి, గోపాల నామామృతం పానం చేయండి, సత్సాంగత్యంలో జీవించండి, శ్రీకృష్ణలీలల్ని భుజించండి. చెప్పినట్లు చేశారా మీకు శ్రీకృష్ణ ప్రేమధనం తప్పకదొరుకు తుంది. మరువరాదు, మీరు ప్రేమస్వరూపులై ప్రేమలో దేహత్యాగం చేస్తారు, దివ్యప్రేమస్వరూపులై మధురజీవి తాన్ని పొందుతారు. ఇది ధ్రువ సత్యం.

* * *

హృదయం ఖాళీగా ఉండాలి. నిండి ఉంటే గోపాలుడు ఎట్లా వస్తాడు ? ఎక్కడకు వస్తాడు ?

రిక్తహృదయ మురళి. దాని శరీరమంతటా రంధ్రాలే. పైగా ముఖాన్ని అగ్నిలో కాల్చారు. కాననే గోపాలుని అధరసింహాసనం అధిరోహించ గలిగింది, హస్తాలంకార మయింది. ఎన్ని వ్యాసంగాలైనా ఉండనీ గాక, గోపాలుడు మురళీని మాత్రం వదలలేడు. చివరకు కటివస్త్రంలోనైనా దానికి స్థానమిచ్చి తీరుతాడు. గోపాలుని అంగ సంయోగ భాగ్యాన్ని నిరంతరం పొందే ఈ మురళి నిజంగా ఎంత గొప్పది!

మనంకూడా అట్లే కావాలి. హృదయాన్ని ఖాళీగా ఉంచాలి, శరీరాన్ని ప్రేమాగ్నిలో తపింప చేయాలి, త్యజించటమే గానీ సంగ్రహించటం ఉండకూడదు. గోపాలుని సుఖింపచేయాలి. అందు నిమిత్తం సమస్తాన్ని త్యాగం చేయటంలోనే సుఖం, దుఃఖించటంలోనే సుఖం. ఒకనాటికి గోపాలుని లలితహాసం మనపై ప్రసరిస్తుంది. తప్పక ఆ అధర సింహాసనాలపై పట్టమహిషీస్థానం లభిస్తుంది.

  

త్యాగమంటే సంగ్రహం. ఈనాటి త్యాగప్రవృత్తి రేపటి సుఖం నిమిత్తమే. మూల్య మీయకపోతే సుఖవస్తు వెట్లా లభిస్తుంది? ధనం పోయిందని మూల్యమిచ్చి వస్తువును

కొన్నవాడెవడైన బాధపడుతాడా ? "త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్." త్యాగఫలం పరమశాంతి. అది అప్రాకృత సుఖానికి నిధానం. దాని నిమిత్తం భౌతిక విషయాల్ని, శరీరాన్ని త్యజించి తీరవలసిందే. స్వేచ్ఛగా త్యజించలేకపోతే ఒకనాడవే మనల్ని వీడి పోతాయి. ఈ కళేబరమే శాశ్వతం కాదు, ఇక ఇంద్రియతృప్తి నిమిత్తం చేసే విషయ సంగ్రహం ఎట్లా శాశ్వత మవుతుంది ? ఎట్లా సుఖదాయక మవుతుంది ? ప్రేమరస రాజ్యంలో భౌతిక విషయాలు సుందర చిత్ర మాత్రాలు. మామిడిపండు చిహ్నమున్న కాగితమునుండి రసాస్వాదన మెట్లా సాధ్యమవుతుంది ?

త్యాగ మంటే సత్త్వరజస్తమోగుణాతీత చిత్తవృత్తి. ఎవని చిత్తం త్రిగుణాక్రాంతమో, విషయ విషవాయు పూర్ణమో అచట త్యాగప్రవృత్తి అసంభవం. ఎదుటి వ్యక్తి దుఃఖంలో దుఃఖం, సుఖంలో సుఖం, ఎదుటి వ్యక్తి సుఖ నిమిత్తమై దుఃఖంలో సుఖం అనుభవించాలి. ఎంత అప్రాకృత స్థితి ! ఆ ఎదుటివ్యక్తిలో ఉన్న 'నేను' మనలో ఉన్న 'నేను' ఒకటి కాదా ? రెండు 'నేను' లసలు ఉండనే ఉండవే! ఒకే ఒక్క చైతన్యం. అదే 'నేను'. అదే అందరిలోని 'నేను'. అదే విశాల ప్రపంచం. ఇద్దరు వ్యక్తులు లేరు, ఉన్నది ఒక్కడే.

తల్లి సంతానం నిమిత్తం, భార్య భర్త నిమిత్తం సమస్త సుఖాల్ని త్యాగం చేస్తారు. ప్రేమలో త్యాగం చేయ నవసరం లేదు. అనిచ్ఛగానైనా, సహజంగా అవే మనల్ని త్యజించిపోతాయి. 'ఎదుటి వ్యక్తి సుఖించాలి.' ఇది ప్రేమ మహామంత్రం. "అందుకు జీవితాన్ని ఆహుతి చేయాలి." ఇది నియమం.

జారుడు-జారిణి. వీరిలోని మిళనాకాంక్ష అసమానం, అనుపమం, అత్యున్నతం. జారుడు జారిణిని పొందటానికి ఏం చేయడు ? సమస్త సంపదను స్వాహా చేస్తాడు, తల్లిదండ్రులను వధిస్తాడు, చేయరాని పాపాలన్నీ చేస్తాడు, చివరకు శరీరాన్ని కూడా కైంకర్యం చేస్తాడు. కామం ఏమైనా చేయిస్తుంది. అందు త్యాగమే త్యాగం, శరీరత్యాగం చేయటం అందు చాలా స్వల్పవిషయం.

గోపాలుని ప్రేమించటాన్ని మాత్రమే 'ప్రేమ' అనాలి. విషయాసక్తిని 'కామ' మని గానీ, 'మోహ' మని గానీ అనాలి. జీవనాన్ని బలిగొని జీవం పోయలేని ప్రేమ ఏమి ప్రేమ ? జీవితేశ్వరుని కంకితం కాని జీవన మేమి జీవనం ? ఎవరు మధుర జీవనులు ? గోపికలే.

జ్ఞానం ఉన్న వస్తువును ప్రకాశింపచేస్తుంది, అంధకారాన్ని తొలగిస్తుంది. ప్రేమ వస్తువునే మార్పు చేస్తుంది; సమస్తేంద్రియాలకు నూతనత్వాన్నిస్తుంది, క్రొత్త జీవితాన్ని స్తుంది, అఖండంగా రసాన్ని ప్రవహింపచేస్తుంది.

"ఎవరు వారు ?" "ఎవరూ లేరు, నేనే." 'ఏమి చేస్తున్నావు ?' 'భోజనం చేస్తున్నాను.' 'ఎందుకు ?' 'నా కోసం - నా సుఖం కోసం.' "నీ వెవరు ? శరీరమా ? మనసా ?" 'ఏమీకాదు.' 'అయితే ఆ నేనెవరు ?' దేహ బుద్ధి గలవాడైనపుడు 'జీవుడు', దేహేంద్రియ మనః ప్రాణా ద్వ్యతీతుడైనప్పుడు 'ఆత్మ.'

దేహేంద్రియ మనః ప్రాణములు అవిద్యాస్వరూపాలు. పరమశాంతి లేక అమృతం విద్యా స్వరూపం. భక్తి మహా రాణి విద్యావిద్యల కతీత. జీవున కుపాధి అవిద్య, భగవా నున కుపాధి ప్రపంచం. జీవుడు అవిద్యలో శరీరాన్ని త్యజిస్తే అవిద్య కావలసిందే. విద్యలో త్యజిస్తే విద్య కావలసిందే. విద్యయందు అవిద్యను త్యజించటం అంటే అంతా విద్యా స్వరూపమవటమే. ఇంక అవిద్య ఎక్కడిది ?

"స ప్రాణ మసృజత్, ప్రాణ చ్ఛ్రద్ధాం ఖం వాయు ర్జ్యోతి పృథివీంద్రియం మనః అన్న మన్నా ద్వీర్య తపో మంత్రాః కర్మలోకా లోకేషుచ నామచ."

(ప్రశ్నోపనిషత్.)

ఆతడు ప్రాణాన్ని సృజించాడు. ప్రాణమంటే ఏమిటి ? పంచభూతాల సూక్ష్మాంశ. ప్రాణం మీద పదునైదు పొరలు, ప్రాణంతో కూడా కలిపితే ఆత్మమీద పదునారు పొరలేర్పడి నాయి. (1) శ్రద్ధ (2) ఆకాశం. (3) వాయువు. (4) జ్యోతి.

(5) జలం. (6) పృథివి. (7) ఇంద్రియం. (8) మనసు. (9) అన్నం. (10) వీర్యం. (11) తపస్సు. (12) మంత్రం. (13) కర్మ. (14) లోకం. (15) నామం. ఈ పదునారు పొరలు ఆత్మపై ఏర్పడితే ఇంతటి స్థూల శరీరమయింది, సమిష్ఠితో పదునారు కళ లేర్పడితే ఇంతటి ప్రపంచమయింది. 'నేను' ప్రకటం కావాలి. ఎట్లా ? ప్రపంచం నుండి, శరీరం నుండి పదునారు కళల్ని వేరు చేయాలి, త్యాగం చేయాలి, ఆత్మానందం నిమిత్తం ఆత్మలో త్యజించాలి. భౌతిక విష యాల్ని, దేహేంద్రియ మనః ప్రాణాల్ని కూడా త్యజించాలి, ఆవరణ భంగం కావాలి.

ఇంతేనా ? 'నేను' కూడా త్యజింప బడాలి. ఉన్నది. ఒక్కటే నేను. ఆ 'నేను' 'నేను' యందే త్యజింపబడాలి. 'నేను నేనే' ఇది లోకోక్తి. 'నేను గోపాలుడే.' ఇది సూక్తి.

గోపికలు సర్వస్వత్యాగం చేశారు, దేహేంద్రియ మనః ప్రాణాల్ని త్యాగం చేసారు, 'నేను' ను కూడా త్యాగం చేశారు. వారికి తెలియకుండానే అవి వారిని వదలి పోయినాయి.

శ్లో॥ నిశమ్యగీతం తదనంగ వర్ధనం వ్రజస్త్రియః కృష్ణ
గృహీత మానసాః॥
(శ్రీమద్భా. స్కం 10 - అ 29 - శ్లో 4)

ఆ మోహన మురళీ రవళి సమస్తాన్ని దొంగిలించింది, గోపికలను శ్రీకృష్ణగత ప్రాణలను చేసింది.

"నేను నీవాడను." ఇదే భావం, త్రిగుణాతీత స్థితి.

"నీవు నాప్రియుడవు, నేను ప్రేయసిని." ఇది సంబంధం. ఈ ప్రేమ సంబంధమే మధురం. ఇది ఘృతస్నేహం. ఎంతో గొప్పది. ఏల ? ఇచట ప్రేమ ఉంది, కాని 'స్వ' త్వము లేదు, ప్రేయసి లేదు. గోపాలుని దైప్రేయసి గోపాలుని దగ్గఱ ఉంది. 'నేను' లేదు. ఇది నేతివంటి స్నేహం. రతికి పరాకాష్ఠ.

'నీవు నా వాడవు'. ఇది మధుస్నేహం. ఎంతెంతో గొప్పది. ఇప్పుడు అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు గోపాలుడు ప్రియాధీనుడు. ఆ త్యాగం చేయబడిన 'నేను' ఈ గోపాలునితో కలిసి అత్యంత మధురమయింది. ఇది తేనె వంటి స్నేహం. ఘృతం కన్న మధువు గొప్పది కదా ! ఘృతం జంతువునకు సంబంధించింది. ఈ దోషం మధువులో లేదు. పైగా అది సుందరం, రసరూపం.

ఇప్పుడు ఇంద్రియాలు చిన్మయాలు. "గోభిః ఇంద్రియైః భక్తిరసం పిబతి యితి గోపీ." ఇంద్రియపాన పాత్రలతో భక్తి రసాస్వాదన చేయువారే గోపికలు. దీనిలో ఇంద్రియాలకు నూతన రూపం వస్తుంది, నూతన క్రీడనానందం లభిస్తుంది.

శరీరం గోవర్ధనం. ఇది పంచదోషయుక్తం. (1) శరీరాధ్యాసం. (2) ఇంద్రియాధ్యాసం. (3) మానసాధ్యాసం. (4) ప్రాణాధ్యాసం. (5) స్వస్వరూప విస్మృతి. ఇట్టి శరీరాన్ని అంగుళిపై ధరించి, దివ్యం చేసినవాడు గోపాలుడు. దేవేంద్రుడు రజోగుణ స్వరూపుడు. ఆతడు నిర్విరామంగా ముముక్షువులపై విషయవాసనల్ని వర్షిస్తాడు. ఇంద్రియాలు వాసనా వర్షానికి విచలితమై భ్రష్టం కారాదు. ఇదెట్లా ? అంగుళి సత్త్వ గుణ ప్రతీకం. రజస్తమో గుణాలతో యుద్ధం చేయవలసివస్తే సత్త్వగుణంతో స్నేహం చేయాలి. క్రమంగా త్రిగుణాతీత స్థితికి ప్రయాణం చేయాలి. అచట త్రిగుణాతీతుడు గోపాలుడు కృపను వర్షిస్తుంటాడు. ఇంక హర్షమే హర్షం. సప్తధాతువుల శరీరం రసాలయం కావాలంటే కృపావర్షం ఏడు దినాలుండాలి. దేహం మారాలి, విభూతి విస్తరించాలి, జ్ఞానకర్మాద్యనావృతా మధురభక్తికి బీజారోపణం జరుగాలి.

రండి ! ఇక రాసలీలా రసరాజ్యానికి పోదాం.

మార్గమంతా చీమల పంక్తియే. అది గోపికామండలి. ప్రేమ మాధుర్యాని కత్యంత విహ్వాలం. వారి ప్రేమరసం ఇంద్రియ వర్ధకం, భావ వర్ధకం. ప్రేమరసమే వారికి ఇంద్రియాలు. అచట మనోవాక్కాయాలు లేవు, ప్రయాణ మెట్లా? మనసులో విషయాలే లేవు, అయితే ప్రపంచమే లేదు. 'నేను' లేదు, సుఖమెందుకు ? ఎవరికి ? సుఖించే వారు లేరు గదా !

సుఖదుఃఖ పరిభాష జనావళి కేమి తెలుస్తుంది ? గోపికలకు తెలుస్తుంది. వారికి దుఃఖమే దుఃఖం. అందులో ఎంత సుఖం ! గోపాలుని కోఅకై దుఃఖం, ఆ ప్రేమ కోఅకై దుఃఖం, ఆ నామోచ్చారణలో దుఃఖం, చంచల చిత్తంపైన ఆతని చంచలనేత్రాలు ఆడుకోవడంలో దుఃఖం. అరే ! ఏమి మాట ? ఆ రసరాజ్యంలో ఆక్రందన మాత్రమే ఉంది, దుఃఖం లేనేలేదు. ఆ దుఃఖం సమస్త బ్రహ్మానందాన్ని నిస్సంశయంగా హీనం చేస్తుంది. ఒక్కసారి కన్నీరు కారిస్తే చాలు, జీవితమంతా రోదనమే రోదనం. ఒక మాట ! ఇలా ఏడువడానికి ఎంతో అదృష్ట ముండాలి సుమండీ !

హృదయం అఖండ ప్రవాహం. ప్రేమ గగనం నుండి వేయి దిక్కుల, వేయి ముఖాలుగా వేణుగానం లలిత విన్యాసం చేసింది. బహుశా ఆ రసవర్షా సమయంలో మెరుపులు కూడా తమ మనోహర వర్ణాల్ని ప్రదర్శిస్తున్నా ఏమో ! ఆపైన మేఘగర్జన. దాని కారణంగా గోపికలకు అపార వేదన. వారి హృదయం, హృదయస్థ రాగం శరీర సీమోల్లంఘనం చేశాయి, విజృంభించి, వినోదించాయి.

గోపాలుని మూర్తి అదృశ్యంగా ఉంటుంది. ఆ నామ మాధుర్యం, లీలా మాధుర్యం మాత్రం సర్వవ్యాపకంగా ఉంటాయి. నామగానానికి ఎచట చూచినా గోపాలుడే

కనిపిస్తున్నాడు. వేణుగానం, లీలా మాధుర్యం లలిత విహారం చేస్తున్నాయి. చూస్తే గోపాలుడు, చూడకున్నా గోపాలుడు, చూపులలో గోపాలుడు, అంతటా గోపాలుడే గోపాలుడు. "వృక్షే వృక్షే వేణుధారీ పత్రేపత్రే చతుర్భుజః." ప్రతి వృక్షం వేణుగోపాలుడు, ప్రతి ఆకు బాలగోపాలుడు, ప్రతి ఇసుక రేణువు మదనగోపాలుడు. సమస్త వృక్షాలు స్తంభించాయి, యమునా ప్రవాహం ఆగిపోయింది, శిలా ఖండాలు ద్రవించాయి, పశువుల రూపవర్ణం నిరూపింప రాకుంది. అంతటా సాత్త్విక భావాలే. విశుద్ధ సత్త్వం యొక్క విచిత్ర విలాసమే, వ్యభిచారీ భావాల స్వేచ్ఛా విహారమే. గోపాలుడు ప్రియుడు, సమస్త జడ చేతనాత్మక ప్రకృతి ప్రేయసి, గోపికా రూపంలో ఉపభోగ్య. ఎచట చూచినా ప్రవాహమే ప్రవాహం. దౌర్భాగ్యం! చూసే వారే లేరు.

శ్లో॥ గా గోపకై రనువనం నయతో రుదార
వేణుస్వనైః కలపదై స్తనుభృత్సు సఖ్యః,
అస్పందనం గతిమతాం పులక స్తరూణామ్
నిర్యోగ పాశకృతలక్షణయోర్విచిత్రమ్॥
(శ్రీమద్భా. స్కం 10 - అ 21 - శ్లో 19)

గోపాలుని వేణుగానం సమస్త జడచేతనాత్మక ప్రకృతిని సరసం చేసింది, జడాన్ని చేతనం చేసింది, చేతనాన్ని జడం చేసింది.

"రాసలీలా వేణుగానం కూడా ఇట్టిదే." (శ్రీ శ్రీధర స్వామికృత భాగవత భాష్యం.)

త్యాగి నవరంధ్రాల శరీరమే నవరంధ్రాల వేణువు. ఆ హృదయమే మధుర రసవాహిని. గోపాలుని ప్రేమింపని వారి కెక్కడిదీ రసీభావం? ప్రేమకు యోగ్యు డొక్కడే. ఆతడే గోపాలుడు. ప్రేమ పరిపూర్ణతయూ పరాకాష్ఠను చెందున దొక్క స్థానంలోనే. త్రివక్ర మోహనాకారమందు. ఇది అమోఘ సత్యం.

బృందావనం - గోపికలు - సాత్త్విక భావాలు - వ్యభిచార భావాలు, ఎవరు ఎక్కడ ఎట్లున్నది ఎవరికీ తెలియటం లేదు. ఎట్లా తెలుస్తుంది? అచటచటా 'నేను' అనునదే లేదుగదా! అయితే ఇక త్యాగి ఎవరు? త్యాగం చేసేదేమిటి? రెండును లేవు. త్యాగ మచట సహజ ప్రవృత్తి.

"ఆత్మ లేక నేను". ఈ సద్వస్తువుకు పైనున్న పదునారు పొరలను త్యాగం చేయకుండా గోపిక లుండలేరు. "నేను-అహం" భావ హరణమే గోపికా వస్త్రాపహరణలీల. సమర్పణభావయుక్తలు గోపికలు, వానిని హరించే చోరుడు గోపాలుడు. ఆవరణాలు వస్త్రాలు. అవి త్యాగం చేయబడవు, ప్రేమమార్గంలో దొంగిలింపబడుతాయి.

కాత్యాయని గోపాలుని అంతరంగ రసశక్తి. ఆమె కృపాకటాక్షం లేక వస్త్రాపహరణలీల లేదు, అహంభావ నాశం లేదు, రాసలీలలో ప్రవేశం లేదు.

గోపికల ప్రేమ స్వసుఖ నిమిత్తం, బ్రహ్మానందం నిమిత్తంకాదు, ప్రియుని నిమిత్తం అసలే కాదు, ప్రేమ ప్రేమ కొఱకే. గోపాలునకు కూడా ప్రేమ అత్యంతావశ్యకం. అందువలననే శ్రీరాధారాణి కృపార్థియై తపం చేస్తుంటాడు.

గోపాలుడు మన కక్కర్లేదు, ఆ ప్రేమ ఒక్కటి మాత్రం చాలును.

ప్రేమలేక గోపికలు జీవింపలేరు. జీవితేశ్వరుడు మదన గోపాలుడు వారికి హృదయేశ్వరుడే గదా! జీవితేశ్వరుడు లేక జీవించట మెట్లా సంభవం? స్వ సమర్పణం గోపికలకు సహజ వ్యాపారం. అందరకును కావాలి. అలా కానంతవరకు ఇంద్రియాలను పతంగాలు కావించి, ప్రేమాగ్నిలో దగ్ధం కావించ వలసిందే. నయనాలు అవిరామంగా అశ్రుత్యాగం చేయ వలసిందే.

లోకంలో ఏడ్చే వాడెవడు? (1) ఆగొన్నవాడు, (2) ధనార్థి, (3) వ్యాధిపీడితుడు, (4) కాముకుడు. గోపాలుని నిమిత్తం, ప్రాణేశ్వరుని ఆలింగనం నిమిత్తం ఇంత మాత్రంగానైన ఏడవకపోతే రసాస్వాదన మెట్లా సాధ్యము?

గోపాలుడు ప్రియుడైనాడని, జీవుడు గోపికయైనాడని గుర్తింప చేయగలవేవి? సజల నేత్రాలే.

రెండు ప్రపంచాలు : (1) అన్నప్రపంచం, (2) రస ప్రపంచం. అన్నప్రపంచంలో విషయాలవెంట పరుగెత్తి,

పరుగెత్తి సంపూర్ణంగా పరాజితుడైనవాడు మాత్రమే ఇంకో ప్రపంచంలో ప్రవేశించాలని నిరంతరం ఏడవ గలుగుతాడు. కనుల ముందున్న వస్తువు ఆనందదాయకంగా ఉన్నంతవరకు కనులకు దూరంగా ఉన్న వస్తువు అనుభవానికి ఎట్లా వస్తుంది? ఇప్పుడు చెప్పండి, నిమ్నస్థితి నుండి ఉన్నతస్థితిని పొందే ప్రయత్నంలో కన్నీరు కార్చటం సౌభాగ్య విష యమా? దౌర్భాగ్య విషయమా? ఆలోచించండి.

ప్రయత్నించండి. ప్రియా ప్రియతములు శ్రీ రాధా కృష్ణ యుగళానికి ప్రేమ కైంకర్యం చేయటానికి పూజా పుష్పా లవసరాలు. అందుకు మన ప్రతి అశ్రుబిందువు సుందర అరవింద రూపాన్ని పొందితే అద్భుతంగా ఉంటుంది.

శ్లో॥ తస్మాత్ ప్రియతమః స్వాత్మా సర్వేషా మేవ దేహినాం,
తదర్థ మేవ సకలం జగచ్చైత చ్చరాచరం,
కృష్ణ మేన మవేహిత్వమాత్మాన మఖిలాత్మనామ్॥
(శ్రీమద్భా. స్కం.10-అ14-శ్లో54-55)

గోపాలుడు సమస్త భూతాలకు ఆత్మస్వరూపుడు. కాన అత్యంత ప్రియతముడు. సమస్త జడ చేతనాత్మక ప్రకృతి ఆ యాధారంతోనే నిలిచివుంది. దీని నానందింపచేసే రసబీజం కనుకనే ఆ మూర్తిని 'కృష్ణు' డంటారు.

శ్లో॥ కృషిర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః,
తయో రైక్యాత్ పరంబ్రహ్మ కృష్ణ యిత్యభిధీయ తే॥

"కృష్" అంటే ఆధారం, 'ణ' అంటే ఆనందం. ఈ రెండింటి సమైక్య స్వరూపాన్ని 'కృష్ణు' డంటారు.

"గోపాలా! గోపాలా!! గోపాలా!!!"

  

# గోపికలు - రాసలీల

శ్లో. నవలలిత వయస్కౌ నవ్యలావణ్యపుంజౌ,
నవరసచలచిత్తౌ నూతనప్రేమవృత్తౌ,
నవనిధువనలీలా కౌతుకే నాతిలోలౌ,
స్మరనిభృతనికుంజే రాధికాకృష్ణ చంద్రౌ.

నిభృతనికుంజంలోని ప్రేయసీప్రియులు శ్రీరాధాకృష్ణుల్ని మనసారా స్మరిస్తున్నాను. ఎందుకు స్మరించను. వారు నిత్యలీలలో నిత్యకిశోరులు. శ్రీకృష్ణుని వయఃప్రమాణం పదునైదు వర్షాలు, శ్రీరాధారాణి వయఃప్రమాణం పదునాలుగు వర్షాలు. ఇది నిత్యలీలా విషయం. అవతారకాలంలో రాసలీల నాటికి గోపాలునివయసు ఎనిమిది వర్షాలు. వారి అంగశ్రీ అత్యంత లలితం. అది మధురమంజరి. వారు నవలావణ్య పుంజాలు, చంచల మనస్కులు, నూత్నవినూత్న ప్రేమతరంగ తరంగితులు, నిధువనక్రీడనాతురులు. ఆడుకొనే సమయంలో వారి అలంకారం ఎట్లా ఉందో!

శ్లో. ద్రుతకనక సుగౌరస్నిగ్ధ మేఘౌఘనీల
చ్ఛవిభిరఖిల బృందారణ్య ముద్భాసయన్తౌ,
మృదులనవదుకూలే నీలపీతే దధానౌ
స్మరనిభృత నికుంజే రాధికా కృష్ణచంద్రౌ.

శ్రీరాధారాణి తప్త స్వర్ణవర్ణమయి. ఇకచూడండి. నీలాంబరధారిణి. మన మదనగోపాలుడు నీలవర్ణసంశోభితుడు. చూచితీరాలి. ఆ నీలవర్ణంపై మృదుల పీతాంబరం. అబ్బ! ఏమి ఛవి! అది బృందావనభూమి నుజ్వలంచేసే భాగ్యశ్రీ రసశ్రీ- ఉమశ్రీ- బ్రహ్మశ్రీ. ఆప్రేయసీప్రియులు అంతటివారు. అయితే వారిని నేనెందుకు మనసారా స్మరించను!

శ్రీరాధారాణి ఆహ్లాదినీ శక్తి. శ్రీరాధాకృష్ణులు అభిన్నమూర్తులు. శ్రీరాధారాణివలన గోపాలుడు ఆనందిస్తాడు, గోపాలునివలన శ్రీరాధారాణి ఆనదింస్తుంది. ఆనందించాలంటే ఆహ్లాదినీశక్తి కృపఉండితీరాలి. శ్రీరాధారాణి కృపాకటాక్షం లేకపోతే గోపాలుడు ఏలీల చేయలేడు. ముఖ్యంగా రాసలీలకు అంతః బహిఃప్రాణము శ్రీరాధారాణి. ఆమె రాసేశ్వరి, నికుంజేశ్వరి. శ్రీరాధారాణి మధురతమాభివ్యక్తియే ఈగోపికావితతి. శ్రీకృష్ణునకు వీరందరు స్వరూపభూతలు. ఇట్టి శ్రీరాధారాణి ప్రసంగం మాట ఏమిటి, నామం కూడ శ్రీమద్భాగవతంలో లేదు. ఒకటేమాట! మూలబీజం ఎప్పుడూ రహస్యంగానే ఉంటుంది.

ప్రతిపాదితసిద్ధాంతం స్థూలం. అప్రతిపాదితసిద్ధాంతం సూక్ష్మం. స్థూలంలో నుంచి సూక్ష్మాన్ని గ్రహించటం మేధావుల లక్షణం. ఉపాసనాశక్తి లేకపోతే ఇది సాధ్యం కాదు.

శ్లో॥ అనయాఽఽరాధితో నూనం భగవాన్ హరిరీశ్వరః,
యన్నో విహాయ గోవిందః ప్రీతో యామనయద్రహః॥
(శ్రీమద్భా. స్కం.10-అ30-శ్లో28)

రాసలీలలో భగవాన్ మదనగోపాలుడు అకస్మాత్ గా అంతర్హితు డయ్యాడు. అప్పుడు శ్రీరాధారాణి భాగ్యాన్ని గోపిక లిట్లా ప్రశంసిస్తున్నారు :-

"నిశ్చయంగా ఈమెయే శ్రీహరి నారాధించింది. ఆమె ప్రేమప్రభావం వల్లనే భగవాన్ ఈశ్వరుడు శ్రీహరి మనల నందర్నీ వదలి ఆమెతో ఏకాంతానికి పోయాడు."

శ్రీ రాధారాణి నిరస్త సామ్యాతిశయ, అనన్యారాధిక. ఆరాధనా చిత్తవృత్తి యొక్క ధారావిశేషాన్ని 'రాధ' అంటారు. 'రాధ' అంటే 'రసధార.'

ఈ విధంగా శ్రీరాధానామం గుప్తంగా సూచించబడింది. ఆమె రూపం గుప్తంగదా మరి!

"భాగవతం - రసం," ఇవి రెండు పేర్లు. కాని రూప మొక్కటే. ఆ రూపమే శ్రీ రాధారాణి, అద్భుత మధుర రసవాహిని.

శ్లో॥ ఆత్మాతు రాధికాతస్య తయైవ రమణాదసౌ,
ఆత్మారామ యితి ప్రోక్తో మునిభిర్గూఢవాదిభిః॥
(స్కంద పురాణం)

"శ్రీరాధారాణి శ్రీకృష్ణున కాత్మస్వరూపం. రాధి కతో సదా రమిస్తాడు కనుక శ్రీకృష్ణుణ్ణి 'ఆత్మారాము' డంటున్నారు."

శ్రీ రాధాకృష్ణుల భావరాజ్యం అత్యుజ్జ్వలంగా ఉంటుంది. అచట నిత్యం ప్రియాప్రియతముల అచింత్య అమల మధురతమ లీల జరుగుతుంటుంది. శ్రీకృష్ణుని పద నఖజ్యోతి అక్షరకూటస్థబ్రహ్మ. బ్రహ్మ కాతడే ఆధారం. అట్టి గోపాలుడు విహరించే భావరాజ్యం అది. మహాన్ మధుర రససాగరం సహజంగా శాంత గంభీరమై ఉండి గూడా అచట విజృంభించి, వినోదిస్తుంటుంది. అచటి మనో హారిణీ వివిధ భావలహరులు మన మదనగోపాలుడే. ఆ భావ రాజ్యంలో జ్ఞానవిజ్ఞానాలకు అధికారం లేదు. అవి రహస్యంగా దాగి ఉండి ప్రియా ప్రియతముల లీలల్ని నిరీక్షి స్తుంటాయి. జ్ఞానీ విజ్ఞానీ యోగిజనాలు రసరాజు కృపా విశేషంతో భావరాజ్యంలో ప్రవేశించారా రసవర్ణాల్ని గాంచి నిశ్చేష్టు లవుతారు. జ్ఞాన విజ్ఞానాల కధిష్ఠాత్రు దేవతలు కూడా పాపం! ఎన్నడూ ఇట్టి లీలల్ని చూసియుండరు. సౌభాగ్యం! వారు కూడా పరమ జ్ఞానీ విజ్ఞానీ యోగి జనాల ఆధారంతోనే లీలాదర్శనం, రసాస్వాదనం అతికష్టం మీద చేయగలుగుతారు, అయినా తృప్తులు కాలేరు. ఎటు వంటి దా లీల? చిన్మయం. నిరంతరం కేవలానంద సుధా

రసాన్ని ప్రవహింప చేస్తూంటుంది. జ్ఞానం చింతపండు వంటిది. దానికి ఈ లీలారసంలో ప్రవేశం అసంభవం. అఖండ అప్రాకృత రసధారలో దానికి స్థానం లేదు. ("జ్ఞానకర్మాద్యనావృతం" - భక్తిరసామృత సింధువు. అప్రాకృత రాసలీల అనంతానంత మధుర తరంగాత్మిక. ఒక్కటే రసం. అదే మధురం. అది సర్వరసాలకు ఏకైక జన్మస్థానం. భగవానుడు నిరతిశయ రస విగ్రహుడు. అతడే మహాభావ పరినిష్ఠితుడై ఈ రసరూపంలో ప్రవహించాడు. దేవతలు, అసురులు, కిన్నరులు, ఋషులు, మహాతపస్వులు, సిద్ధులు ఈ రస రాజ్యంలో ప్రవేశించాలని నిరంతరం తపిస్తారు. కానీ ప్రవేశం మాటేమిటి చూడను కూడ చూడలేరు, మనసును తన్మయం కావించి, స్మరించనైన స్మరించలేరు. అందువల్ల వారికి సర్వోత్కృష్ట విషయం హాస్యాస్పదంగా ఉంటుంది. రస రాజ్యంలో చెలియలు, సహచారిణులు, మంజరీమూర్తులు అని త్రివిధ శ్రేణులు. వారి లీలా విశేషాల స్మరణం, సేవ, అతిశయ మధుర భావ విలాసం లేకపోతే ఎవరైనా సరే రసరాజ్యంలో ప్రవేశించలేరు, ఆ విషయాన్ని విశ్వసించటానికి కూడ చాలరు.

రాధాకృష్ణుల చరణ యుగళ మందు రతి ఉండాలి. ఆ రూపామృతానికి తను - మన - ధన - జీవనాల్ని కైంకర్యం చేయాలి, నిరంతరం ఆ రసాస్వాదనార్థం మధుర భావనలలో,

విహ్వలతలో ప్రాణధారణ చేయాలి. అట్టివారే ఆ సేవికా గణం యొక్క కృపాలేశానికి పాత్రులు కాగలుగుతారు. లేదా ఏ ఇతర రసిక మహానుభావుని కృపకైనా పాత్రులు కాగలుగుతారు.

తన్మయతతో లీలా చింతనం చేస్తే తప్పక ప్రేమి కులమై తీరుతాము. ప్రాకృతులం అప్రాకృతుల మవుతాము. ఆ లీలలు సమస్త భౌతికవాసనల నుండి జీవుని మరల్చి, దివ్య రసరాజ్యానికి ఆహ్వానించి తీరుతాయి, నిత్య భగవత్సంస్పర్శ నందించి తీరుతాయి.

చూశారా ? గోపాలుని లీలావిలాసం వల్ల బ్రహ్మాం డాలన్నీ విలాసినీ అంగ విన్యాసం వలె చక్రవత్ చలాయ మానం అవుతున్నాయి గదా, అట్టి గోపాలుడు వ్రజబాలలతో నానాప్రకారాలుగా రాసలీల చేస్తున్నాడు. ఆహా ! వ్రజ బాలలు ఎంత సౌభాగ్యవతులు ! వారి భాగ్యం బ్రహ్మేంద్ర శివ విష్ణ్వాదులకు లేదు, దేవలలనలకు లేదు. వ్రజ బాలల సమస్తేంద్రియాలు భగవద్రూపాన్ని, భగవత్సంస్పర్శ ని పొందాయి. భగవన్మయాలైన వారి మనసు - బుద్ధి తమలో భగవాన్ గోపాలకృష్ణుని గాంచి ఎంతో సంతసిస్తున్నాయిట. వారి నేత్రాలలో మదన మదహారి - కోటి మన్మథ మన్మ థుడు మదనగోపాలుని మధుర రసము ప్రవహిస్తోంది. ఆ మదనగోపాలుడే మధుర మురళీ రవళి రూపంలో రస విస్తా

రకుడై, శ్రోత్రాలలో ఇల్లు కట్టుకొన్నాడు, ఘ్రాణేంద్రియానికి శీతలమంద సుగంధమైనాడు, రసనేంద్రియానికి స్వాదిష్ట మధురాన్నమైనాడు, సమస్తేంద్రియాలకు ఆత్మ విస్మృతి కారణభూత మగు స్పర్శసుఖమైనాడు. భోక్త - భోగము - భోగ్య. ఈ మూడు మదనగోపాలుడే. ఆతడు సర్వసుఖ నిధానం, అయినా గోపికలలో సుఖ మనుభవిస్తున్నాడు. అయితే ఆ వ్రజ బాలలు నిస్సంశయంగా సౌభాగ్యవతులు, అద్వితీయలని వేరే చెప్పాలా ?

మదనగోపాలుని యందు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయాల్ని చింతించవచ్చును, చింతించాలి. లేనిచో ఈ ప్రపంచం మనల్ని బాధించి తీరుతుంది.

మదనగోపాలుడు చిన్మయశరీరుడు. అచట దేహము-దేహా భేదం లేనేలేదు.

మన చింతన భావప్రధానం, మనః ప్రధానం కాదు. గోపాల సంబంధాన్ని పొందితే ఈ చింతనే యథార్థమై, దివ్యమై, అప్రాకృత అనుభవాన్నిస్తుంది. ప్రేమికునకు అప్రాకృత భావశరీరం వస్తుంది. శ్యామపరివారంలో సభ్యత్వం వస్తుంది.

చింతన రెండు రకాలు. (1) మనః ప్రధానం. (2) భావ ప్రధానం. మనసు క్షుద్రం; భావం దివ్యం, త్రికరణ పరిధికి అతీతం. చింతిత విషయం నిమిత్తం మనసు ప్రపంచంలో పరుగెత్తి - పరుగెత్తి సర్వేంద్రియాల్ని నాశనం చేస్తుంది,

స్వయంగా నాశనమవుతుంది. ఆ ఆసక్తి ఇంతపని చేస్తుంది. చెప్పండి, అదే మనోవృత్తి గోపాలుని యందు లగ్నమైతే ఇంకెంత పని చేయాలి? క్షుద్రవృత్తి ప్రభావం క్షుద్రంగా ఉంటుంది, ప్రేమ ప్రభావం లోకోత్తరంగా ఉంటుంది.

శ్లో॥ ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాం గతా,
సర్వేశే మనసో వృత్తిః భక్తి రిత్యభి ధీయతే॥
(శ్రీమధుసూదన సరస్వతీ స్వామి)

భగవద్వ్యాపారములందు నిర్విరామంగా పరుగులు తీసే చిత్తవృత్తి కావాలి. దాన్నే 'భక్తి' అంటారు.

ప్రేమాగ్నిలో మనసు పతంగమై దగ్ధం కావాలి. సమస్త భౌతికవాసనలు నశించాలి. దీపశిఖావత్ ఒక్క గోపాలరూపమే త్రికరణాలలో ప్రకాశించాలి. అప్పుడు హృదయకమలం ఊర్ధ్వముఖంగా వికసిస్తుంది. వైరాగ్య సుగంధం సర్వత్ర వ్యాపిస్తుంది. హృద్గత భావం, లేక మన ప్రేమచింతన వస్తుస్థితిని సంపాదించు కొంటుంది. ఆ శుభ ముహూర్తంలో ఆత్మస్వరూపుడు మదన గోపాలుడు ప్రేయసికి ఆలింగన మీయటానికి ఆతురుడై పరుగిడి వస్తాడు. అంతవరకు విషయాల్ని సంగ్రహించే మనసు దగ్గరికి గోపాలుని నామ రూపాల్ని తీసికొని రావటానికి కోటి విధాల ప్రయత్నించాలి. ప్రయత్నించటం మానవ కర్తవ్యం. ప్రయ

త్నించామా విజయం సాధించి తీరుతాము. గుర్తుంచుకోండి! మన ఒక్కొక్క అపజయం, ఒక్కొక్క నిజమైన అశ్రు బిందువు మన ప్రగతికి బంగారుబాటను కల్పించి తీరుతుంది, మనల్ని అతి త్వరలో మదనగోపాలుని కౌగిలిలోకి చేర్చి తీరుతుంది. ఒకటే మాట ! ఈ నాటి అపజయం రేపటి విజయానికి అమోఘ దర్పణం. అపజయం పొందవచ్చు, కానీ మనం ప్రేమమార్గంలో అసమర్థులం కారాదు, మరువరాదు.

"ప్రేమ" అంటే ఏమిటి? ఆ అనుభవం ఎలా ఉంటుంది? లోకోత్తరంగా ఉంటుంది. ప్రేమ ప్రాప్తికై ఏడవాలి. ప్రేమ ప్రాప్తించిన తరువాత ఆ ప్రేమయే మనల్ని నిర్విరామంగా ఏడిపిస్తుంది. మరువరాదు, అశ్రుపాతం ఉంటుంది, ఆక్రందన ఉంటుంది, కానీ ప్రేమమార్గంలో దుఃఖం ఉండదు. నిరంతరం ప్రియుడి నామరూపాలు దగ్గరుంటే. సర్వకాల సర్వావస్థలందు గోపాలుడికి మనం సహచరులమై ఉండగలిగితే, క్రమంగా మనమే ఆ నామరూపాలుగా పరివర్తన చెందితే, అట్టి స్థితిలో దుఃఖం మనలోనికి రమ్మనమంటే మాత్రం ఎలా వస్తుంది ?

ప్రేమసరోవర్ యహ అగమ్ యహా నఆవత్ కోయి,
ఆవత్ సో ఫిర్ జాత్ నహి రహాత్ యహీంకా హోయి॥
చలో చలో సబ్ కోయికహై పహుంచై విరళా కోయి,

యిక్ కంచన్ ఇక్ కామునీ దుర్గమ్ ఘాటీ దోయి॥
జబ్ మైథా తబ్ హరి నహిఁ జబ్ హరిహై మైనాహిఁ,
ప్రేమ గలీ అతి సాంకరీ జామే ద్వైన సమాహిఁ॥
(నారాయణ స్వామి - వ్రజభాషా సాహిత్యం)

"ప్రేమ సరోవరం చాలా దుర్గమ మయింది. ఇక్కడకు రావటమే కష్టం. వచ్చారా మరల తిరిగి వెళ్ళలేరు. ఏముందీ, ప్రేమించటమేగా ! అదెంత పని !! అని అందరూ అనుకొంటారు. కాంచనం - కామిని అనే రెండు భయంకర అవరోధాలుండగా అందరూ ఎట్లా ప్రేమ సరోవర స్నానం చేయగులుగుతారు ?

"నేను - నేను" అని అహంకరించి నంతకాలం గోపాలుడు అదృశ్యంగా ఉన్నాడు. ఇప్పుడు గోపాలుడు ముందుకు వచ్చాడు, 'నేను' లేదు, నేను లేను."

లోకంలో ఎందరో ఎన్నివిషయాలనిమిత్తమో ఏడుస్తున్నారు. చివరకు ఏడుపులోనే చస్తున్నారు. మళ్ళీ ఏడుస్తూ జన్మిస్తున్నారు. చెప్పండి, గోపాలుని నిమిత్తం ఎందరు ఏడుస్తున్నారు? ఒక్కసారి ఏడ్చారా, శుద్ధహృదయంతో ఏడ్చారా గోపాలుడు మనవాడై తీరుతాడు. మనం గోపాలుని వారలమవుతాము. ఇక ఆ తరువాత ఏడుపు ఎంతగొప్పదో ఏడ్చి తెలిసికొనవలసిందే.

గోపాలా !

తవముఖచంద్ర్ చకోరో మేరే నైనా।

అతిఆరత్ అనురాగీలంపట్ భూలిగయీ గతిపలహు లగైనా॥

అరబరాత్ మిలివేకో నిశిదిన్ మిళేరహత్ మానో కబహూమిలైనా॥

భగవత్ రసిక్ రసిక్‌కీ బాతేం వినారసిక్ కోయీ సమఝుసకైనా॥

"నీముఖం చంద్రుడు, నా నయనాలు చకోరాలు. అత్యంత విహ్వాలాలు, అనురాగమయాలు మరియు అవి మిలనాతురాలు. ఏమి చెపుతున్నానో ఏమో! భగవత్ రసికుని మాటల్ని రసికుడు అర్థం చేసికోవాలిగానీ మరొకడు ఎట్లా అర్థం చేసికోగలడు ?"

శ్రీరాధాకృష్ణులు ఒకేతత్త్వానికి రెండు నామరూపాలు. వీరి సంబంధంకూడా ఒక్కటే. బ్రహ్మవైవర్తపురాణంలో వీరి కళ్యాణకథ ఉంది కానీ భగవానునకు కళ్యాణనియమం కూడా ఉంటుందా ? ముఖ్యంగా శ్రీరాధాకృష్ణుల విషయంలో కళ్యాణానికి మూల్యమే లేదు. వారు లోకానికి, లోకధర్మానికి అతీతులు. వారికి మానవీయకర్మలు లేనేలేవు. అవి త్రిగుణాతీత భావరాజ్యలీలలు. శ్రీరాధాకృష్ణుల లీలావిహారం నిత్యం. వారు ప్రియాప్రియతములు. అట్టి వారికి దయచేసి భార్యాభర్తల రూప మీయకండి.

గోలోకం సమస్త దివ్యధామాలలో ప్రముఖమయింది, సర్వోన్నతమయింది. నిత్యం,సచ్చిదానందమయం. అది సమస్త బ్రహ్మాండాల కాత్మ. నిత్యం అనంతకోటి బ్రహ్మాండాలు దాని వల్లనే చలాయమాన మవుతున్నాయి. ఇట్టి గోలోకం సర్వోన్నతం, సర్వాధారం అయివుండికూడా సర్వవ్యాపకం మరియు సర్వజనాంతర్గతం. సమస్త ప్రాకృతలోకాలు దాని పాద విభూతికి ఒక్క అంశామాత్రం. వీనికి సర్వథా భిన్నమయింది అప్రాకృత సచ్చిదానందాత్మక త్రిపాద్విభూతి. అదే వైకుంఠ, కైలాస, సాకేతరూపాల్లో భక్తుల అనుభవంలోకి వస్తోంది.

గోలోకధామం పరమోజ్జ్వలం, పరమసుందరం, పరమ మధురం, సర్వోన్నతం, దివ్యం, నిత్యం. అట్టిగోలోకధామం లోని శాశ్వత దివ్యప్రదేశాలే బృందావనం, మధుర, గోవర్ధనం, నందగ్రామం, బర్సానా ఆది. ఆ గోలోకం ఒకేఒక్క మాటలో భగవదభిన్నం. సర్వశక్తియుక్తం, సర్వాధారం, ప్రకాశమయం, భావమయం. అది ఒక్కటిగా ఉంటూనే సాకేత, వైకుంఠ, కైలాస రూపాల్లో అనేకంగా కూడా ఉంటుంది. ఇది ధ్రువసత్యం, భగవదవతార సమయాల్లో వాని విభూతి లోని అత్యంతాల్పభాగం, ఒక్క బిందువు ఈ మర్త్యభూమిపై కూడా ప్రకటమవుతుంది. దాని పరిణామమే ఈ అయోధ్యా, మధురా, బృందావనం, చిత్రకూటం ప్రభృతి క్షేత్రాలు. మర్త్యభూమిలోని ఈ క్షేత్రాలకు భగవానుడు నిత్యం సపరివారుడై దయచేసి లీలారసాన్ని

నిర్విరామంగా వర్షిస్తున్నాడు. ఆ అనుభవాల్ని పొందినవారు ఈ నాడు కూడ ఎందరున్నారో ! ఎందరున్నారో !!

ప్రియా ప్రియతములు శ్రీరాధాకృష్ణు లెటువంటి వారు ? చెప్పలేము. అది అనుభవ గమ్యం. అట్లే ప్రియా ప్రియతముల మధురభావ మెటువంటిది ? రాసలీలా మాధుర్య మెటువంటిది ? అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పలేము. అనుభవించి తీరవలసిందే.

ప్రేమ ఎట్లా అనుభవానికి వస్తుంద ? ఏముందీ? అనుభవిస్తున్న వారి సాంగత్యంవల్ల వస్తుంది.

శ్లో॥ మలయాచల గంధేన త్విoధనం చందనాయతే,
తథా సజ్జన సంగేన దుర్జనః సజ్జనాయతే॥
(సుభాషిత రత్నభాండాగారం)

"మలయాచల గంధం ఇతర సమస్త వృక్షాల్ని చందన వృక్షాలుగ చేస్తుంది. సజ్జనుడుకూడ దుర్జనుని తనవలె చేస్తాడు."

ఇది 500 సంవత్సరాలకు పూర్వం కథ. శ్రీకృష్ణ చైతన్య మహా ప్రభువు సహచరులతో బృందావన వీథులలో విహరిస్తున్నారు.

ఒక ప్రదేశంలో గొల్ల పిల్లలు కృష్ణలీలానుకరణం చేస్తున్నారు. కాళీయ మర్దనలీల జరుగుతోంది. అత్యంత

సుందరంగా ఉంది. భగవద్దత్తమైన చక్కని కంఠమాధు ర్యంతో పాడుతున్నారు. సమస్త జడచేతనాలు ఆ గానలహ రికి పులకాయమానాలు.

మహాప్రభువు విషయం ఏమి చెప్పాలి ? దృష్టి పైకి పోయింది. కళ్ళు ప్రేమరసాన్ని వర్షిస్తున్నాయి. నిర్విరా మంగా ఒకటే అశ్రుపాతం!! నోటివెంట చొంగ కారుతోంది, పాదాలు వ్యత్యస్తాలు, శరీర జ్ఞానమా ? లేదు. సమస్తావ యవాలు వేణుగోపాలునిపై తమకు గల ప్రేమను స్వచ్ఛందంగా వ్యక్తం చేస్తున్నాయి.

అదే సమయంలో కొందరు ముసల్మానులు నాయక సహితులై అటుగా వచ్చారు, చూశారు. 'చూడవలసిందే' అనుకొన్నారు. చూడలేక పోయారు. స్వార్థం ప్రేరేపించింది. దానవత్వం ముందుకు నడిపించింది. సాధికారంగా సింహ గర్జన చేశారు; "ఏమిటీ గోల ? ముందా కృష్ణ నామ సంకీర్తన నాపండి."

ప్రభువు సహచరుల నందరినీ బందీలను చేసి ఆ ముసల్మాను నాయకులు అనుచరులవైపు తిరిగి ఆదేశించారు; "ఈ పిచ్చివారి నందరిని చిత్రవధ చేయండి, స్వర్ణం ఏమైనా ఉంటే స్వాధీనం చేసికోండి."

మహాప్రభువు నేత్రాలు సజలాలైనాయి. రెండు క్షణాలు సంకీర్తన ఆగింది. చైతన్య వేణుగానం మార్మోగింది.

అందు అచేతనశిలలే ద్రవీభవించాయి, బృందావనం ఊయల లూగింది. ఇంక ఈ ముసల్మాను లేపాటి ?

మహాప్రభువు చెపుతున్నారు; "సోదరులారా! మారణ యత్నం విరమించండి. శ్రద్ధగా నే చెప్పేమాట వినండి. నేను సన్యాసిని. కామినీ కాంచనాలను కలలోనైన స్పృశించను. వీరు నా బహిఃప్రాణాలు, అమాయకులు. నన్నే నమ్ముకొన్నారు. బృందావనం చూపించటానికి ప్రేమవశీభూతులై నన్నిక్కడకు తీసికొని వచ్చారు. సోదరులారా! దయ చూపటం మానవధర్మం. ఈ సన్యాసి ముఖం చూచి వీరికి ప్రాణభిక్ష పెట్టండి."

అంతే ! శ్రీకృష్ణ ప్రాణభక్తుని సందర్శనం. మరియు సంభాషణం. ఆ మధుర స్రవంతి వారి నందర్నీ అమలురను చేసింది. ఎంత అదృష్టం ! ఎంత అదృష్టం !!

ముసల్మాను లందరు ముగ్ధులయ్యారు. "కృష్ణు డెక్కడున్నాడు ? భక్తుని రూపంలో ఉన్నాడు. ప్రేమంటే ఏమిటి ? జీవనాధారం. జీవితమేది ? "నేను నీవాడను" అన్న సమర్పా భావ యుక్తమయినది. "నేను నాయకుడను" అన్న భావం గల జీవి నిస్సందేహంగా పాషాణం. ముసల్మాను లందరు సమర్పణ భావయుక్తులై ప్రభుపు కాళ్ళపై పడ్డారు. ప్రభువు వారిని ప్రేమగా లేవదీసారు. అందరికి ఆలింగన మిచ్చారు. అంతే! అందులో అందరికి లింగభంగమయింది, అంగము లన్నీ

చి(త్రరూపములైనాయి. అద్భుతం! అందులో వారికి 'కన్నయ్య' అనే దివ్యరూపం లభ్యమయింది. దాని ముందు ఈ కాంచనం ఏపాటి? అస్తు.

ప్రేమ మనుషులనే కాదు, పశువుల్ని పాషాణాల్ని, సమస్త ప్రపంచాన్ని ఆశ్చర్యజనకంగా మార్పు చేస్తుంది. ఒకటే మాట! ప్రేమ స్వరూపులం కావాలంటే ప్రేమోన్మత్తుల నాశ్రయించి తీరాలి.

ప్రేమప్రాప్తికి అయిదే ఉపాయాలు. (1) వాసనా త్యాగం. (2) లీలా శ్రవణం. (3) తైలధారావత్ సాధన. (4) సజాతీయ వాసనా విశిష్ట సత్సాంగత్యం. (5) ఇవన్నీ దైవకృపవల్లనే లభిస్తాయి. ఆ దైవకృప నిమిత్తం పవిత్ర హృదయంతో నిరంతర మేడవాలి. ఏడవగా - ఏడవగా ఆ హృదయంలో ఉన్నవాడు ఈ అశ్రువుల మధ్యనుండి కన్నుల ముందుకు రాకపోతాడా? అని ఆశ. ఎందుకు రాడు! మన ఏడుపు సరైనదైతే తప్పక వస్తాడు, వచ్చి తీరుదాడు. పైన చెప్పబడిన ఉపాయాలు మన ఏడుపు సరైన దగుటకు తప్పక సహకరిస్తాయి. మరువకండి.

శ్లో॥ ప్రాయేణ భక్తియోగేన సత్సంగేన వినోద్ధవ,
నోపాయో విద్యతే సమ్యక్ ప్రాయేణహి సతా
మహామ్॥

(శ్రీమద్భాగవతం.)

"సంసారం నుండి ఉద్ధరింపబడటానికి సరళ సాధనాలు రెండే రెండు. (1) తీవ్ర భక్తి యోగం. (2) సత్సంగం."

శ్రీరాధాకృష్ణుల దినచర్య :-

బ్రాహ్మీ ముహూర్తం, శ్రీ ప్రియా ప్రియతములు నికుంజంలో నిద్రాపరవశులు. బృందా దేవి సంకేతంతో శుక సారికాదులు వారిని మేల్కొలుపుతున్నాయి. మేల్కొంటున్న ప్రియా ప్రియతములకు నికుంజంలో చెలియలు సేవలు చేస్తున్నారు. సేవ ముగిసింది. ప్రియా ప్రియతములు ఇల్లు చేరారు. తమ తమ తల్లులు పరుండబెట్టిన స్థానాలకు చేరి కపట నిద్రాముద్రను ప్రదర్శింప నారంభించారు.

యశోదమ్మ గోపాలుని నిద్ర లేపింది. త్వరత్వరగా దంతధావనం చేసికొని గోపాలుడు గో దోహనం చేశాడు. స్నానం ముగిసింది.

ఇచట సఖియలు శ్రీరాధా రాణిని కూడా లేపారు. దంత ధావనం చేయించి, తైలమర్దనం చేశారు. రాధారాణి స్నానంచేసి, శృంగారం చేసికొంది.

యశోదమ్మ పరిచారిక సరిగా సమయానికి బర్సానా శ్రీరాధికా అంతఃపురానికి వచ్చింది. శ్రీరాధతల్లి కీర్తికి నచ్చ చెప్పింది; "అమ్మాయిని పాక కార్యార్థం దయచేసి యశోదారాణి గారింటికి పంపించండి." కీర్తి సమ్మతమైనది. పరిచారిక వెంట శ్రీరాధారాణి కాలు కదిపింది.

గోపాలుడు రాధారాణి హస్తాన్నం తప్ప ఇంకెవరి అన్నం తినడు. ఆమె చేతి అన్నం తిన్నవారు ఆయుష్మంతు లవుతారని, అది ఆమెకు వరప్రసాదమని యశోదమ్మకు తెలుసును.

వంట తయారయింది. గోపాలుడు తిన్న తరువాత యశోదమ్మ నానా ప్రకారాలైన తీయని మాటలు చెప్పుతూ, గోపాలోచ్ఛిష్టాన్ని రాధారాణికి వడ్డించింది. హాస పరి హాసాల సుమధుర పర్యవేక్షణలో భోజన కార్యక్రమాలు ముగిశాయి.

వెంటనే గోపాలుడు గోచారణార్థం వనాలకు బయలు దేరాడు. శ్రీరాధారాణి కూడా పూవులు తేవాలని, సూర్య పూజ చేయాలని అసత్యం చెప్పి, చెలియలతో ఇంటినుంచి బయలుదేరింది. ముందుగానే బృందాదేవి సమస్తం సిద్ధం చేసింది. సమయం మధ్యాహ్నం రెండుగంటలు. సతృష్ణ నయనాలతో రాధాకృష్ణులు ఐకాంతికసుఖ మనుభవించారు. రెండున్నర గంటలయింది.

గోపాలుడు మిత్రులతో కలిసి తక్కిన వనాలకు వెళ్ళాడు. శ్రీరాధారాణి సఖీజన సమేతంగా ఇల్లు చేరింది. గోపాలునికై మరల స్వాదిష్ట పాకం తయారుచేసి, స్నానం చేసి, శృంగారం చేసికొంది. మేడ మీదకు వెళ్ళి గోపాలునికై ఎదురుచూడసాగింది.

సాయంకాలం గో - గోపాలక సహితంగా వేణు వాదనం చేస్తూ గోపాలుడు పదార్పణం చేశాడు. అది సుందర దృశ్యం. అందలి భావం అత్యంత మధురం. సంధ్యారాణి - యశోదారాణి సజలనయనాలతో స్వాగతం పలికారు. అపార జన సముద్రం మధ్యనుండి వ్రజబాలలు సప్రేమ నీరాజనా లందించారు.

యశోదారాణి గోపాలుని ఒడిలోనికి తీసికొని, శిరసు నిమిరి ముఖ గంధం ఆఘ్రాణించింది. చక్కగా స్నానం చేయించి, శృంగారం చేసింది. మిత్రులందరిని ప్రక్కన కూర్చుండబెట్టి జలపానం చేయించింది. అనంతరం గోపా లుడు గో దోహనం నిమిత్తం కాలు కదిపాడు. కొంత సమయం గోమాతలకు అనురాగాన్ని అందించి, రాత్రికి ఇల్లు చేరాడు. నంద ప్రభృతి గోపనాయకుల ప్రక్కన రాత్రి భోజనం ముగిసింది.

భోజనానంతరం నందరాజు దర్బారు తీర్చాడు. అవేమి నృత్యగానాలు ! ఏమి నృత్యగానాలు !! రామకృష్ణులకు ఎంత మనోరంజనం ! దినాంతంలో మనోరంజన ముండి తీరవలసిందే.

అనంతరం యశోదమ్మ గోపాలునిచే దుగ్ధపానం చేయించింది, చెలియల ద్వారా రాధారాణికి భోజనం పంపించి, గోపాలుని నిద్రపుచ్చింది. గోపాలుడు పడుకొన్నట్లే పడుకొని సంకేతానుసారం రహస్యస్థానం చేరాడు. శ్రీరాధా

రాణి కూడా ఉపస్థితురాలయింది. ఇక ఒకటేమిటి ! వన విహారం, జల విహారం, పునః భోజనాలు. క్రీడలే క్రీడలు. రాత్రి రెండున్నర గంటలయింది. రస ప్రవాహంలో సమస్త జడచేతనాలు చాలా ఆశ్చర్యకరంగా ప్రవహించాయి.

ఇది శ్రీ ప్రియా ప్రియతముల దినచర్య. ఇందలి రసం మనోవాక్కాయాతీతం. లీలలో ప్రవేశించి, కనులారా ఆ వైభవాన్ని చూసిన వారు మాత్రమే యత్కించిత్ ఇందలి మాధుర్యాన్ని ఆస్వాదించ గలుగుతారు.

అంతటి బ్రహ్మాండనాయకుడు వ్రజభూమిపై అడుగిడి వ్రజబాలలకు దాసుడైనాడు, గొప్పవాడు చాలా చిన్నవాడైనాడు, విజ్ఞుడు అజ్ఞుడైనాడు, వ్రజబాలురతో వినోదించి, వారి ఉచ్ఛిష్టాన్నం తిన్నాడు. ఏల ? నిశ్చయంగా ఇందులో అనంత మాధుర్యముంది. ఐశ్వర్యం ప్రకటంగా ఉంటుంది, మాధుర్యం ప్రకటంగా ఉండదు. ఒకటే మాట ! ప్రేమీ భక్తులు మాత్రమే ఆ మాధుర్యాన్ని ఆస్వాదించ గలుగుతారు.

శ్రీ రాధారాణి ఆది ప్రకృతి - త్రిగుణాతీత

శ్లో॥ తత్ప్రియా ప్రకృతి స్త్వాద్యా రాధికా కృష్ణవల్లభా,
తత్కళా కోటి కోట్యంశా దుర్గాద్యా స్త్రిగుణాత్మికాః,
తస్యాంఘ్రి రజసః స్పర్శాత్ కోటివిష్ణుః ప్రజాయతే॥
(పద్మ పురాణం - పాతాళ ఖండం)

"శ్రీకృష్ణప్రేయసి శ్రీరాధారాణి ఆది ప్రకృతి. ఆమె కళలోని కోటికోట్యంశా భాగము— అనగా అత్యంతాల్ప భాగము దుర్గాది త్రిగుణాత్మకతత్త్వము లైనది. ఆమె పాద రజంలో నుండి కోటి- కోటి విష్ణువులు- పాలకతత్త్వములు జన్మిస్తుంటాయి."

చిదూప అద్వితీయ బ్రహ్మ శ్రీకృష్ణుని అంశా విశేషమే.

శ్లో॥ కేచిద్వదంతి తస్యాంశం బ్రహ్మ చిద్రూప మద్వయం,
తద్దశాంశం మహావిష్ణుం ప్రవదంతి మనీషిణః,
యోగీంద్రైః సనకాద్యైశ్చ తదేవహృది చింత్యతే,
తీర్యగ్గ్రీవ జితానంత కోటి కందర్ప సుందరమ్,
సాపాంగేక్షణ సస్మేర కోటి మన్మథ సుందరమ్,
కుంచితాధర విన్యస్త వంశీమంజు కలస్వనైః,
జగత్త్రియం మోహయంతం మగ్నం ప్రేమ సుధార్ణవే॥

(పద్మపురాణం - పాతాళ ఖండం.)

"కొందరిట్లా అంటారు; చిద్రూప అద్వితీయ బ్రహ్మ శ్రీకృష్ణుని అంశ. మరికొందరిట్లా అంటారు; ఆతని దశమాంశం శ్రీమహావిష్ణువు. సనకాదిమునీశ్వరులు నిరంతరం చింతించే రూపమది. ఎందుకు చింతించరు! అనంతకోటి కామదేవులకన్న అధికసుందరుడు మా మదనగోపాలుడు. త్రివక్ర

మోహనాకారుడు. చంచలనయనాలు— మధురమందహాసం— కోటిమన్మథ మన్మథాకారం— అధరసింహాసనాలపై మురళి- అఖండరస ప్రవాహం. ఇంక ఏమి చెప్పాలి? చెప్పలేం. అదిగో చూడండి. చతుర్దశభువనాలను ఆ ప్రవాహం ప్రవహింప చేసేస్తోంది.

కుబ్జ స్వసుఖం నిమిత్తం గోపాలుని ప్రేమించింది. కనుక అది సాధారణీ రతి.

అష్టపట్టమహిషులు ప్రియుని సుఖం నిమిత్తం, స్వసుఖం నిమిత్తంకూడా ప్రేమించారు. ఇది సమంజసమే. ఇది సమంజసీరతి.

గోపికలు ప్రియుని సుఖం నిమిత్తం స్వసుఖాల్ని త్యాగం చేశారు. ఇది సమర్థారతి.

ఇంక రాధాకృష్ణుల విషయం. ఇంత నిర్విరామంగా క్రీడిస్తున్నా శ్రీరాధాకృష్ణులకు తమలో ఎవరు రాధికయో, ఎవరు కృష్ణుడో, నామరూపాలెట్టివో ఎంతమాత్రం తెలియదు. బృందావనంలో ఈ రసాస్వాదన ప్రక్రియను 'హితతత్త్వం' అంటున్నారు. శ్రీరాధాకృష్ణులు నిభృతనికుంజంలోని ప్రియా ప్రియతములు— స్వచ్ఛంద విహారులు.

జబ్ హరి మురలీనాద ప్రకాస్యౌ !
జంగమ్ జడ్, స్థావర్ చర్ కీన్హే,
పాహన్ జలజ్ వికాస్యౌ॥

స్వర్గ పాతాల్ దసో దిసిపూరన్,
ధుని ఆచ్ఛాదిత్ కీన్హా
నిశిహరి కల్పసమాన బఢాయీ,
గోపిన్ కో సుఖ దీన్హా॥
జడసమ్ భయే జీవజల్ స్థలకే,
తన్ కి సుధీనసమ్హారా
సూరశ్యామముఖ వేణు విరాజిత్,
పలటే సబ్ వ్యవహారా॥
(శ్రీ సూరదాస్ జీ)

మదనగోపాలుని మురళీనాదం తన విభూతిని విస్తరింప చేసింది; చేతనము నచేతనముగా, అచేతనమును చేతనంగా అలరింపచేసింది,పద్మాలను వికసింపచేసింది, స్వర్గపాతాళాలవరకు దశదిశలందు నిండి మురిపించింది. ఒక్క రాత్రిని కల్పసమానం కావించి మధురరసాన్ని ప్రవహింపచేసింది. ఏజీవికి శరీరజ్ఞానం లేదు. అందరు ప్రవాహంలో ప్రవాహితులే.

శ్యామసుందర్ మదనమోహన్ బాంసురీ బజాయీకే,
దోఊ కరజోరి బహురి అధరనిపై ఆనిధరీ,
థకిత్ భయీ గ్వారిని సుఖినహీంరహీంకోయీకే,
బాజై సుఅనేక్ రాగ్, వాణీ, శివ, శేష్‌నాగ్,
ధునిసబ్ సీస్ ధునై ధరణీపరి ఆయీరీ॥
(శ్రీ సూరదాస్ జీ)

వేణుగానం ప్రవహించింది, గోపాలుడు ప్రవహించాడు, సమస్త జడచేతనాత్మక ప్రకృతి ప్రవహించింది, సమస్త గోపికా బృందం అచేతనావస్థలో ప్రవహించింది, వారి హృదయరాగం అనేక రాగాలుగా ప్రవహించింది, సరస్వతీ, శివ, శేషనాగ ప్రభృతి సమస్త దేవతలు పరవశించి, స్వస్థానాల నుండి బృందావనం పైకి ప్రవహించారు. ప్రవాహమే ప్రవాహం. అది అఖండం. ఏమిటా ప్రవాహం ?

శ్లో॥ కకారో నాయకః కృష్ణః సచ్చిదానంద విగ్రహః,
ఈ కారః ప్రకృతీ రాధా మహాభావ స్వరూపిణీ,
లశ్చా నందాత్మకం ప్రేమ సుఖంచ పరికీర్తితం,
చుంబనాశ్లేష మాధుర్యం బిందునాదం సమీరితమ్॥

"క్లీం". ఇది భగవదభిన్న కామబీజం. దీని స్వరూప ప్రకటనయే 'రాసలీల'. ఇది నాలుగు విధాలుగా విభజింప బడింది. (1) 'క' దీనికి నాయకుడు సచ్చిదానంద విగ్రహుడు శ్రీకృష్ణుడు. ఆ సచ్ఛక్తియే 'సంధిని'. అదే బృందా వనం. చిచ్ఛక్తి లీలానిర్వాహిక. ఆనందశక్తి ఆహ్లాదిని శ్రీరాధారాణి.

(2) 'ఈ'. ఆది ప్రకృతి - మహాభావ స్వరూపిణి శ్రీరాధిక దీనికి రాణి. మహాభావానికి రెండవయవాలు. (1) మోదనం: దీనిలో సాత్త్వికభావాలు అప్రకటంగా ఉంటాయి. (2) మాదనం: దీనిలో సాత్త్విక భావాలు ప్రకటంగా ఉంటాయి, అపార విరహ వేదన ఉంటుంది.

సమస్త ప్రాకృత సుఖదుఃఖాలు, బ్రహ్మానందం ఈ మాధన దుఃఖబిందువు ముందు, ఒకే ఒక్క బిందువు ముందు అత్యంత హీనా లవుతాయి.

(3) 'ల'. ఇది కేవలానంద ప్రేమసుఖ విస్తారకం.

(4) 'బిందువు – అనగా 'ం'. ఇది అప్రాకృతమిళన మాధుర్య స్ఫోరకం. బిందువు లేని బీజాక్షరం నిర్జీవం. ఏ బీజాక్షరానికైన ప్రాణం బిందువే. ఇట్టి క్లీం బీజాభి వ్యక్తియే రాసలీల.

రాసలీలా గోపికలు కేవలం 19 తరగతుల వారు మాత్రమే. అన్యపూర్వా శ్రుతి గోపికలు 10 తరగతులు. వీరు శ్రుతులు. అనన్య పూర్వా కుమారికలు 9 తరగతులు. వీరు ఋషులు. విషయ సుఖానుభవానికి పూర్వమే వీరు ప్రేమవ్యాధి పీడితలైనారు. కాన అనన్య పూర్వా గోపికలు.

గోపికా హృదయమే గోపికా గీతలు. గోపికా హృదయం మిళనాతురం. రసస్వరూపుడు రాసవిహారి అందు ప్రవాహగతి యుక్తుడు. ఆ రస ప్రవాహమే ఈ గోపికా గీతలు 19 శ్లోకాలు. వీనియందు పైన చెప్పబడిన 19 తరగతుల గోపికల విరహరసం ప్రవహించింది. ఈ లీలా శ్రవణం-శ్లోకపారాయణం కామనాశకరం – గోపీరూప ప్రదాయకం. ఇది 'భగవదభిన్న శృంగారం', త్రిగుణాతీతం. బ్రహ్మజ్ఞానులు కూడా ఆస్వాదించవలసినది, ఎంతమాత్రం ఆస్వాదనకు రానట్టిది. రసాస్వాదన లేని జీవితం వ్యర్థమే. ప్రతి మానవుడు

ప్రేమరాజ్యంలో రసికుడై తీరాలి, కాగలడు. అందుకు శ్రీ రాధారాణి కృపాకటాక్షం - రసికమహాపురుషుల వాత్సల్యం అత్యంతావశ్యకం. అందుకు ఏమిచేయాలి? ఒకటేమాట! ఏడవాలి, ఏడుస్తూ, నామగానం చేయాలి. "రోదనం - నామ గానం". గోపాలుడు ప్రియుడు. అయితే అతనికి సంబంధించిన వన్నీ అవశ్యం ప్రియమై తీరుతాయి. ముఖ్యంగా నామం చాలా ప్రియమవుతుంది, ప్రాణ ప్రాణ మవుతుంది. అన్నీ ఉన్నాయి. కానీ ప్రక్కన ప్రియుడు లేడు. అయితే ఏమియు లేనట్లే. అంతా శూన్యమే. ఇట్టి స్థితిలో ఏడవకుండటం ఎట్లా సాధ్యం? ఎట్లా ఏడవాలి? "గోపాలా! గోవిందా! దామో దరా! మాధవా!" అంటూ ఏడవాలి. గోపికలు ఇట్లాగే ఏడ్చారు.

శ్లో॥ బృందావనస్థం హరిమాశు బుద్ధ్వా
గోపీగతా కాపి వనం నిశాయాం,
తత్రాప్య దృష్ట్వాతి భయాదవోచత్
గోవింద దామోదర మాధవేతి॥

(శ్రీ లీలాశుకులు)

"ఒక రాత్రి వేళ గోపికకు బృందావనంలో మదన గోపాలుడు విహరిస్తున్నట్లుగా భ్రమ కలిగింది. వెంటనే అక్కడకు పరుగెత్తింది. శ్రీకృష్ణ దర్శనం లేదు. భయంతో ఏడవసాగింది. "గోవిందా ! దామోదరా !! మాధవా !!!"

ప్రేమరాజ్యం ఇటువంటిది. కనుకనే ఈ శృంగార రసాస్వాదనకు వల్లభాచార్యులు - జయదేవులు - శ్రీకృష్ణ చైతన్య మహాప్రభువు - మీరాబాయి ప్రభృతులు అత్యధిక విహ్వలులైనారు.

ఆహ్వానం ! ప్రేమీ భక్తులారా ! అప్రాకృత ప్రేమ రాజ్యంలో భగవదభిన్న శృంగారరసాస్వాదన చేయటానికి పరుగిడి రండి !

అన్యపూర్వా శ్రుతి రూపా గోపికలు 10 తరగతుల వారు ఈ క్రింది 10 శ్లోకాలందు విహరించారు.

| | శ్లోకము | | స్వరూప స్వభావము |
|---|---|---|---|
| ( 1) | "జయతి తేఽధికం" | (శ్లో 1) | సాత్త్విక రాజసీ |
| ( 2) | "శరదుదాశయే" | (శ్లో 2) | సాత్త్విక తామసీ |
| ( 3) | "విషజలాప్యయాత్ | (శ్లో 3) | సాత్త్విక సాత్త్వికీ |
| ( 4) | "నఖలు గోపికానందనో" | (శ్లో 4) | నిర్గుణా |
| ( 5) | "దినపరిక్షయే" | (శ్లో 12) | రాజసతామసీ |
| ( 6) | "ప్రణత కామదం" | (శ్లో 13) | రాజస రాజసీ |
| ( 7) | "సురత వర్ధనం" | (శ్లో 14) | రాజససాత్త్వికీ. |
| ( 8) | "అటతి యత్" | (శ్లో 15) | సత్వమిశ్రతామసీ |
| ( 9) | "పతి సుతాన్వయ" | (శ్లో 16) | తామస తామసీ |
| (10) | "రహసి సంవిదం" | (శ్లో 17) | రజోగుణమిశ్రతామసీ |

అనన్యపూర్వా ఋషిరూపాగోపికలు ఈ క్రింది తక్కిన 9 శ్లోకములందు 9 తరగతులుగా విహరించారు.

(1) "విరచితాభయం" (శ్లో 5) సాత్త్విక సాత్త్వికీ
(2) "వ్రజ జనార్తిహన్" (శ్లో 6) సాత్త్విక తామసీ
(3) "ప్రణత దేహినాం" (శ్లో 7) సాత్త్వికరాజసీ
(4) "మధురయాగిరా" (శ్లో 8) నిర్గుణా
(5) "తవకథా మృతం" (శ్లో 9) రాజస సాత్త్వికీ
(6) "ప్రహసితం" (శ్లో 10) రాజసతామసీ
(7) "చలతి యద్వ్రజాత్" (శ్లో 11) రాజస రాజసీ
(8) "వ్రజ జనౌకసాం" (శ్లో 18) సత్త్వ గుణమిశ్రతామసీ
(9) "యత్తే సుజాత" (శ్లో 19) రజోగుణమిశ్రతామసీ

సూచన: ఈ ఋషిరూపా గోపికలందు తామసతామసీ శ్రేణి లేదు.

(ఆధారము: శ్రీ వల్లభాచార్య కృత భాగవత వ్యాఖ్య)

శ్లో॥ ఏవం పరిష్వంగ కరాభి మర్శ
స్నిగ్ధేక్షణోద్దామ విలాస హాసైః,
రేమే రమేశో వ్రజసుందరీభి -
ర్యథార్భకః స్వప్రతి బింబ విభ్రమః॥

(శ్రీమద్భా. స్కం 10 - అ 33 - శ్లో 17)

మదనగోపాలుడు - గోపికలు; గాఢాలింగనం - వీక్షణం - విలాసం - విహాసనం - అంగమర్దనం - గూఢ

భాషణం. ఇవన్నీ అప్రాకృతానికి, ప్రాకృతానికి కూడ రస విస్తరణ ప్రక్రియలు, అసలిచట నాయికా నాయకులు శరీర రహితులు గదా ! ఇంక ఈ క్రియలకు ప్రాకృతత్వ మెట్లా సంభవము ? గోపికలకు గోపాలుని యందు కామభావం - నిజేంద్రియ సుఖాభిలాష-అంగ సంయోగాపేక్ష లేనే లేదు. మరువరాదు. హృదయంలో ఎటువంటి భావం ఉంటుందో అదే ప్రపంచరూపాన్ని పొంది కనుల ముందుకు వస్తుంది. కాముకులకు ఈ అప్రాకృత దివ్య లీలలు కామ క్రీడలుగా కనిపించినా యంటే ఆశ్చర్యాన్వితులం కావలసిన అవసరమే లేదు.

శ్లో॥ భగవానపి తారాత్రిః శరదోత్ఫుల్ల మల్లికాః.
వీక్ష్యరంతుం మనశ్చక్రే యోగమాయా ముపాశ్రితః,
(శ్రీమద్భా, స్కం 10 - అ 29 - శ్లో)

మరువరాదు, రాసలీలా ప్రవర్తకుడు ఎవడు ? భగవానుడు. ఈ రాస పంచాధ్యాయిలో స్థానస్థానంలో "భగవానుడు - ఈశ్వరుడు - అవ్యయుడు - పురుషుడు - పురుషర్షభుడు" ఆది విశేషణాలే ప్రస్తుతాలు. మన భగవాన్ గోపాలకృష్ణుడు షడైశ్వర్య సంపన్నుడు.

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశస శ్శ్రియః,
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగయితీరణా॥

(1) ఐశ్వర్యం. (2) ధర్మం. (3) యశస్సు. (4) శ్రీ. (5) జ్ఞానం. (6) వైరాగ్యం. వీని సమగ్ర స్వరూపమే భగవానుడు.

ఆతడు రాసలీలా సమయంలో యోగమాయాముపాశ్రితుడు. యోగమాయా సహకారంతో రాసలీలను ప్రవర్తింప చేశాడు. భగవానునకు రెండు రూపాలు. (1) ఆవరణాత్మకం, (2) ఆవరణరహితం.

శ్లో॥ నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా
సమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకోమామజ
మవ్యయమ్॥

"అర్జునా! యోగమాయచే ఆవరింపబడియుండటం వల్ల అజ్ఞానీజనం నన్ను గుర్తించలేకున్నారు. నేను జన్మరహితుడను, అవినాశీ పరబ్రహ్మను. అయినా అజ్ఞుల దృష్టిలో జన్మ మరణములుగల సామాన్య ప్రాణిని." (గీత అ7-శ్లో25).

భగవానుడు యోగమాయా రహితుడై నప్పుడు, నిరావరణమూర్తి యైనప్పుడు ఆ యోగమాయ శ్రీ రాధారాణి స్వరూపం. ఆట్టి యోగమాయా సహాయంతో రాసలీలా సమయంలో అఖండంగా భగవదభిన్న శృంగార రసం ప్రవహించింది. మాయ రెండు విధాలు : (1) బహిరంగా :

ఇది సమస్త బ్రహ్మాండాలను ప్రవర్తింప చేస్తుంది. (2) అంతరంగా: ఇది సమస్త లీలలను ప్రవర్తింప చేస్తుంది.

శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావాలతో భగవానుని ప్రేమించే భావభక్తులు నిరంతరం నిరావరణ భగవానుని సాహచర్యం పొందుతారు, అద్భుత ప్రేమరసాన్ని నిరంతరం ఆస్వాదిస్తారు.

చెప్పండి, రాసలీల ఎంత గొప్పది? "అంతకన్న గొప్పది, ఇంతకన్న గొప్పది, ఎంతో గొప్పది" అనటం ఎంత అజ్ఞాన భాషణం! అంతా రాసలీలా ప్రవాహమే. తక్కువ విషయం మరేదైనా వుంటే దీనికి గొప్పదనం వస్తుంది. రాస లీల వినా అన్యం లేనేలేదు. కాన రాసలీలకు సాటి రాస లీలయే.

భావుకత ఆత్మీయత యైనది, అది అనన్య మయింది. అన్యాశ్రయ శూన్య మయింది. "నాకు కావలసింది ఒక్క గోపాలుడే. తక్కిన వానితో నాకు పనియే లేదు." ఇదే అనన్యత. అన్యమంతా ఈ భావ మాధుర్యంలో గోపాల స్వరూపమే. అందంతర్వాహిని వేణుగానం. తన్మయత సిద్ధించింది. మనసునకు ఎందనన్యతయో జీవికి అందే జీవనం. సమస్తేం ద్రియాలకు ఆ శ్యామరూపరసమే జీవనం. స్వస్వరూపాను సంధానంలోని రసం శ్యామరసం. ప్రేమ ప్రేమికునకు తన రూపాన్నిచ్చి తీరుతుంది. అట్లా ఈయలేకపోతే అది ప్రేమయే

కాదు, నిస్సంశయంగా దంభం. తన్మయత విహ్వలత రూపాన్ని ధరించింది. ఇంద్రియాలు ఆలింగనానికి అత్యంతాతు రాలు. ప్రేమాగ్నిలో అవన్నీ చిదూ్రిపాలై బృందావనానికి పరుగుతీశాయి. "వ్రజ మితి దేహం" (శ్రీమద్భాగవత భాష్యం.) దేహ బృందావనంలో వృత్తులన్నీ ఆత్మయందు లయించాయి. అంతరాత్మ స్వరూపుడు మదన గోపాలుడు తదనంతరం తన రసరూపాన్ని విస్తరింపచేశాడు. రాసలీల దివ్యంగా జరిగింది. (1) భావుకత (2) ఆత్మీయత (3) అన న్యత (4) తన్మయత (5) విహ్వలత. వీని పరాకాష్ఠ స్వరూ పమే రాసలీల.

రసప్రవాహానికి రెండు ముఖాలు జాగ్రత్స్వప్నాలు. సుషుప్తియందు క్రియాత్మకత కభావం. క్రియ జరుగకపోతే రసానికి ప్రవాహరూపం లేదు. కాన దీనిలో సుషుప్తికి స్థానం లేదు. దివ్య జాగ్రత్స్వప్నాల అఖండ రసధార రాసలీల.

*　　　*　　　*

శ్రవణ కీర్తనాది నవవిధ భక్తులు అభ్యాస రూపాలు. ఇవి క్రమంగా ప్రేమరసావతరణానికి బీజా లవుతాయి. ప్రపంచం - గోపాలుడు; మనసులో రెండుండ లేవు. ఏదో ఒక్కటే ఉండాలి. లేదా ప్రపంచం గోపాలరూపంగా ఉండాలి. ప్రపంచమంటే అన్నరసం. గోపాలుడంటే ప్రేమరసం. అన్న రసం సత్త్వరజస్తమోగుణయుక్తం, క్షుద్రం, ఇంద్రియ వినాశ

కరం. ప్రేమరసం త్రిగుణాతీతం. దేవతలకు, మానవులకు, సమస్త జీవులకు ఇంద్రియ పరివర్తకం, ఇంద్రియ పోషకం.

గంట సమయం పూజలు - జపాలు చేయటం అత్యావశ్యకం. వీని వలన ప్రారబ్ధకర్మ - మనసు - ఇంద్రియాలు మార్పు చెందుతాయి. పరివర్తన రాకపోతే ఆ పూజాజపాలు నిస్సంశయంగా దంభమే. సత్య సంయమాలు లేని పూజా జపాలు నిస్సంశయంగా దంభమే. నాలుక నామమందు, మనసు రూపమందు, శరీరం సేవ యందు లగ్నం కావాలి. ఈ ప్రణాళిక లేని భక్తి నిస్సంశయంగా దంభమే. సంస్కారాలు మారుతుంటాయి, ఆహార విహారాలవల్ల మనసు మారుతుంటుంది, అందువల్ల భక్తి కూడ మారుతుంటుంది. కాన శరీరాన్ని సేవలో నియమించటమే సర్వశ్రేష్ఠమైన భక్తి. సేవాధర్మం సర్వశ్రేష్ఠ భక్తి.

సత్య సంయమాలు కుదురనంతవరకు మన భక్తి వాస్తవం కానేకాదు. "ఏదో చేస్తున్నాం. అంతే! ఈ భక్తి సరైనదని చెప్పటం అసాధ్యం. "నేను భక్తుడ" నని చెప్పే అధికారం ఎవరికి, ఏ మహర్షికి కూడా లేదు. భగవానుడు "నీవు భక్తుడవే" అని చెప్పాలి. భగవానుడు మాత్రం ఇట్లా ఎందుకు చెపుతాడు ? భక్తులకు గర్వం రాకూడదు సుమండీ ! భగవానుడు ప్రియుడు కావాలి. ఆ సాహచర్యం లభించాలి. అదే ప్రేమ లేక భక్తియొక్క రసానుభవం.

ఈ స్థితి వరకు భక్తితో పాటుగా ధర్మం అత్యంతావశ్యకం. మనలను దేవుడు రక్షించడు, ధర్మం మాత్రమే రక్షిస్తుంది.

ధర్మమంటే కర్తవ్యకర్మ. జన్మించిన ప్రతి మానవునకు కొన్ని కర్తవ్యాలున్నాయి. (1) పెద్దల ఎడల గౌరవం. (2) సత్యాన్వేషణ. (3) ధన సంపాదన. (4) సంపాదించలేని వారికి జీవన నిర్వహణార్థం ధనదానం. (5) వేదోక్త సంధ్యా వందనాది స్వధర్మ సంరక్షణం. నరుడు జీవిస్తున్నాడు. ఈ అవకాశాన్ని ఇతరులకు కలుగ చేసే జీవితాన్నే 'ధర్మ' మంటారు.

కర్తవ్య కర్మలు నిర్వర్తించాలి, నామరూపాల్ని సేవించాలి, ఇంద్రియాలను సేవయందు నియమించాలి. కానీ ఆచరించలేము. ఎందువలన ? వెనుక పాపపుణ్య కర్మల సంచయ ముంది. సంస్కారాలు ప్రచండ మారుతాలు. మనసు చంచలం, శరీరం రోగమందిరం, ప్రపంచం ఇంద్ర జాలం. ఇవి సేవాధర్మానికి జీవుని ప్రోత్సహించవు. పైగా అధోగతి పాలు చేస్తాయి. వీనిని నిరోధించే శక్తి మానవుల కుందా ? లేదు. ఏమి చేయాలి ? సత్సంగం, సత్కథాశ్రవణం చేయాలి. మహాపురుషులందు ప్రేమరసం అఖండంగా ప్రవ హిస్తుంటుంది. వారి శ్రీచరణ యుగళాన్ని స్పర్శిస్తే చాలు అనర్హులకు అర్హత - సాధనాబలం ప్రాప్తిస్తాయి. ఇంద్రియ నిగ్రహశక్తి - నామరూపాసక్తి చేకూరుతాయి. మహా

పురుషుల దృష్టిపాతం - శక్తిపాతం - సాహచర్యం అమోఘాలు. వీని వలన సమస్తం సులభసాధ్యమే.
"సత్సంగతిః కథయకిం న కరోతి పుంసాం."
(శ్రీ ఆది శంకరులు)

శ్లో॥ విద్యాదదాతి వినయం వినయా ద్యాతి పాత్రతా,
పాత్రతా ద్ధన మాప్నోతి ధనా ద్ధర్మం తత స్సుఖం॥

విద్య వల్ల వినయం, వినయం వల్ల పాత్రత, పాత్రత వల్ల ధనం. ఆ ధనం వల్ల ధర్మం సిద్ధించాలి. అట్లయితేనే నరుడు సుఖించ గలుగుతాడు.

అయితే సశాస్త్రీయ ధర్మాచరణం సాధ్యమా ? కాక పోవచ్చును. "ఎంత చేస్తున్నామన్నది" ప్రశ్న. "సరిగా చేస్తున్నామా ? లేదా ?" అన్నది ప్రశ్నయే కాదు.

శ్లో॥ అనుగంతుం సతాం వర్త్మ కృత్స్నం యది నశక్యతే,
స్వల్ప మప్యను గంతవ్యం మార్గస్థో నావసీదతి॥
(మనుస్మృతి)

మహాత్ముల జీవితం, ఉపదేశం అనుకరణ యోగ్యం. ఒకవేళ వానిని పూర్తిగా అనుసరించలేమా ? పూర్తిగా ఆ మార్గాన్నే విడిచి వేయరాదు. ఎంత స్వల్పమైనా సరే ఆచరించి తీరాలి.

ఎదుటి వ్యక్తి మన సేవవల్ల ప్రసన్నుడవటం లేదే ? ఇది ప్రశ్నయే కాదు. సేవ చేశామా ? లేదా ? అన్నదే ప్రశ్న.

సేవ చేయక సాధకులుండలేరు. వారు మహాత్ములకే కాదు, దురాత్ములకు కూడ సేవ చేస్తారు, నిష్కాములై, వివశులై చేస్తారు. సేవవల్ల దుఃఖం వస్తొందే? ఇది ప్రశ్నయే కాదు. మనకు సుఖ దుఃఖ పరిభాష తెలియనే తెలియదు. ప్రారంభంలో ఎందులో సుఖముంటుందో అదే చివరకు దుఃఖదాయకం అవుతుంది. ప్రారంభంలో ఎందులో దుఃఖముంటుందో అదే చివరకు సుఖదాయకం అవుతుంది. ఎదుటి వ్యక్తిని సేవించటం అంటే తనను సేవించుకోవటమే అవుతుంది. ఎదుటి వ్యక్తికి సుఖదుఃఖాల నివ్వటం అంటే ఆ సుఖదుఃఖాలను నిస్సంశయంగా తాననుభవించటమే అవుతుంది. ఏల? ఈ ప్రపంచంలో రెండు 'నేను'లు లేవు. అది ఒకటే. అదే ఇంతటి విశాల ప్రపంచం. సేవ ధర్మానికి - భక్తికి రెండింటికి ప్రధానాంగం. సేవవల్ల సుఖం తథ్యం.

అయితే ధర్మ వ్యవస్థాపకుని, సర్వభూత హృదయాంతర్వ్యాప్తిని, మదనగోపాలునే సేవించితే? ఓహో! ఇక చెప్పవలసిందేముంది! అది పరమ ధర్మం, పరమ సుఖ ప్రదాయకం. "కోటింత్యక్త్వా హరిం భజేత్." ధర్మ కర్మలలో ఏమైనా లోపముంటే, ఆ ప్రభువు నామసంకీర్తన చేస్తే ఆ లోపం మాయమై తీరుతుంది, ఆ ధర్మకర్మలు పూర్ణ ఫలితాన్నిస్తాయి. ఇక ధర్మ ప్రభువునే సేవించితే? ఆయన, ఆయన హృదయం భక్త పరాధీన మవుతాయి.

శ్లో॥ యత్పత్య పత్య సుహృదా మనువృత్తి రంగ
స్త్రీణాం స్వధర్మ ఇతి ధర్మవిదా త్వయోక్తం,
అస్త్వేవ మే తదుపదేశ పదే త్వయీశే
ప్రేష్ఠో భవాంస్తను భృతాం కిల బంధురాత్మా॥
(శ్రీమద్భా. స్కం 10–అ29–శ్లో32)

గోపికలు ఏక స్వరాన ఘోషిల్లారు :—

"ప్రాణేశ్వరా! మదనగోపాలా!! పతి పుత్రాదులను సేవించటం మాకు ధర్మమా? అయితే ఆ పతి పుత్రి నామ రూపధారివైన, సర్వభూతాంతరాత్మవైన నిన్ను సేవించటం మాకు పరమధర్మం. ఆ పతి పుత్రులందు ఎట్టి వాంఛ మాకుంటుందో అట్టి వాంఛతోనే నీ ముందుకు వచ్చాం. ఏమిటిది అన్యాయమా?

"పతి పుత్రాదిక నామమూర్తి వగుచున్
భాసిల్లు నీయందుఁద
త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సం
భావించు టన్యాయమే॥"
(శ్రీమదాంధ్రమహాభాగవతం)

మా మనోవాక్కాయాలు నీ స్వరూపమైనాయి, నీ వస్తువులైనాయి, స్వసత్తానే కోల్పోయినాయి. ఇట్టి స్థితిలో ఇంద్రియపరిపాలకుడవు నీవు మాకెట్లు పర పురుషుడవు

కాగలవు? పురుషుడవు నీవొక్కడవేగదా! జడ చేతనాత్మక సమస్త ప్రకృతి స్త్రీ స్వరూపమేగదా!

శ్లో॥ అస్పందనం గతిమతాం పులకస్తరూణాం
నిర్యోగపాశ కృత లక్షణయో ర్విచిత్రమ్॥
(శ్రీమద్భా. స్కం 10-అ21-శ్లో19)

గోపాలా! నీ వేణుగానం అచేతనాల్ని చేతనాలుగ చేసింది, చేతనాల్ని అచేతనాలుగ చేసింది. పాషాణాలకు కదలిక వచ్చింది. వృక్షాలు సాత్త్వికభావాల్ని పొందాయి. అవన్నీ నీ వేణుగానం ప్రభావంవల్ల నీ సాహచర్యాన్ని కోరుతూ ఇక్కడకు సపరివారంగా కదలి వచ్చాయి. చెప్పు! ఇట్టి స్థితిలో మేము రావటం ఎట్లా అధర్మ మవుతుంది? ధర్మమో, అధర్మమో అల్పబుద్ధి యుక్తలం మాకేం తెలుస్తుంది? ఒక్క మాటలో చెప్పాలంటే, గోపాలా! దోషమంతా ఈ మురళిది.

"నఖలు గోపికానందనో భవాన్ అఖిలదేహినా
మంతరాత్మ దృక్."
(శ్రీమద్భా. స్కం 10-అ31-శ్లో4)

గోపాలా! మా నేత్ర జ్యోతి నీవు. మా నేత్రాలు చూసే ప్రతిరూపం నీవే. ప్రపంచమంతా నీవే మా నేత్రాలకు స్థానస్థానంలో నీరూపంతో సాహచర్యమే. ఇక నీవు మాకెట్లు పరపురుషుడవు? నీతోటి సాహచర్యం ఎట్లు దోషయుక్తం?

"గోపాలా ! అవి నిన్న మొన్నటి రోజులు. రోజులా ! అవి ? కావు. క్షీరధారా ప్రవాహాలు. నీది కోమల శ్యామ రూపం. మాది లలిత మధుర భావం. పారాడేకు వయసు నీది, పసిగిడేకు హృదయం మాది. ఏమి క్షీర ధారలు ! ఏమి క్షీర ధారలు !! వేణువు లేదు, పీతాంబరం లేదు, కుండలాలు లేవు, ఆభరణాల బాధ లేదు, కేకి పింఛం లేదు. కౌపీనం కూడ లేదు. అది చిన్మయ నగ్నరూపం. నిన్నెత్తు కొని, ముద్దాడి, లాలించే వారము. హృదయ పాత్రలోనే కాక ఏకాదశేంద్రియ పాత్రలలో నీ రూపరసాన్ని నింపుకొనే వారము. మా అంతటి సౌభాగ్యవతులు లేరని గర్వించే వారం. కాని తృప్తి ఎక్కడిది ? ప్రేమకు తృప్తి ముఖాన్ని చూచే యోగ్యత లేదు. అంత చిన్న నాటి నుంచి, జన్మాది నుంచి నీ సాహచర్యాన్ని పొందుతూ వచ్చాం. ఈ నాడు నీవు ఇంత స్పష్టంగా మమ్ములను నిరాకరిస్తున్నావు. జీవన మైనా, మరణమైనా మాకు నీ తోడనే. గోపాలా ! ఇంక మా జీవనలీల ఈ క్షణంతో ముగిసినట్లే నిశ్చయించుకో."

సమస్త వ్రజ భూమి ప్రేమాశ్రు పరిపూర్ణం. వేదాంత సారం ప్రేమ. ప్రేమ సారం విరహం. విరహసారం అశ్రువులు. కర్మ భూమి, జ్ఞానం ఆకాశం, ప్రతికూల వాతావరణం మేఘ జాలం, హృదయా వేదన మేఘ గర్జన, భావ ప్రవాహమే అశ్రుధారలు.

పఢి పఢి కే సబ్ జగ్ ము ఆ, పండిత్, భయా న కోయి.
ఢాయీ అక్షర్ ప్రేమ కే, పఢై సో పండిత్ హోయి॥

"ఎన్ని చదువులు చదివితే ఏం లాభం ? ప్రేమ అనే రెండున్నర అక్షరాలను చదివితే చాలు, పండిత పదవి లభిస్తుంది. తక్కిన చదువులు ఎన్ని చదివినా ప్రేమ లేకపోతే మానవ జీవితం వ్యర్థమే."

విన్నారా ! బ్రహ్మ విద్య కూడా ప్రేమ విశ్వవిద్యాలయంలో చదువుకోవాలని నిశ్చయించుకుందిట.

సుందర బృందావనం. అందులో ఒక పీఠ. విశాల వనం. అది బ్రహ్మ విద్యకు సుందరి రూపాన్నిచ్చింది. పైగా ఘోరతపం చేయించింది. చేయించదా ఏమి ? బృందావనమంటే అటువంటిది. బృందావనానికి మనపై ఇంతటి నిర్దయ ఎందుకనియో ? ఇదే విషయాన్ని బ్రహ్మజ్ఞాని జాబాలి మహర్షి బ్రహ్మవిద్యను ప్రశ్నించాడు. ఆమె హృదయం ఏడుస్తూ ఆగి, ఆగి పలుకుతోంది.

శ్లో॥ బ్రహ్మ విద్యాహ మతులా యోగీంద్రైర్యాచ మృగ్యతే.
సాహం హరి పదాంభోజ కామ్యయా సుచిరం తపః,
చరామ్యస్మిన్ వనేఘోరే ధ్యాయంతీ పురుషోత్తమమ్,
బ్రహ్మానందేన పూర్ణాహం తేనానందేన తృప్తధీః,
తథాఽపి శూన్యమాత్మానం మన్యే కృష్ణ రతిం వినా॥

(పద్మపురాణం - పాతాళఖండం)

"నేను మహా - మహా యోగులచే నిరంతరం అన్వేషింపబడుతుండే బ్రహ్మవిద్యను. శ్రీకృష్ణ చరణకమల ప్రాప్త్యర్థం దీర్ఘకాలం నుండి ఈ ఘోరవనంలో ఆ పురుషోత్తముని చింతనతో తపం చేస్తున్నాను. నేను స్వయంగా బ్రహ్మానంద యుక్తను. ఆ ఆనందంతో నా బుద్ధి సంతుష్టమే. కాని ఇంతవరకు నేను శ్రీకృష్ణ ప్రేమను పొందలేదు. అందువల్ల నన్ను నేను నిస్సార ప్రతిమగా భావిస్తున్నాను.

మానవ జీవితాని కేది సారం? ఒకటే మాట! శ్రీకృష్ణ ప్రేమ. బ్రహ్మానందం తలను తన్నున దేది? ఒకటే మాట! శ్రీకృష్ణ ప్రేమ.

ఆ శ్రీకృష్ణ ప్రేమ ఎంత గొప్పదో!



# గోపికలు - విరహం

శ్లో॥ గత్యానురాగ స్మిత విభ్రమేక్షితై —
ర్మనో రమాలాప విహార విభ్రమైః,
ఆక్షిప్త చిత్తాః ప్రమదాః రమాపతేః
స్తాస్తా విచేష్టా జగృహు స్తదాత్మికాః॥

శ్లో॥ గతిస్మిత ప్రేక్షణ భాషణాదిషు
ప్రియాః ప్రియస్య ప్రతిరూఢ మూర్తయః।
అసావహం త్విత్యబలా స్తదాత్మికా —
న్య వేదిషుః కృష్ణవిహార విభ్రమాః॥

(శ్రీమద్భాగవతం, స్కం 10-అ30-శ్లో 2-3)

మదనగోపాలుడు - మందహాసం - మయూరపింఛం-చపల నేత్రాలు - పీతాంబరం త్రివక్రమోహనత - వ్యత్యస్త పాదాలు - వేణుగానం - చంచలయానం - చిత్తాపహారిణీ చేష్టలు - మధురభాషణం - లలిత మనోహరరూపం. అసలిట్టి రూపం ఎక్కడైనా ఉంటుందా? ఉంటే దానికి ప్రాణమీయని దౌర్భాగ్యు డెవడుంటాడు! ఇట్టి రూపం సమస్త జీవులలో ఉంది. అందువలననే ఆరూప సాహచర్యం నిమిత్తం ఇంతగా విరహం- విహ్వలత- అశ్రుపాతం. ఇంకా-? ఇంకా ఏముంది? ఇంక ప్రాణత్యాగమే. ఆత్మానుభవం నిమిత్తం— రసాస్వాదనార్థం ప్రాణత్యాగం చేసితీరవలసిందే. మనసా!

రాసవిహారి మదనగోపాలుని అప్రాకృత దివ్యసౌందర్యంలో ఏ లవలేశ భాగమందు ఇల్లు కట్టుకొన్నా చాలును, నిస్సంశయంగా నీతృష్ణ తీరుతుంది, రసస్వరూపమవుతావు.

వ్రజబాలల సమస్తేంద్రియాలు ఆ శ్యామరసానికి నిలయా లయినాయి, పాత్ర లయినాయి. ఫలితంగా ఈ వ్రజబాలలకు ప్రియుని స్వరూప స్వభావాలే వచ్చేశాయి. రాకుండటం ఎట్లా సాధ్యం?

శ్లో॥ యస్యాననం మకరకుండల చారుకర్ణ
భ్రాజత్కపోల సుభగం సవిలాసహాసమ్,
నిత్యోత్సవం నతతృపు ర్దృశిభిః పిబంత్యో
నార్యో నరాశ్చ ముదితాః కుపితా నిమేశ్చ॥
(శ్రీమద్భాగవతం, స్క-౦9-అ24-శ్లో65)

"ఆ చెవులకున్న రెండు మకరకుండలాలు చెక్కిళ్ళ కాంతిని ఉజ్జ్వలం చేస్తున్నాయి. మందహాసశ్రీ చాలా రస విలాసయుక్తంగా ఉంది. ఆ శ్రీకృష్ణుని ముఖ సౌందర్యం ఎంత నిత్యానందప్రదం! ఎంత లలితమనోహరం!! స్త్రీ పురుషులందరు నేత్రపాత్రలతో ఆ శ్యామరసాన్ని పానం చేస్తున్నారు. తృప్తి కలగటంలేదు. మధ్యమధ్యలో కనురెప్పపాటు వలన రసాస్వాదనకు విఘ్నం కలుగుతోంది. బ్రహ్మదేవుని నిందిస్తున్నారు. "ఏం తాతయ్యా! ఈమాత్రం భాగ్యానికైనా యోగ్యత లేకుండా చేశావే, అయితే మమ్మలను మానవులుగా ఎందుకు పుట్టించినావయ్యా?"

శ్లో॥ అటతి యద్భవా నహ్ని కాననమ్
త్రుటిర్యుగాయతే త్వామపశ్యతామ్,
కుటిల కుంతలం శ్రీముఖంచ తే
జడ ఉదీక్షితాం పక్ష్మకృద్దృశామ్॥
(శ్రీమద్భాగవతం, స్కం 10-అ31-శ్లో15)

"గోపాలా! నీవు పగటివేళ గోచారణార్థం వనాలకు వెళ్ళినప్పుడు మేమెంత దుఃఖిస్తామో ఏం చెప్పమన్నావు? అర్థక్షణకాలం కూడ యుగంలా ఉంటుంది. వంకరలైన ముంగురులతో ప్రకాశించే నీ ముఖాన్ని ఎంతో ఆసక్తితో, తదేక దృష్టితో చూస్తామే, మధ్యలో కనురెప్పలు పడుతుండటం వలన ఆ దర్శనానందంలో విఘ్నం కలుగుతోంది. ఆయ్యో! నేత్రాలకు ఈ రెప్పల నిచ్చిన ఆ బ్రహ్మదేవుడు ఎంత మందబుద్ధి!"

"నేను" "నేను" అనే జాలానికి మత్స్య మయింది, "నేను" 'నేను' నందు తగుల్కొంది, 'నేను' 'నేను'తో యుద్ధం చేసింది, 'నేను' చచ్చింది. 'నేను నీదాననే' ఈ భావం వచ్చింది. అందులోనికి ప్రియుని నామరూపాలు వచ్చాయి. ఇక ఆ స్వరూప స్వభావాలు గోపికలకు వచ్చినాయంటే ఆశ్చర్య మేముంది?

భౌతికశరీరం తుచ్ఛంగా తోచాలి. అది సహజంగా అత్యంత తుచ్ఛం గదా! అప్పుడే అందులోని ఆత్మ స్వరూ

వుడు మదనగోపాలుడు అనుభవంలోకి వస్తాడు. ఏ శరీరాన్ని అత్యంత తుచ్ఛమన్నామో అది అమూల్యమయినది, దేవతలచే కాంక్షింపబడేదికూడా గదా!

చూడండి. స్వప్నావస్థలో జీవునకు భౌతికశరీర స్పృహ లేనేలేదు. ఏదో దివ్యశరీరంలో, ఎక్కడో, ఏమేమో చేస్తున్నట్లుగా కలలు కంటాడు. భౌతిక నేత్రాలలో చూడలేని వానిని స్వప్నంలో చూస్తాడు, చెవులతో వినలేని వానిని వింటాడు. సుఖంగానీ, దుఃఖంగానీ భౌతిక ప్రపంచంలోని దానికన్న కోటి రెట్లధికంగా స్వప్నంలో అనుభవానికి వస్తోంది. చివరకు అదంతా మిథ్యయేగదా!

ఇక జీవుడు సుషుప్తిలోనికి వెడుతున్నాడు. భౌతిక శరీరాన్ని అంటే దేహాహంభావాన్ని పూర్తిగా మరచి గాఢ నిద్రా పరవశుడవుతున్నాడు. ఇంద్రియజ్ఞానం పూర్తిగా నశిస్తోంది. చెప్పండి, జాగ్రదవస్థలోనిది సుఖమా? సుషుప్త్యవస్థలోనిది సుఖమా? అసలు సుఖం అంటే ఏమిటి? 'ఖం బ్రహ్మ'. సుఖం బ్రహ్మపదార్థం. అది ప్రారంభంలో భౌతిక శరీరాన్నతిక్రమించినప్పుడు మాత్రమే జీవునకు లభిస్తుంది. తదుపరి భౌతికశరీరం ఏ కర్మచేస్తుతోన్నా జీవుడు బ్రహ్మానందంలోనే లీనమై ఉంటాడు.

శరీరాన్ని తుచ్ఛంగా భావిస్తూ, ఏకాదశేంద్రియ వ్యాపారాలను నిరోధిస్తూ జీవుడు క్రమంగా మనసును ఆత్మ సమీపానికి తీసికొనిపోవాలి.

శ్లో॥ శనైః శ్శనై రుపరమే బుద్ధ్యా ధృతి గృహీతయా,
ఆత్మ సంస్థం మనః కృత్వా నకించి దపి చింతయేత్॥
(భగవద్గీత, అ6-శ్లో25)

ఆలోచించాలి, ఈ భౌతికశరీరం వస్తుస్థితిలో ఎటువంటిది ? సుఖ మెక్కడుంది ? సగుణ, సాకారమంటే ఏమిటి ? నిర్గుణ, నిరాకారమంటే ఏమిటి ? గోపాలుడు ఎట్లా ఉంటాడు? కృష్ణలీలల రహస్య మేమిటి ? ఈ అన్ని ప్రశ్నలకు సరైన సమాధానాలు అప్పుడుమాత్రమే లభిస్తాయి, అహంకార - మమకార రహితమైన బుద్ధిలో లభిస్తాయి, సత్త్వరజస్తమో గుణాలను అతిక్రమించినప్పుడు లభిస్తాయి.

ప్రశ్నలకు సమాధానాలు లభించి, ఈ జీవుని ఇంక నిరంతరం ఏడిపిస్తాయి. "దుర్లభమైన మానవశరీరంతో ఇంత వరకేమి చేశాను? ఇక ముందు ఏంచేయాలి ?" ఈ విరహ తాపంలో మనోవాక్కాయాలు నిరంతరం తపింపబడతాయి. అప్పుడు సగుణ సాకారావశ్యకత ఉండదు - నిర్గుణ నిరాకారావశ్యకత ఉండదు. ఆ స్థితిలో సగుణ సాకారం - నిర్గుణ నిరాకారం రెండూ ఉంటాయి. రెండింటికి అతీతమైన తత్త్వం కూడా ఉంటుంది.

అనుభవం శ్యామరూపంలో-రసరూపంలో ఉంటుంది.
"రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి."
(తైత్తిరీయోపనిషత్)

రసం పూర్ణబ్రహ్మ. రాసవిహారి పూర్ణబ్రహ్మ, రసధార రాసలీల. రాధాకృష్ణులు రససాగరాలు. ఈ గోపికలు తదంశలు. ఆ ఆ అనుభంలో చివరకు అనుభవం ఉండదు, అనుభవించేవాడు అసలే ఉండడు. చివరకొక్కటి మాత్రమే శేషిస్తుంది. "రసోవైసః."

గోపికలు విరహతాపంలో తపిస్తున్నారు, అశ్రువర్షం కురిపిస్తున్నారు. అయినా వారికి దుఃఖం లేనేలేదు. కారణం ఈ దేహమే నేననే భావం వారికి లేనేలేదు, వారికి దేహమే లేదు. వారందరు భగవద్ధర్మాపన్నలు - భగవత్స్వరూప కలితలు. ఇదే విరహలీల. ఎంత అద్భుతం ? ఎంత అమృతం ?!

శాంత, దాస్య, సఖ్య, వాత్సల్యాల పరాకాష్ఠ స్వరూపం మధురరసం. తక్కిన నాల్గింటిని పరిపూర్ణంగా తనలోనికి సంగ్రహించుకొనేది మధురరసం. ఇది త్రిగుణాతీతం-త్రిశరీరాతీతం. విరహం మధుర రసానికి ముఖం వంటిది. మిళనం గౌణం, విరహమే మధురానికి ప్రాణం. ఎందులో అశ్రుపతన మవుతుందో అదే శ్రేష్ఠరసం. జీవుడు సుఖంలో మృత ప్రాయుడుగా ఉంటాడు, విరహంలో మాత్రమే జీవితుడుగా ఉంటాడు. గోపికలు అశ్రుధారలలో అశ్రుధార లయినారు. అయినా వారికి దుఃఖం లేనేలేదు. వారి దుఃఖం సమస్త జీవులకు సుఖదాయకం. వారు విషయాల నిమిత్తం విలపిస్తున్నారా ? లో వెలుగు నిమిత్తం, రాసవిహారి నిమిత్తం

విలపిస్తున్నారు. తామూ లో వెలుగునకు వెలుగవుతున్నారు. ఆ వెలుగులో సమస్త బ్రహ్మాండాల్ని ప్రయాణింప చేస్తున్నారు. అశ్రువులు వర్షించక పోతే ఈ ప్రక్రియ ఎట్లా సాధ్యం? సూర్య భగవానుడు భూమి యందలి జలాన్ని గ్రహించి, తదుపరి మేఘాలచే వర్షింప చేస్తాడు. జీవులకు జీవనం జలమే గదా! గోపికల నయనాశ్రువులే ఈ బ్రహ్మాండస్థ జీవులకు జీవనం. ఇదెంత సౌభాగ్యవిషయం!

లోననే ఉన్నవానికై విరహం. విరహంతో రస సామ్రాజ్యానికి, అంతర్ముఖావస్థకు ప్రయాణం. "గోపాలా! ఎక్కడున్నావు?" విలపిస్తూ గోపికలు వనాలన్నీ తిరుగుతున్నారు. లోన తిరుగుతున్నారో, వనాలలో తిరుగుతున్నారో, మదనగోపాలుని లోన చూస్తున్నారో, బయట చూస్తున్నారో, లేక లోన, బయట అంతటా చూస్తున్నారో ఊహించి చెప్పండి చూద్దాం.

గుర్తుంచుకోండి. మధురం సుషుప్త్యావస్థ - విరహం జాగ్రదవస్థ. గోపికలు దివ్యజాగ్రతలో విలపిస్తున్నారు; వినోదిస్తున్నారు.

గోపికలు విరహాగ్ని సంతప్తలా? అయితే కృష్ణలీలానుకరణం - రసాస్వాదనం - రసవితరణం ఎట్లా సాధ్యం? నిరంతర నిగ్రహంలో గోపికల ప్రాణవాయువు ఘోర సంక్షో

భానికి గురియైనది. ఆ ప్రాణవాయువు నందుండి ఆయువును వృద్ధి చేయుచున్న మదనగోపాలుడు ఘోర సంక్షోభానికి గురియైనాడు. ఏమిటి అశ్రుప్రవాహంలో సుఖశ్వాస తీసికొని ఇంద్రియాల కొకింత బంధవిముక్తిని కలిగించటం దోషమా? అశ్వసంచాలకుడు అశ్వాన్ని సచేతనం చేయటానికి కొరడాతో కొట్టి హింసిస్తాడు. అయితే మరల లాలించి పచ్చిగడ్డి వేసి ప్రేమిస్తాడు. గోపికలు ప్రియుని సాహచర్యాన్ని పొందటానికై, ఇంద్రియాలను ప్రియుని రూపం ఇవ్వటానికై ఏకాదశేంద్రియాలను నిగ్రహించారు. ఫలితంగా ప్రపంచమే శ్యామస్వరూపమయింది. చెప్పండి, వారేద్చుట దోషమా? గుణమా?

| ప్రధాన గోపికలు. | దేహ వర్ణాలు. | వారి సేవలు. |
|---|---|---|
| (1) శ్రీలలిత | గోరోచనం | తాంబూలం |
| (2) శ్రీవిశాఖ | విద్యుద్వర్ణం | కర్పూర సమర్పణ |
| (3) శ్రీచిత్ర | కేశరవర్ణం | వస్త్రసేవ |
| (4) శ్రీఇందులేఖ | హరితాళవర్ణం | నృత్యసేవ |
| (5) శ్రీచంపకలత | చంపాపుష్పవర్ణం | చామరసేవ |
| (7) శ్రీరంగదేవి | కేసరవర్ణం | అలక్తకం |
| (7) శ్రీతుంగవిద్య | కర్పూరకేసరం | నానావాద్యాలు |
| (8) శ్రీసుదేవి | తప్తస్వర్ణం | జలసేవ |

గోపికలలోని ఒక ఉన్నతశ్రేణి 'మంజరి'.

(1) శ్రీరూపమంజరి గోరోచనవర్ణం తాంబూలం
(2) శ్రీమంజులీలా మంజరి తప్తస్వర్ణవర్ణం వస్త్రసేవ
(3) శ్రీరసమంజరి చంపాపుష్పవర్ణం చిత్రసేవ
(4) శ్రీరతిమంజరి విద్యుద్వర్ణం చరణసేవ
(5) శ్రీగుణమంజరి విద్యుద్వర్ణం జలసేవ
(6) శ్రీవిలాసమంజరి స్వర్ణ కేతకీవర్ణం అంజనసేవ
(7) శ్రీలవంగమంజరి విద్యుద్వర్ణం మాలాసేవ
(8) శ్రీకస్తూరీమంజరి స్వర్ణవర్ణం చందనసేవ

శ్లో॥ జన్మకర్మచ మేదివ్య మేవం యోవేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥
(భగవద్గీత. అ 4 – శ్లో 9)

"భగవానుని జన్మకర్మములు దివ్యములు, అనుభవ పూర్వకముగా వాని నెవడు గ్రహిస్తాడో వానికి మరల జన్మ లేదు. వాడు నిస్సంశయంగా భగవదీయు డవుతాడు."

శ్రీకృష్ణలీలలు లోకోత్తరాలు, మనోవాకాయ సీమలకు అతీతాలు. ఆ గోపాలుడే కృపాపరవశుడై, తన లీలల్ని అంటే తన యదార్థ స్వరూపాన్ని ఈ జీవి మనోవాకాయాలలో అనుభూత మయేలా అనుగ్రహిస్తాడు. అందు వలన ఆ సర్వాంతర్యామి అనుగ్రహానికి మించింది లేనే లేదు.

జీవుడు ఒకే ఒక్క పని చేయాలి. ఆ అనుగ్రహం నిమిత్తం విశుద్ధ భావంతో నిరంతరం విలపించాలి.

భగవన్మయాలై, రసనిధానాలయిన ఆ దివ్యలీలల్ని నిరంతరం తన భౌతిక నేత్రాలముందు చూడాలి. సమస్త ప్రపంచం ఆ లీలారసంతో ఆర్ద్రమయినట్లుగా అనుభవం కలగాలి. ఈ భౌతిక నేత్రాలతో భౌతిక ప్రపంచంలో ఈ నాడు కన్నయ్యను చూడాలి, కంసుని చూడాలి, గోవుల్ని, గోపాలుర్ని. గోపికల్ని, చూడాలి, కాళీయ, కేశి, తృణావర్త బకాసుర, అఘాసుర, దుర్యోధనాదుల్ని చూడాలి, నంద యశోదల్ని, పాండవుల్ని చూడాలి. వారందరు నిత్యులు. ఈ నాడు కూడ వారి స్వరూప స్వభావాలు నవనవాయమానంగా అలాగే నిలిచివున్నాయి. వారి యందు మనం మనోవా క్కాయాల్ని లీనం చేయాలి. అప్పుడు మనకు కూడా వారి స్వరూప స్వభాలు వచ్చి తీరుతాయి. మనం కూడా అప్రాకృత భగవల్లీలలలో అప్రాకృత శరీరంతో ప్రవేశిస్తాం. మదనగోపాలుడు మనతో ఈనాడు సమస్తలీలల్ని చేస్తాడు.

అప్పుడు ఈ జగమే బృందావనం అవుతుంది. ప్రతి ఇసుక రేణువు మదనగోపాలుని రూపంగానే సాక్షాత్కరిస్తుంది. అసలు మదనగోపాలునికి భిన్నమైన నామరూపాలు లేనేలేవు గదా ? ఉన్నది ఒకటే రసరూపం. "అసలు వస్తువు – తత్త్వం ఒకటే. దానిపై రామరూపాన్ని ఆరోపించుకొంటావో – శ్యామరూపాన్ని ఆరోపించుకొంటావో,

నదీ, పర్వత, వృక్ష, పక్షి, మనుష్య రూపాల్ని ఆరోపించు కొంటావో, ఎట్టి రూపాన్ని ఆరోపించుకొంటావో, నరుడా ! నీ ఇష్టం" అంటున్నది శ్రుతిమాత, ఆ శ్యామరూపాన్ని అంతటా చూడాలి. అన్నింటి యందు శ్యాము డున్నాడు. శ్యామరూపం లేదంటే ఏ నామరూపాలు లేవు. కాన స్వహృదయంలో శ్యాముని చూడాలి, అందరి హృదయాలలో శ్యాముని చూడాలి. అదిగో చూడండి. అది ఏమి శ్యామ రూపం ! అదెంత రసవత్తర విరహాలీల !!

శ్లో॥ సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః,
భూతాని భగవ త్యాత్మ న్యేష భాగవతో త్తమః॥
(శ్రీమద్భాగవతం. స్కం 11 - అ 2 - శ్లో 45)

"భాగవతో త్తము డెవడు ? సర్వభూతాల్ని భగవ ద్రూపంగా - ఆత్మ రూపంగా చూసేవాడు మాత్రమే."

సృష్టిని సంస్కరించ నవసరం లేదు, సంస్కరించ వలసింది దృష్టిని మాత్రమే. ముందు వ్యక్తిలోనికి గోపాలుడు రావాలి, ఆ గోపాలుడే తరువాత సమస్త బ్రహ్మాండాలలోకి వస్తాడు. ఎక్కడ నుంచో రావటానికి ఆ గోపాలుడు ఇక్కడ, ఇప్పుడు లేకపోలేదు గదా ! "ఇందు గలడందు లేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన అందందే కలడు దానవాగ్రణి వింటే." ఆ ప్రహ్లాద వచనం ఎంత సరసమో, ఎంత అనుభవ పూర్ణమో

అనుభవజ్ఞులు తక్క అన్యులెట్లు తెలిసికోనగలరు ?

గోపికలు భగవద్రూపాన్ని, భగవద్ధర్మాన్ని పొందుతున్నారు. ఒక గోపిక పూతన. అయితే కృష్ణుడు మరొక గోపిక. ఇది ప్రథమ యుగళం. ఒక గోపిక బాలకృష్ణుడు - అయితే వేరొక గోపిక శకటం. ఇది ద్వితీయ యుగళం. రింగణాభినయం చేసే మరిరువురు గోపికలు త్రిగుణాతీతలు. ఇది తృతీయ యుగళం.

శ్లో॥ దైత్యాయిత్వా జహారాన్యా మేకా కృష్ణార్భ భావనామ్,
రింగయామాస కాప్యంఘ్రీ కర్షంతీ ఘోషనిస్వనైః.

శ్లో॥ కృష్ణ రామాయితే ద్వేతు గోపాయంత్యశ్చ కాశ్చన,
వత్సాయంతీం హంతి చాన్యా తత్రైకాతు బకాయతీమ్,

శ్లో॥ కస్యాశ్చిత్పూతనాయంత్యాః కృష్ణాయంత్యపిబత్స్తనం,
తోకాయిత్వా రుదంత్యన్యా పదాఽహన్ శకటాయతీమ్॥

(శ్రీమద్భాగవతం, స్కం.10-అ30-శ్లో15-16-17)

ఇంక బృందావన లీలలోకి పోదాం రండి.

శ్లో॥ ఆహూయ దూరగా యద్వత్ కృష్ణస్త మనువర్తతీమ్,
వేణుం క్వణంతీం క్రీడంతీ మన్యాః శంసంతి సాధ్వితి.

శ్లో॥ కస్యాం చిత్స్వభుజం న్యస్య చలంత్యాహాపరా అను,
కృష్ణోహం పశ్యత గతిం లలితా మితి తన్మనాః,
శ్లో॥ మాభైష్ట వాత వర్షాభ్యాం తత్త్రాణం విహితం
మయా,
ఇత్యుక్త్వైకేన హస్తేన యతంత్యున్నిదధేంఽబరమ్॥
(శ్రీమద్భాగవతం, స్కం.10-అ30-శ్లో 18-19-20 )

"కృష్ణ రామాయితే ద్వేతు............"

"ఇరువురు గోపికలు కృష్ణ బలరాము లవుతున్నారు. కొందరు గోపికలు గోపబాలురు, మరికొందరు గోపికలు, ఆవు దూడలు అవుతున్నారు. ఒక గోపిక వత్సాసుర వేషం ధరించిన గోపికను వధించటానికి పరుగిడుతోంది. మరొక గోపిక బకాసుర వేషం ధరించిన గోపికను వధించటంలో లగ్నమై యుంది."

భావ మెట్టిదో దృష్టి అనుభవం కూడా అలాగే ఉంటాయి, అనుభవం ఎలా ఉంటుందో స్వరూపం అలా ఉంటుంది. స్వస్వరూపం ఎలా ఉంటుందో విశ్వస్వరూపం అలా ఉంటుంద. ఈ విశ్వం స్వస్వరూపంలో ఒక భాగం.

శ్లో॥ విశ్వం దర్పణ దృశ్యమాన నగరీమ్
తుల్యం నిజాంతర్గతమ్॥
(శ్రీదక్షిణామూర్తి స్తోత్రం)

ఈ విశ్వం యొక్క బాహ్యస్వరూపం అద్దంలో చూచే దృశ్యం వంటిది. నిస్సంశయంగా ఇది సినిమా. ఈ స్థూలాన్ని

సూక్ష్మం చేసికొన్నప్పుడే రసం ప్రవాహరూప మవుతుంది. మనసును సూక్ష్మంచేస్తే ప్రపంచం సహజంగానే సూక్ష్మ మవుతుంది. ఆత్మలో ఏతద్భిన్నంగా దివ్య ప్రపంచ ముంది. అది మదనగోపాల స్వరూపం. ఆ ప్రపంచంలో వినోదించ టానికై విలపించే ఏకాదశేంద్రియాలు మదనగోపాల స్వరూపం. ఇంక సమస్త వ్రజభూమి - సమస్తమర్త్యభూమి మదనగోపాల స్వరూపం - రసస్వరూపం ఏల కాదు? "వృక్షే వృక్షే వేణుధారీ పత్రే పత్రే చతుర్భుజః". ప్రతి వృక్షము వేణుగోపాల స్వరూపమే, ప్రతి ఆకు చతుర్భుజుడే. ఇలా అనంత రూపాలలో అనంతునిరూపం అఖండ రసాలంగా అవ తరించకపోతే రసాస్వాదన కెక్కడిది పరిపూర్ణత ? లేనేలేదు. ఎటు చూసినా - చూడకున్నా - చూపులో మరియు లో చూపులో శ్యామవర్ణమే - మందహాసమే - మురళీ గానమే. ఇది అక్షరశః అనుభవ సత్యం. మధురమిళనంలో సాహ చర్యం ఒక్క రూపంతోనే. విరహంలో? స్థాన స్థానీయ అనంతకోటి మదనగోపాల రూపాలతో సాహచర్యం. ఇది యోగాలకు యోగం, బ్రహ్మజ్ఞానానికి జ్ఞానం, బ్రహ్మానందా నికి ఆనందం. ఇది త్రిగుణాతీతమైన అప్రాకృత త్రిగుణాత్మక విశుద్ధ రసవాహిని. ఈ రసాస్వాదనం సమస్త జడచేతనాలకు అనివార్య ధర్మం. కనులు తెరవండి. భౌతికశరీరమే నేననే భావాన్ని సంహరించండి. నేనును వధించండి. 'నేను నీదాసనే'

అనే ప్రేమభావంతో హృదయేశ్వరుని సన్నిధికి నడవండి. హృదయ పాత్రను చేబూని, అశ్రుధారలలో ప్రవహించండి. చాలును. మదనగోపాలుడు ఆ హృదయపాత్రలో ప్రవహించి తీరుతాడు. ఆ స్థితిలో ప్రేమికుడు ఒకప్పుడు సుఖివలె నవ్వుతాడు, మరొకప్పుడు దుఃఖివలె ఏడుస్తాడు. ఏదో విశిష్టవస్తు ప్రాప్తిలో నవ్వుతూ, అప్రాప్తిలో ఏడుస్తున్నాడంటావా? అనకూడదు. వారికి ప్రాప్తి - అప్రాప్తులు లేనేలేవు. మిళనము నందు ఏది ప్రాప్తిస్తోందో అదే విరహంలో సమస్త విశ్వస్వరూపంగా ప్రకట మవుతోంది. విరహంలో అప్రాప్తి-దుఃఖం - అదర్శనం లేనేలేవు. అనుసంధానం లేకపోతే ప్రకటమైనున్న వస్తువు కూడా ప్రాప్తించదు. ప్రాప్తికి యథార్థమైన అర్థం తన్మయత. తాను వేరుగానుండి బాహ్యమునుండి వస్తువును పొందటం ఏమి పొందటం? ఆ లక్ష్య స్వరూపాన్నే పొందాలి. దీన్ని 'భ్రమర కీటక న్యాయ' మంటారు. ఒకటే మాట! విహ్వాలత వలన తన్మయత్వం సిద్ధిస్తుంది. తన్మయత్వంలో కూడా విలాప ముంటుంది. విహ్వాలత అంటే ఏమిటి? చంద్రునికై చకోరం విహ్వాలం. వర్షబిందువులకై మయూరం విహ్వాలం. అగ్నికై పతంగం విహ్వాలం. ఆకొన్నవాడు అన్నానికి - కాముకుడు కామినికి - లోభి ధనానికి విహ్వాలుడు ఇవి భౌతిక దృష్టాంతాలు. అసలు రసరాజ్య విషయాలకు ఉపమానాలనేవి ఉండనే ఉండవు. వివశతలో అశ్రుధారల్ని ప్రవహింపచేసేదే విహ్వాలత, త్రికరణాల్ని రసీభవింపచేసే

విహ్వాలత, భౌతిక సుఖదుఃఖాలకు అతీతమైన రసరాజ్యంలో జీవుని ప్రయాణింపచేసేదే విహ్వాలత. అట్టి ప్రయాణంలో చివరకు అశ్రుపాతం కూడా అసంభవం.

శ్లో. ఏవం వ్రతః స్వప్రియ నామకీర్త్యా
జాతానురాగో ద్రుతచిత్త ఉచ్చైః
హసత్యథో రోదితి రౌతిగాయ
త్యున్మాద వన్నృత్యతి లోకబాహ్యః''
(శ్రీ మద్భాగవతం.)

అనురాగ పూర్వక నామసంకీర్తనలో చిత్తం చిత్తచోరునియందు ప్రవహిస్తోంది. మనసు లేదు — శరీరధర్మాలు లేవు. ఇక ఏముంటాయి ? హాసనం - రోదనం - గానం - నర్తనం - లోకబాహ్యత - ఇంద్రియాతీత స్థితి. ఉన్మాదునివలె అభినయం. ఉన్మాదావస్థను దర్శించాలంటే శ్రీ రాధారాణి దర్బారుకు పోవాలి. శ్రీ రాధారాణి సదా దివ్యోన్మాదమయి.

శ్లో. అశ్రూణా మతివృష్టిభిర్ ద్విగుణయం
త్యర్కాత్మజా నిర్ఝరమ్,
జ్యోత్స్నాస్యంది విధూపల ప్రతికృతి-
చ్ఛాయం వపుర్బిభ్రతీ,
కంఠాంతస్త్రుటి దక్షరాద్య, పులకై
ర్లబ్ధ్వా కదంబాకృతిమ్,
రాధా వేణుధరః ప్రవాత కదళీ
తుల్యాక్వచి ద్వర్తతే॥
(శ్రీరూప గోస్వామి.)

గోపాలునితో గోపిక చెప్తోంది; "శ్రీరాధారాణి అత్యంత విరహవిహ్వల. ఆమెనయనాలు అశ్రువుల్ని ప్రవహింపచేస్తున్నాయి. దానిచే యమునా ప్రవాహం ద్విగుణిత మయింది. శరీరంనుండి చెమటలు ధారలవుతున్నాయి. చంద్ర కాంత మణి రాత్రియందు రసగతినిపొంది వర్షరూపమయిందేమో! శరీరం చంద్రకాంతమణికివలె జడతుల్యం. శరీరం కూడా పసుపుపచ్చని రంగుతోవుంది. కంఠం ఆగి- ఆగి పలుకు తోంది. సర్వాంగాలు కదంబకేసరానికివలె పులకిస్తున్నాయి. భయంకర అంధకారం- వాయు విజృంభణ- వర్షపాతం. ఇట్టి స్థితిలో అరటిచెట్టు ఎట్లా ఉంటుంది? శ్రీరాధారాణి స్థితికూడ అలాగే ఉంది."

ప్రేమపారవశ్యం ఎలా ఉంటుందో ప్రహ్లాదుని ముఖార విందమధువును గ్రోలండి.

శ్లో. యదాగ్రహగ్రస్త ఇవక్వచిద్ధసత్యాక్రందతే,
ధ్యాయతివందతే జనమ్,
ముహుఃశ్వసన్వక్తిహరే జగత్పతే నారాయణేో,
త్యాత్మమతిర్గతత్రపః,
తదాపుమాన్ ముక్త సమస్త బంధన,
స్తద్భావభావాను కృతాశయాకృతిః,
నిర్దగ్ధబీజానుశయో మహీయసా,
భక్తిప్రయోగేణ సమేత్యధోక్షజమ్.
(శ్రీమద్భాగవతం. స్కం. 7 అ 7 శ్లో 35-36.)

"అన్నిబంధాలనుండి ముక్తుడైన మానవుడు ఎట్టి స్థితిలో ఉంటాడు ? ఉన్మాదునివలె, భూతగ్రహగ్రస్తునివలె ఒకప్పుడు నవ్వుతాడు, మరొకప్పుడు ఏడుస్తాడు, ఒకప్పుడు ధ్యానంచేస్తాడు, మరొకప్పుడు తన కనులముందున్న ప్రతి వస్తువునకు నమస్కరిస్తాడు. "హరే! జగత్పతే !! నారాయణా !!!" యని ఆర్తుడై, విలపిస్తాడు. బుద్ధి భగవానుని యందుండటంవలన లోకలజ్జాహీనుడౌతాడు. నిరంతరం భగవద్భావం నిల్చియుండటంవలన భగవత్స్వరూపుడవుతాడు. ఇంక అంతఃకరణంలో ఏవిధమైన కర్మబీజాలు శేషించవు. జీవుడు శాశ్వతంగా భగవంతుని వాడు కావాలంటే ఇట్టి ఉత్తమాభక్తి ఒక్కటి మాత్రమే ఉండాలి."

ఎంత ఆనందం ! ఎంత ఆనందం !! ఎక్కడిదా ఆనందం ? నామరూపాలు లేకపోతే అనందం ఎట్లావస్తుంది ? మనల్ని పతనంనుండి రక్షించేవాడు దేవుడుకాడు; ఆ నామరూప చింతనమాత్రమే రక్షిస్తుంది. భగవానుడు ప్రక్కనే వున్నాడు, యాదవులకు నాశనం తప్పిందా ? భగవానుడు దూతగావచ్చి ఎంతో నచ్చచెప్పాడు. దుర్యోధనుడు దారికి వచ్చాడా ? లేదు. జీవుల్ని ఆ నామరూపచింతనమాత్రమే పతనాన్నుండి రక్షిస్తుంది. ఆ సుమధురనామమే సర్వదుఃఖాల్ని దొంగిలిస్తుంది. ఆ సచ్చిదానందస్వరూపం తనని చిం

తించేవారికి సదా స్వాధీనమై వుంటుంది. క్రమంగా జీవులు కూడా సచ్చిదానందస్వరూపులవుతారు. కాన మనం ప్రేమించ వలసింది గోపాలుని కాదు, ఆ నామరూపాల్ని మాత్రమే.

ఇంద్రియాలు గోవులు, వానిని పాలించేవాడు వేణు గోపాలుడు. వృత్తులు గోపికలు. వారితో నాట్యంచేసేవాడు ఆత్మస్వరూపుడు మదనగోపాలుడు. 'గోపాలా!' ఎంతసుందర నామం! ఎంత సుందరభావం!!

ఒక్క వాక్కునుండేగాదు, సమస్తేంద్రియాలనుండి ఒకటే నినాదం గోపాలా! గోపాలా !! గోపాలా !!! ఇదే వేణుగానం. ఇదే లలితమధుర ప్రవాహం.

గోపికలకు ఇంద్రియజ్ఞానం నశించింది, ప్రళయం వచ్చింది. "సఖిలుగోపికానందనో భవా నఖిలదేహినా మంత రాత్మ దృక్." (శ్రీమద్భాగవతం.) ఆ గోపికల హృదయంలో శ్యాముడున్నాడు. రోమరోమంలో శ్యాముడున్నాడు. ఆ శ్యాముని రోమరోమంనుండి ఒకటే వేణుగానం. గోపాలా ! గోపాలా!! గోపాలా!!! సమస్త ప్రపంచంలో శ్యాము డున్నాడు. గోపికల కారణంగా సమస్తప్రపంచం విరహ విహ్వలం. అందుండి వేణుగానమే వేణుగానం. గోపాలా ! గోపాలా !! గోపాలా!!!

ఏమిటి ఆగోపాలుని విశిష్టత. ఆతడు వేణుగోపాలుడు, సామాన్యుడుకాడు. మరియు ఆతడు మదనగోపాలుడు. వేణు

వాతని పట్టమహిషి. ఆమె కీ గోపాలుని అధరములు మెత్తని దిండ్లు. కరములు దాసీజనము. నేత్రములు మాతాపితరులు. కనురెప్పలు చామరములు. ముక్కుపుడక ఛత్రము. నవ రంధ్రశరీరమే ఆ వేణువు. వేణువునకు- గోపాలునకు కళ్యాణము జరిగింది- జరిగితీరాలి.

గోపికలు మృతతుల్యలు. రాత్రి నలుపు, భావం నలుపు, నయనాలు నలుపు, నయనాశ్రువులు నలుపు. ఇంక అందులోవుండే గోపాలుడు నల్లనివాడైతే ఆశ్చర్యమేముంది!

గోపికలకు మురళీ ఎడల అసూయ. అందువలన గోపికలు చంచలలు. క్రమంగా ఉన్మాదాభినయం, విహ్వలత, పరిభ్రమణం, చివరకు నిద్ర, సుషుప్తి, కొంత, కొంత బోధ, అందులో రతి.

"నేను నీదాననే - నేను నీ దాననే." ఇది గోపికా జీవన మంత్రం, జీవితేశ్వరుని వశం చేసే మహామంత్రం. గోపికలు జీవితేశ్వరుని యందే జీవిస్తున్నారు, వేణుగానమే వారికి జీవనరసం.

ప్రియుడు విశ్వరూపంలో మందహాసం చేస్తున్నాడు, గోపికలను అతి నిర్దయగా హింసిస్తున్నాడు, విరహ విహ్వాలలను చేస్తున్నాడు. ఫలితంగా విరహంలో విశ్వం విహ్వాల మవుతోంది.

మనోవాక్కాయాలు త్రికరణాల కావల వుండి క్రియ చెప్పడకా నవ్వుతూనే వుంటాడు. త్రికరణాలు విశుద్ధమయే నిమిత్తం విలపించవలసింది గోపికలు మాత్రమే. ఆతని మంద హాసం ఈ గోపికల నెంత హింసిస్తుందో ?

ఇప్పుడు విహ్వాల విశ్వం పరిపూర్ణంగా మదనగోపాల రూపాన్ని పొందింది. ఒక్కొక్క గోపికకు ఒక్కొక్క గోపాలుడు. జడచేతనాత్మక సమస్త ప్రకృతి, గోపికా స్వరూపమై రాసవిహారి మదనగోపాలునితో క్రీడిస్తోందన్న మాట. "అంగనా మంగనా మంతరే మాధవం మాధవం మాధవం చాంతరే చాంగనా." వినోద సమయంలో విశ్వం గోపికారూపమై వుంటుంది. హృదయంలోని అనుభం మదన గోపాలరూపంగా వుంటుంది. "యథార్భకః స్వప్రతిబింబ విభ్రమః." ఆ గోపాలుడు ఎవరితో క్రీడిస్తున్నాడు ? తన ఛాయారూపిణులైన గోపికలతో క్రీడిస్తున్నాడు.

శ్లో॥ తన్మనస్కా స్తదాలాపా స్తద్విచేష్టా స్తదాత్మికాః,
తద్గుణా నేవగాయంత్యో నాత్మాగారాని సస్మరుః॥
(శ్రీమద్భాగవతం. స్కం 10-అ 30 - శ్లో 43)

గోపికల మనసు గోపాలునందు ఇల్లు కట్టుకొంది, గోపాలుడే వారి ఆలాపమయినాడు. శరీరం అతీంద్రియస్థితిలో కృష్ణలీలానుకరణం చేసింది. గోపికలు గోపాలుని యందే జీవితలు, సంపూర్ణంగా గోపాల స్వరూపిణులు అథవా

శ్రీ రాధారాణి స్వరూపిణులు. ఇది నిస్సంశయంగా వాస్తవం. వారు సంపూర్ణంగా విహ్వాలలు, గోపాల గుణగాయికలు.

ఆ కుంజం గోపాలుడు, సమస్త బృందావనం గోపాలుడు, గగనం గోపాలుడు - భూమండలం గోపాలుడు, అన్ని వస్తువులలో గోపాలుడు, అన్నివస్తువులు గోపాలుడు, సూర్య చంద్రప్రకాశం గోపాలుడు, గోపాలుడు శ్యాముడు, బృందావనం శ్యామం, సమస్త ప్రపంచం శ్యామం, కేకి కంఠం శ్యామం, అక్షరాలు శ్యామం, ఈ భాగవత రసాక్షరాలు శ్యామం, సమ్మోహనశక్తి శ్యామం. రాసలీలను ప్రవర్తింపచేసే శక్తి శ్యామం, ఆ 'చర్షణీ' ప్రభృతి భగవదభిన్న శక్తులు శ్యామం. ఎక్కడ, ఏ దిశగానైన చూడండి, శ్యామవర్ణమే శ్యామ వర్ణం.

భాగవతం ప్రేమరసాలం. అందలి మాధుర్యం ఎట్లా అనుభవంలోకి వస్తుంది ? మనోవాక్కాయాలు విహ్వాలాలు కావాలి, ఆకలి కళ్ళల్లో ప్రకటం కావాలి, జీవుడు పరవశించి, ప్రవహించాలి. అప్పుడే భాగవతంలోని రసం ఈ త్రికరణాలలో ప్రవహిస్తుంది.

శ్యామ్ శ్యామ్ రటత్ రాధే ఆపుహి శ్యామ్ భయీ,
పూఛతి ఫిర్ అపనీ సఖియన్ సో ప్యారీ కహా గయీ,
బృందావన్ వీథిని యమునా తట్ శ్రీరాధే రాధే రాధే,
చతుర సఖీ యహదశా దేఖికే రహీ సకల్ మానసాధే,

గరు ఈ ప్రీతి కహోనకరాపై క్యోన హోయి గతి ఐసీ,
కహా భగవాన్ హితరామరాయ ప్రభులగన్ లగ్నై తో ఐసీ॥
(సంత్ శ్రీరామరాయజీ)

"శ్యామా ! శ్యామగోపాలా !! మదనగోపాలా !!! ఈ విహ్వలత శ్రీరాధారాణికి శ్యామరూపాన్నే పారిలౌకికం చేసింది. ఆమె తన చెలియల్ని ప్రశ్నిస్తోంది. "నా ప్రాణప్రియుడెక్కడ ? ఎక్కడ నా ప్రాణప్రియ ?" బృందావన వీథులు "రాధే - రాధే - రాధే" ఈ వీణా నినాదిత స్వరలహరిలో పరవశించి, ప్రవహిస్తున్నాయి. చతురలైన చెలియలకేనా పారవశ్యం లేనిది ? చెప్పాలా ! వారు కూడా ప్రవహించారు.

ఉద్ధవుడా ప్రవాహ తీరస్థుడు. గోపికలకు జ్ఞానోపదేశం చేయాలని వచ్చాడు. ఇంతలో గోపికల మరొక ప్రవాహం విజృంభించింది.

శ్యామా శ్యామా సో హోరీ ఖేలత్ ఆజ్ నయీ ।
నందనందన్ కో రాధే కీన్హో మాధవ్ ఆప్ భయీ ।
బాజత్ తాళ్ మృదంగ్ ఝూంఝ్ ఢప్ నాచత్
థేయీ థేయీ ।
గోరే శ్యామ్ సాంవరీ రాధా యా మూరతి చితయీ ।
పలటో రూప్ దేఖి యశుదాకీ సుధిబుధి బిసరిగయీ ।
సూర శ్యామ్ కో వదనవిలోకత్ ఉఘరి గయీ కళయీ॥
(శ్రీసూరదాస్ జీ)

శ్రీరాధారాణి గోపాలునితో నేడు క్రొత్త ఆట ఆడుకోవాలనుకొంటోంది. ఫలితంగా గోపాలునకు తన రూపం యిచ్చింది. గోపాలుని రూపాన్ని తాను పొందింది. గోపాలురు గోపికలయినారు, గోపికలు గోపాలురయినారు. అందరు కలసి ఆనందపులకితులై యశోదారాణి ఇంటికి వెళ్ళారు. ఫాల్గుణ పూర్ణిమ. హోళీ మహోత్సవం. ఎచట చూచినా, దశదిశలందు మంగళ వాద్యాలే. యశోదమ్మ చూచింది. నల్లని గోపాలుడు నేడు బంగారుగోపాలు డయినాడు. బంగారు వన్నెచిన్నెల శ్రీరాధారాణి నల్లని దయింది, శ్యామల అయింది. ఈ రూపపరివర్తన యశోదమ్మ ఇంద్రియ జ్ఞానాన్ని హరించింది. నూరబాసు - యశోదారాణి, ఈ యిరువురు సమ్ముఖాన శ్యామముఖాన్ని చూస్తున్నారు. ఏమి చెప్పాలి ! వీరి శరీరవర్ణం కూడా మారిపోయింది.

ఈ ప్రవాహాన్ని హృదయపాత్రలో నింపుకొని ఉద్ధవుడు ముందుకు కాలు కదిపాడు. మరొక స్థానంలో గోపికల విరహరసం అత్యంత విచిత్రంగా విజృంభించింది.

అది శ్రీరాధారాణి దర్బారు. ఒక గోపిక గోపాలు డయింది. మురళీగానం ప్రవాహమయింది. అది ప్రేక్షకులకు ప్రాణాంతిక వేదనకు హేతువయింది. ఆ చంచల నేత్రాలు గోపికల్ని కుంజలీలలలోనికి ఆహ్వానిస్తున్నాయి. ఆ ప్రేమ మూర్తి ప్రేమకు గోపికలు ద్రవీభూతలు, పరవశలు.

అది శ్యామరస ప్రవాహం. అందులో గోపికలు ఎక్కడున్నారో తెలియటం లేదు. గోపాలుడు మధురంగా నవ్వుతున్నాడు, నవరసాల్ని ప్రవహింప చేస్తున్నాడు. తన కళ్ళను ప్రేయసీ కళ్ళతో కలుపుతున్నాడు. మధుర రసాన్ని ప్రవహింప చేసేవి నయనాలే గదామరి !

ఆ నాలుగు కళ్ళను కళ్ళల్లో నాట్యం చేయిస్తూ ఈ ఉద్ధవుడు ముందుకు కాలు కదిపాడు. మరొక స్థానంలో రస ప్రవాహంలో ఇంకా అత్యంత విచిత్రంగా వుంది.

అది శ్రీరాధారాణి విహారస్థానం. అచట ఒక గోపిక ఉద్ధవరూపంలో స్వామినీ ప్రబోధాన్ని శ్రద్ధగా వింటోంది.

"నేనంటే ఏమిటి ! అసలు నేనెక్కడ వున్నాను ?" ఉద్ధవు డింతకు పూర్వం ఈ ప్రశ్నలో ప్రశ్నారూపంగా వున్నాడు.

ఇప్పుడాతని మనోవాక్కాయాలు ఆ ప్రవాహంలో పరిపూర్ణంగా ప్రవహించాయి. స్వప్రియత్వావశ్యకత లేకుండా చిత్తం చిత్తచోరునిచే హరించబడింది. వాక్కు స్తంభించింది. అపరిమితమైన సుఖంలో మరియు దుఃఖంలో మౌన భాష మాత్రమే ఉంటుంది. ఇంక రాసలీలా రస రాజ్యంలో భాష ఎట్లా ఉంటుంది? వాక్కు మూగవోయింది. మురళీమోహనుని వేణుగానంలో ఎన్ని భాషలో ! చంచల నయనాల్లో ఎన్ని భాషలో !! ఎన్నెన్ని ఆహామాహీలో !!!

ఇప్పు డుద్ధవుడు తన తుచ్ఛశరీరాన్ని తులసీదళంగా మదనగోపాలునకు సమర్పించాడు.

ఆఁ! ఆ ప్రేమరసాలాలు వ్రజబాలలు ఏమన్నారు? ఏమన్నారు?

"పదునాలుగు భువనా లున్నాయి, త్రిమూర్తు లున్నారు. వారిని నిత్యం సాధారణ జీవకోటి సేవిస్తుంటుంది. అందరికన్నా విష్ణుస్థానం అత్యంత విలక్షణ మయింది, ఆ వైకుంఠధామానికి వెళ్ళినవాడు మరల వెనుకకు పోడని, విష్ణురూపు డవుతాడని వేదాలు చెప్పుతున్నాయి. ఆ వైకుంఠ ధామానికి ఆవల నిరంజన జ్యోతి ఉంది. అదే సర్వానికి ఆధారం. త్రిగుణాల్ని - త్రితాపాల్ని హరింపచేసే పరంజ్యోతి అదే. దాని కావల గోలోక ముంది. అచట బలరాముడు, కృష్ణుడు గో, గోప, గోపికలతో నిరంతరం క్రీడిస్తుంటారు. సత్సంగమహిమవలన మాత్రమే జీవి అక్కడకు వెళ్ళగలుగుతాడు. వెళ్ళాక, ఇంక అక్కడి వాడే అయిపోతాడు. క్షరాన్ని అక్షరంగా చూసేవాడు, క్షరాక్షరాల్ని ఆత్మలో చూసేవాడు, చివరకు ఆ క్షరాక్షరాల్ని కూడా అతిక్రమించి ఈ గోలోకానికి వస్తాడు. అచట ఒక అగాధ రూపముంది. అది అఖండ ఆరాధనా ధార. ఆ రూపమే శ్రీరాధారాణి. ఆమె కావల పురుషు డున్నాడు. అతడే ఈ సర్వాన్ని పరివర్తింప చేస్తున్నాడు. కోటి బ్రహ్మలయినా సరే ఆ ప్రేమ తత్త్వం దగ్గర నతమస్తకులు కావలసిందే. ఆపైన రాసవిహారీ

శాసలీలాస్థానముంది. ఏమి చెప్పం? ఎట్లా చెప్పం? ఏమా రాస విహారీవిలాసం! ఏమా రస రంగులు!! ఆ విలాసస్థానం కూడ అణువణువు అటువంటి దే. ఆ తమాషాను చూడవలసిందేగానీ ఎవరూ ఆ ఛాయలకు కూడా వెళ్ళలేరు. అచటకు పక్షుల కలకలరవములు కూడ ప్రవేశింపలేవు. నానావిధ వాద్యము లచే ఆ స్థానం అత్యంత శోభితం.

జోతో నిధివన్ మాహి విరాజై కుంజమహాల్ కే మాహీ।
శ్రీ స్వామీ హరిదాస్ బతాయో కోయీ పహుంచత్
నాహీ॥
సో గురు దేవ కియో నిర్ ధారా హితసే పధియే వాసీ।
లలిత కిశోర ధరో హృదయ్ మే సముఝి కే అకథ
కహానీ॥

(శ్రీ స్వామీ హరిదాస్ జీ)

ఆ రసస్థానమున నిధివనం విరాజమానం. ఒకటేమాట! అచట కెవరును ప్రవేశింపనే లేరు. ఈ రస తత్త్వాన్ని యత్కించిత్ అర్థం చేసికొనాలంటే గుర్వనుగ్రహం ఉండి తీరాలి, గురుముఖంగా మాత్రమే ఈ వచనామృతాన్ని ఆస్వాదించాలి, లలితకిశోరీ శ్రీరాధారాణి రూపాన్ని హృదయంలో నింపుకోవాలి. అప్పుడే దుర్గ్రాహ్యమగు ఈ రస తత్త్వం యత్కించిత్ సుగమ మవుతుంది."

ఉద్ధవు డను కొంటున్నాడు; "నేనా క్షుద్రప్రాకృత జీవిని. ఆ త్రిగుణాతీత రసతత్త్వం నా కెలా అర్థమవుతుంది."

ఆఁ! ఆగోపికలు ఏమన్నారు ?

"ఉద్ధవా! మేమెటువంటిరూపాన్ని చూశామో చెప్పగలవా ?"

"శివసనకాదులు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారు కూడా ధ్యానిస్తారు, యుగయుగాలుగా అన్వేషిస్తారుగానీ ఆ రూపాన్ని దర్శించలేరు. సిద్ధులు దర్బారులో నిత్యం గుణగణాల్ని గానంచేస్తారుగానీ స్వప్నంలోకూడా దర్శించలేరు. చివరకు శ్రుతికూడా స్వయంగా అసఫలమై, ఇలా తీర్మానం చేసింది! "నేతి - నేతి." "ఇదేదీ ఆరూపంకాదు, ఆ రూపం అవాఙ్మానసగోచరం." యోగులు, యతులు భ్రమితులై, రకరకాలవేషాలు వేస్తూ, ఇప్పుడే, ఇక్కడే, ఇదిగో ఈనాడే మేం సచ్చిదానందస్వరూపాన్ని దర్శిస్తామనిచెప్తూ వనాలన్నీ తిరుగుతారు, పాపం! అభాగ్యులు చివరకు నిరాశులుగానే మిగిలిపోతారు. ఉద్ధవా! అట్టిరూపాన్ని మేం మా ఇళ్ళలో నాట్యం చేయించాం. గోపాలా! కొంచెం పెరుగు తినటానికి యిస్తాం. ఇంకొంచెం వెన్నయిస్తాం. మరి ఇంకా కొంతసమయం మాముందు పాడుతూ, ఆడాలి సుమా! ఆ గోపాలుని మేం స్వచ్ఛందంగా శాసించాం. ఉద్ధవా! ఏం చెప్పమన్నావు ?

ఊధో తుమ్ భయే బౌరే, పాతీలేకే ఆయే బౌరే,

యోగ్ కహా రాఖై, యహా రోమ్ రోమ్ శ్యామ్ హై॥

ఉద్ధవా ! నీవెంతో కష్టించి, పాపం ! ఇక్కడక్కు వచ్చావు. మా రోమరోమము శ్యామమయమై వుండగా నీ యోగాన్ని నిలువచేసికొనటానికి మాలో స్థానమెక్కడిది ?

బృందావన్ కే దో ఊ రాజా శ్యామ్ రాధికారాణీ।
చారి పదార్థ్ కరత్ మజూరీ ముక్తి భరై
జహా పానీ ॥
కర్మ ధర్మ్ దో ఊ బటత్ జేవరీ ఘుర్ ఛావై
బ్రహ్మనీ !
యోగీ యతీ తపీ సంన్యాసీ తినహూ నేక్ నజానీ ॥
పచిహారే వేదపురాణ్ లగనియా గావత్
సగునియా వానీ ।
ఘుర్ ఘుర్ ప్రేమభక్తికీ మహిమా సహచరి వ్యాస్
బఖానీ ॥

బృందావనానికి గోపాలుడు-శ్రీరాధ రాజారాణులు. యోగులు - యతులు వారిస్వభావ రహస్యాన్నింత వరకు తెలిసికొనలేదు, వేదపురాణాలు వారి గుణగణాల్ని గానం చేసి - చేసి విసివిపోయాయి. వారి నిత్యలీలాధామం బృందావనంలో ఉండేవారిని ధర్మార్థకామమోక్షాలు నాలుగు నిరంతరం సేవిస్తున్నాయి. ఏఇంటచూచినా ప్రేమభక్తియొక్క లోకోత్తర మధురవిలాసమే.

చెప్పు, ఉద్ధవా ! నీ ఉపదేశాల్ని మేమెట్లా విన్నగలం?

ఉద్ధవుడు అనుకొంటున్నాడు; "నిస్సంశయంగా ఆగోపి
। శుద్ధ సత్త్వస్వరూపిణులు, భగవద్ధర్మకలితలు. నాకు
ార్యలు, వారి కృపాలేశమాత్రాన ఈనాటికి నేను సగుణ
ారవైభవాన్ని, మాధుర్యాన్ని పరిపూర్ణంగా ఆస్వాదించ
ానను. ఇందులో సంశయమేముంది, నిస్సంశయంగా వారు
ు ఆచార్యులు."

) యోగ్ జపమాలా తజి గోముఖీ సుమాలా తజి,
మృగఛాలా ప్రేమప్యాలాతై భలేభయే॥
కహై పద్మాకర్ విరాగ్‌తజి తాహీ భాంతి
పూరే అనురాగహీమే ఫూలే అరు ఫలేగయే॥

(2) గ్యాన్ తజి ధ్యాన్‌తజి నేమ్ కే విధాన్ తజి
మీఠేమంత్ర్ మారగ్ మే గమన్ భలేగయే
మోహన్ కేమీత్ ఊధౌ గోపిన్ కే జ్ఞానదీవే,
ఆయేథే గురుహ్వైయి, పర్ చేలాహ్వైయి చలేగయే॥

యోగాన్ని త్యజించాడు, జపమాల త్యజించాడు,
ు, ధ్యానాల్ని త్యజించాడు, కర్మమార్గాన్ని త్యజించాడు.
ువుడు ఆ గోపికలదగ్గరకు గురువై, జ్ఞానోపదేశం చేయ
నికి వచ్చాడు, చివరకు ఏకాదశేంద్రియాలలో శ్యామ
ాన్ని నింపుకొని, గోపీభావంతో, గోపికగా మదన గోపా
ు సమీపించాడు!

గోపాలుడు కుశలప్రశ్నలు వేశాడు; "ఉద్ధవా! ఏమి
ా ఉన్నావు? విశేషాలేమిటి?"

అశ్రు పూర్ణ నయనాలతో ఉద్ధవుడు అంజలి ఘటించాడు; "మై కుఛ్ భీ నహీం హుం, బస్, ఏక్ ప్రేమకా పూజారీ హుం !" "గోపాలా ! ఒకటేమాట ! ఈనాడు నేను ప్రేమ పూజారిని."

"నేను నీదాననే — నీదాననే - నిస్సంశయంగా నీ దాననే." ఈ మహామంత్రం ఉద్ధవునకు అంతః బహిః ప్రాణమయింది.

ఎవ డెట్టివాడో, భావ మెట్టిదో వాని కీరసంకూడ అంత మాత్రంగానే లభిస్తుంది. భావం లేకపోతే, త్రిగుణాతీతస్థితి లేకపోతే, శ్రీరాధారాణి కృపాకటాక్షం లేకపోతే రసాస్వాదన లేనేలేదు.

వేదాంతరాజ్యం - రసరాజ్యం. ఈ రెండింటి సీమా సంధియందు గల జీవుడే ఉద్ధవుడు. జీవు డేనాటికైన మధుర రసంలో మధురరసంగా ప్రవహించి తీరవలసిందే. అప్పుడే మానవజన్మకు సార్థకత సిద్ధిస్తుంది.

"మా భైష్ట వాత వర్షాభ్యాం." (శ్రీమద్భాగవతం, స్క 10 - అ 30 - శ్లో 20.) ఒక గోపిక గోవర్ధన గిరి ధారణ చేస్తోంది. ఆమె సత్త్వరజస్తమోగుణాతీత. ఎవరు త్రిగుణాతీతులో వారి శరీరమే గోవర్ధనం. త్రిగుణాతీత చిత్త వృత్తులే సమర్పణభావాలు. ఇట్టి శరీరాల్ని ధరించి, పోషిస్తూ గోపాలుడు వారికి తనప్రేమలో జీవనం కల్పిస్తాడు.

శ్లో॥ గాయంత్య ఉచ్చై రముమేవ సంహితా
విచిక్యు రున్మత్తకవ ద్వనా ద్వనం,
ప్రపచ్ఛు రాకాశవ దంతరం బహి
ర్భూతేషు సంతం పురుషం వనస్పతీన్॥

(శ్రీమద్భాగవతం, స్కం 10 - అ 30 - శ్లో 4)

గోపికలు ఉచ్చస్వరంతో నామగానంచేస్తూ రూపాసక్తిలో ఉన్మత్త లవుతున్నారు. వనాలలో పరిభ్రమిస్తూ, వానిలో నిండివున్న గోపాలునియందు త్రికరణాల్ని లీనం చేస్తున్నారు. రసం ప్రవాహరూప మవుతోంది.

గోపికలు తమ కళ్ళను ప్రశ్నిస్తున్నారు! 'కళ్ళల్లారా! చెప్పండి, గోపాలుడెక్కడ ఉన్నాడు? మీరు హృదయంలో ఉండేవాడిని బయటకు పోనీయకుండా జాగ్రత్తగా ఇంటికాపలా కాస్తారనుకొన్నాం. మీరెంత నమ్మకద్రోహులు! ఇంట్లో వుండే గోపాలునితో స్నేహంచేశారు. మీలోనే అతడుండటానికి ఇల్లు కట్టారు. మీరూమీరూ బాగానే వున్నారు. మేం మాత్రమే గోపాలునకు దూరమై, మృతతుల్యాలయినాము.''

గోపికల మనసు గోపాలుడు, శరీరం గోపాలుడు, సర్వేంద్రియాలు గోపాలుడు, ధనం గోపాలుడు, జీవనం గోపాలుడు, ప్రాణం గోపాలుడు, వారి వ్యవహారాలన్నీ గోపాలుడు, బాహ్యాభ్యంతరాలు, సమస్తసుఖాలు గోపాలుడు.

గోపికలు ఉద్ధవునితో చెప్పుకొని విలపిస్తున్న దృశ్యం అది. "ఉద్ధవా ! ఒక్కటేమాట! శ్యామవర్ణం ఎక్కడెక్కడ వుంటుందో ఆ అన్నిస్థానాలందు వంచకత్వముంటుంది. ఉద్ధవా! మదనగోపాలుడు మామనసుల్ని దొంగిలించాడు. సమస్తాన్ని దొంగిలించాడు, మమ్మల్నే దొంగిలించాడు. అన్నికోరికల్ని దొంగిలించాడు. అయినా ఒక్కకోరికమాత్రం అలాగేవుంది. నిరంతరాభివర్ధనశీలంగా వుంది. మదనగోపాలుని వారలమై జీవించలేకపోతే ఇంక ప్రాణధారణచేయటం అనవసరమే. ఉద్ధవా ! నల్లనివారందరు వంచకులేనని అప్పుడప్పుడనిపిస్తుంటుంది."

దశదిశలు గోపికల్ని అనునయించటానికి వచ్చి చెప్తున్నాయి; "పిచ్చివాళ్ళల్లారా! ప్రేమించి, ఎవరు సుఖించారు!" గోపికలు నిట్టూరుస్తున్నారు.

"గోపాలా! నీరూపం నలుపు. కానవే బుద్ధికూడా నలుపయింది. సమస్తజనుల మనసుల్ని దొంగిలించటం నీకు జన్మసహజప్రవృత్తి. ఎంత మోహాశూన్యుడవు!"

నమ్మించి, వంచించటం గోపాలునకు సహజప్రవృత్తి. అయితే ఇంకా నిరాశలు కాకుండటం, ఆశాపూర్ణనేత్రాలతో గోపాలునికై ప్రతీక్షించటం గోపికలకు సహజప్రవృత్తి. ఒకటే మాట! పురుషహృదయం అలావుంటుంది, స్త్రీహృదయం ఇలా వుంటుంది.

"గోపాలా ! జీవించియుండగా మాకళ్ళముందుకు నీవు తప్పక వస్తావు. ఎక్కడనుండి వస్తావు? మాలోనుండే వస్తావు. ఈ ప్రపంచంలో నుండియే వస్తావు. వచ్చితీరాలి."

"గోపాలా ! బ్రహ్మాండస్థ సమస్తజీవులు ఒక జీవి జీవించటానికి ఎంతగానో సహకరిస్తున్నాయి. అందువలన ఈ జీవి మానవులకే కాదు, సమస్తజీవులకు ఎంతో ఋణగ్రస్తుడై యున్నాడు. వారికి కృతజ్ఞతలు చెప్పుకొనేశక్తికూడా, ఆనందింపచేసే శక్తికూడా ఈజీవికిలేదు. నీ కృపాకటాక్షమే మానవులలో అనేకశక్తుల రూపాన్నిపొంది వుంటుంది. నిన్ను విస్మరించాడా, మానవుడు సర్వధా శక్తిహీనుడై పోతాడు. ఉపకారులకు అపకారం చేస్తాడు, సర్వాంతర్యామికి ద్రోహం చేస్తాడు.

గోపాలా! ఈ ఉదారవిశ్వానికి అంటే సమస్త జీవులకు ఎలా కృతజ్ఞతలు తెలియచెప్పుకోవాలో అర్థంకావటంలేదు. ధనం సంపాదిస్తాం. ఎంత సంపాదించగలం ? ఎంత దానం చేయగలం ? పోసి శరీరసేవ చేద్దామా ? ఎంత చేయగలం ? అనంతానంత జన్మాలకు తగు ప్రమాణంలో ఉపకారం జరగాలి. అదే సర్వశ్రేష్ఠ ఉపకారం.

జీవులు జన్మిస్తూనే వుండాలి, ఆ శ్యామరసాన్ని స్వయంగా అనుభవించి, అందరిచే అనుభవింపచేయాలి, సర్వవ్యాపకం చేయాలి.

గోపాలా! అంతరిలో నీవు రసరూపంగా ప్రవహించాలి, మేమందరం గోపికలం కావాలి. ఇందుకుగాను నీవు ముందుకు కదలి రావాలి.

సమస్త జడ చేతనాలు ఈ రస స్వరూపాన్ని, గోపాలుని గ్రహించి ఆర్ద్రం కావాలి, స్వయంగా పరవశించి, ప్రవహించాలి.

గోపాలా! ఇది మా విశుద్ధ విరహం. మేం పూర్ణ కాములం కావాలి. అంతవరకు కాల కబళితులం కారాదు. ఇందుకు నీ కరావలంబనం కావాలి. నీవు మోహశూన్యుడవని గోపిక లంటున్నారు. అయినా ఇంతమాత్రం అనుగ్రహిస్తావని మా అచంచల విశ్వాసం. నమ్ముతావో, నమ్మవో, ఒకటేమాట! గోపాలా! ఆవిశ్వాసంతో విలపిస్తూ, ఈవిశ్వంలో అంతిమ శ్వాస తీసికొంటున్నాం. అనుగ్రహించవూ!

  

# గోపికలు - మృత్యువు

శ్లో॥ నిజపదాబ్జదళైర్ధ్వజ వజ్ర
నీరజాంకుశ విచిత్రలలామైః,
వ్రజభువః శమయన్ ఖురతోదం
వర్ష్మధుర్య గతిరీడిత వేణుః॥
వ్రజతి తేన వయం సవిలాస
వీక్షణార్పిత మనోభవ వేగాః,
కుజగతిం గమితా నవిదామః
కశ్మలేన కబరం వసనం వా॥

(శ్రీమద్భాగవతం, స్కం 10-అ-35-శ్లో 16-17)

ఒకగోపిక తనచెలికి చూపిస్తోంది; "చూడు, గోపాలుడు గో, గోపపరివేష్టితుడై ఇంటికి తిరిగివస్తున్నాడు. సల్లిలల సంధ్యారాణి నాట్యంచేస్తోంది, గోపాలుని అధరాలనుండి మురళీగాన ప్రవాహరూపంగా భక్తిమహారాణి నాట్యం చేస్తోంది. గుప్తంగా సర్వత్రా శ్రీరాధారాణి నాట్యం చేస్తోంది. గోపాలుడు లలితగతియుక్తుడు. ఆగమనమాధుర్యం భూమాతను దుఃఖవిముక్తనుచేసి, పులకితగాత్రను చేస్తోంది. వేణుగానం - లలితవిలాసం - అద్భుతమందహాసం. అబ్బా! వానివలన ఎంతత్రాసం: అవి సమాగమేచ్ఛా వర్ధకాలు. ఏమి ముగ్ధత! ఏమి ముగ్ధత!! మేము జడులవలె నిశ్చేష్టులమైనాము."

ఇదే మృత్యువు. గోపికలకు భౌతికశరీరం లేదు, అయినా వారు మృత్యుగ్రస్థులే. అది సాధారణజీవుల మృత్యువు కాదు, అప్రాకృతం. అసలు ఆ రసరాజ్యంలో అమంగళస్వరూపమగు మృత్యువునకు స్థానమెట్లా లభిస్తుంది ? ఆ రాజ్యంలోని ప్రేమికులు జడవత్ నిశ్చేష్టులవుతారు. అంతే ! అందువలననే దాన్ని 'మృత్యు' వంటున్నారు. ఎంత అదృష్టముంటే ఈ మృత్యువు లభిస్తుంది ! గోపాలుని ప్రేమించలేకపోతే ఈ మృత్యువు లభ్యమవుతుందా ? కానేకాదు. ప్రేమభవనానికి ఈ నిశ్చేష్ట స్థితి - దేహాహం భావ రాహిత్యం అంతఃపురం వంటిది. అచటనే గోపాలునితో శాశ్వతమధుర దివ్యసాహచర్యం లభిస్తోంది.

గోపాలా ! నీవెంత మోహశూన్యుడవైనా నేను మాత్రం నాప్రేమను వదులుకోలేకున్నాను. నీరూపాన్ని కనులముందు చూస్తుంటే మనసు నీస్వభావాన్ని గురించి ఆలోచించనే లేకపోతోంది. మా మోహం ఎంతటిది ! మోహంతో వేదన, వేదనలో అగ్ని, అగ్నివలన తాపం, ఫలితంగా వ్యాధి, నిరంతరక్షోభం, బాహ్యాంతర విస్మృతి, చివరకు శరీరపతనం, ఇంతటిది మా మోహం.

గోపాలా ! శరీరపతనానికి పూర్వమే నీదర్శనం, ప్రేమసాహచర్యం లభించాలి. మా నీరసజీవితంలో చివరకు శేషించిన ఆశ ఇదొక్కటే ఒక్కటి.

శ్లో॥ చిన్తాఽత్ర జాగరోద్వేగో తానవం మలినాంగతా,
ప్రలాపో వ్యాధిరున్మాదో మోహో మృత్యుర్దశాదశ॥
(ఉజ్జ్వల నీలమణి)

విరహానికి దశదశలు. ఏవిషయసుఖా లనుభవిస్తున్నా, ఏ పనులు చేస్తున్నా సర్వకాల సర్వావస్థలలో స్వాభావిక రూపంలో గోపాలుని నామరూప గుణలీలాధామాల్లో మనో వాక్కాయాలు లీనంకావాలి. దీన్ని 'చింత' అంటారు. (2) ప్రియుని నిరంతరచింతతో నిదురరాకుండటం 'జాగరణ'. (3) నిదుర రాని కారణంగా హృదయం నిర్వేదం చెందటం 'ఉద్వేగం' (4) హృదయంలోని తాపం శరీరంపై పడగా అది శుష్కించటం 'తానవం' (5) అంగాలన్నీ శిథిలమవటం 'మలినాంగత్వం' (6) హృదయం విహ్వలం, శరీరమూ శిథిలం. ఈ కారణంవలన ఆక్రందించటం 'ప్రలాపం' (7) ఇంక శరీరం వ్యాధిగ్రస్థం కాకుండా ఎట్లుండగలదు ? ఇదే 'వ్యాధి'. (8) వ్యాధిపీడితుడు లోకజ్ఞానశూన్యుడు, ఉన్మాదిఅవటం సహజమే గదా ! ఇది ఉన్మాదం. (9) ఇంక అంగశైథిల్యంలో కలిగే మూర్ఛను 'మోహ' మంటున్నారు. (10) చెప్పాలా! ఇంక ప్రేమికుడు మృత్యుగ్రస్తుడవుతున్నాడు. మనువకండి ! ప్రేమతో ప్రేమకొఱకు మరణించటం జీవించటమే. ప్రేమికులకు నిజమైన జీవనం ప్రియుడు మదనగోపాలుని హృదయంలోనే. ఎంత సౌభాగ్యవిషయం !

  

# గోపికలు - భావం

శ్లో॥ యా దోహనేఽవహననే మథనోపలేప
ప్రేంఖేంఖనార్భ రుదితోక్షణ మార్జనాదౌ,
గాయంతి చైన మనురక్త ధియో ఽశ్రు కంఠ్యో
ధన్యా వ్రజస్త్రియ 'ఉరుక్రమచిత్తయానః॥'
(శ్రీమద్భాగవతం, స్కం 10 - అ 44 - శ్లో 15)

"పాలు పిదుకుతూ, ధాన్యం దంచుతూ, పెరుగు చిలుకుతూ, ఆవుపేడతో గృహప్రాంగణాన్ని అలంకరిస్తూ, బాలురను ఊయల లూపుతూ, ఏడ్చే శిశువుల్ని ఊరడిస్తూ, వీధి చిమ్ముతూ, జల సంప్రోక్షణ చేస్తూ, ముగ్గులు పెట్టుతూ, ఒకటేమిటి, ఏ కార్యాన్ని చేస్తున్నా వ్రజబాలలు ఆ రూపంగా పరిపూర్ణంగా తమ మనోవాక్కాయాల్ని ప్రియునకు పారితోషికం చేశారు. ఉరుక్రమచిత్తయాన లైనారు."

నిరంతరం ఒకటే మధుర నినాదం. "గోపాలా ! గోపాలా !! గోపాలా !!!"

మనోవాక్కాయాల్ని పారితోషికం చేశారా? అయితే శరీరంతో భౌతిక క్రియాకలాపం ఎట్లా సంభవం ? వాక్కుతో నామోచ్చారణం ఎట్లా సంభవం ? మనసుతో రూపచింతనం ఎట్లా సంభవం ? నిస్సంశయంగా అసంభవం.

గోపాలుడే వారి భౌతిక క్రియాకలాపాలు. గోపాలుడే వారి ఇంద్రియాలు, గోపాలుడే వారి మనసు, అంతా గోపాలుడే గోపాలుడు.

అచట మనోవాక్కాయాలు తన్మయాలయి, విహ్వాలా లయినాయి. ఇక ఆస్వాదన ఏమిటి ? ఆస్వాద్య మేమిటి ? ఆస్వాదకు లెవరు? అంతా మధురరస ప్రవాహమే ప్రవాహం.

ఇదే 'భావం'. ఇందులో త్రిగుణాతీత చిత్తవృత్తి ఉంది. ఇందులోని ప్రవాహం 'భాగవతరసం', గోపాలరసం, ప్రేమరసం, శ్యామరసం.

ప్రేమకు ఎనిమిది భూమికలు. (1) రతి, (2) ప్రీతి, (3) స్నేహం, (4) మానం, (5) ప్రణయం, (6) రాగం, (7) అనురాగం, (8) భావం. తక్కిన అన్నింటియొక్క పరాకాష్ఠ స్వరూపమే 'భావం.'

భావ మనగా అస్తిత్వం, ఉన్నది. అభావమనగా లేదు. ఒకటేమాట! ఉన్నదంతా మధురరస ప్రవాహమే. ప్రారంభావస్థయందు ఏది 'భావమో' అదే పరాకాష్ఠ స్థితిలో రస స్వరూపాన్ని పొందుతోంది.

రససాగరాలు శ్రీరాధాకృష్ణులు ప్రేమికులకుస్వంతమై పోతున్నారు. ప్రేమికుల సమస్తేంద్రియాలలో సహజసిద్ధ సిద్ధ వస్తువుగా నిలిచిపోతున్నారు. అందువలన గోపికలు తమ సందేశఘుటను నినదింప చేస్తున్నారు "ఆర్ద్రభావంతో క్రమంగా భావస్వరూపాన్ని సాధించే అసలైన ప్రేమయోగికి ఇతర ఏ యోగాలు అవసరమే లేదు. ప్రేమయోగం ఇతర సమస్త యోగాల్ని తుచ్ఛాలుగా చేస్తుంది. ఇంకొక్కమాట !

ఎచట ప్రేమయోగముంటుందో అచట తక్కిన సమస్తయోగాలు సహజంగానే దాన్ని ఆశ్రయించి జీవిస్తుంటాయి."

వాస్తవంగా గోపాలుని ప్రేమించాలి, గోపాలరూపాన్ని పొందాలి, గోపాలుని పొందాలి, ఆ సాహచర్యాన్ని పొందాలి. "పొందువాడు - పొందుట" అనే ద్వంద్వం నశించేటట్లుగా పొందాలి. అంటే ఆదిమధ్యావసానములు ఒకే తత్త్వం ఆధారంగా కలిగి యున్నాయన్నమాట. ఉన్నదేదో వుంది, ఉన్న స్థానానేవుంది, అదెప్పుడూ ఉంటూనేవుంది. దానిపై ఈచివరి నుంచి ఆచివరివరకు అఖండరసం ప్రవహించింది. ఆ తత్త్వమే ఈరసంగా ప్రవహించింది. ప్రవహించి, ప్రవహించి, ఆరసం చివరికి సమస్త నానాత్వాన్ని ప్రవహింపచేసింది. సాంతవస్తువుల నన్నింటిని అనంతగర్భంలోనికి తరలించింది, అదృశ్యమయింది. ఆది లేనినాటినుండి ఏతత్త్వమున్నదో, అంతం తరువాతకూడా ఆతత్త్వమే శేషించింది. దానికి ఆదిమధ్యావసానాలు ఉన్నట్లుగా కన్పిస్తాయిగానీ ఎంతమాత్రం ఉండనే ఉండవు. మరువకండి, గోపికల మధురరసప్రవాహానికి అంతం లేనేలేదు.

నారదుడంటున్నాడు; ఈగోపికలెంతటివారు ? "యథా వ్రజ గోపికానాం."; ప్రేమమార్గానికి ఆచార్యలు. వారి కృపాభిక్ష లేకపోతే ఎవడూ ప్రేమికుడు కాలేడు.

త్రిగుణాతీతమై, చిత్తవృత్తి గోపాలమిళనాకాంక్షతో ధారారూపమై ప్రవహించు స్థితిని 'రతి' అంటారు. అది

నశింపదగు కారణాలేర్పడినా కూడా నశించకుంటే 'ప్రీతి' లేక 'ప్రేమ' రూపాన్ని ధరిస్తుంది. ప్రౌఢం- మధ్యం- మందం అని ప్రేమ మూడువిధాలు. ఈ ప్రేమయే హృదయాన్ని అత్యంత విశేషరూపంలో ద్రవీభవింప చేసినప్పుడు "స్నేహ"రూపాన్ని ధరిస్తోంది, స్నేహం ఘృతస్నేహం- మధుస్నేహం అని రెండు రకాలు. స్నేహమే ఇంకా ముందుకు విజృంభించి అతిశయ మాధుర్యాన్ని సంతరించుకొని "మాన" రూపాన్ని ధరిస్తోంది. ఉదాత్తం- లలితం అని మానం రెండురకాలు. మానమే సంభ్రమరహితమై, అత్యంత విశ్వాసంతో పరిపక్వావస్థను పొంది "ప్రణయ" రూపాన్ని ధరిస్తోంది. మైత్రీప్రధానం— సఖ్యప్రధానంగా ప్రణయం రెండురకాలు. అపరిమిత దుఃఖం కూడా సుఖరూపంగా అనుభవం కలిగే ఉత్కృష్ట ప్రణయా వస్థను "రాగ" మంటారు. ఈ రాగమే గుప్తస్థితిలో "నీలీ రాగం" గా, ప్రకటావస్థలో "శ్యామారాగం"గా పిలువబడు తోంది. రాగం ప్రతి క్షణవర్ధమానం, నవనవాయమానంకాగా "అనురాగ" రూపాన్ని ధరిస్తోంది.

"గోపాలుని నేనిప్పుడే తొలిసారిగా చూస్తున్నాను. ఈ దర్శనంలో, సంభాషణంలో, సాహచర్యంలో రసంప్రవ హిస్తోందే అది క్షణక్షణానికి క్రొత్త క్రొత్త రూపాల్ని ధరిస్తూ క్రొత్త క్రొత్త అనుభవాల్ని కలిగిస్తోంది. అరే! ఆగోపాలుని నయనాలు అంతచంచలాలని, మందహాసం ఇంత మధురమని నాకు తెలియనే తెలియదే!"

ఎంత సౌభాగ్యం ! ఎంత సౌభాగ్యం !! అదెంత గర్వ కారణం! నా మదనగోపాలుడు నే చెప్పినట్లు వింటాడు, నే నాడమంటే ఆడతాడు, తినమంటే తింటాడు, పడుకోమంటే పడుకుంటాడు. నిజంగా గర్వకారణం కాదామరి! చెలియల ఆధీనంలో సదాగోపాలుడుంటాడు. సదాగోపాలుని అధీనంలో చెలియలుంటారు. ఒకటేమాట ! దాన్నిమాత్రమే అనురాగ జీవన మనాలి, అప్రాకృత ప్రేమరాజ్యంలో దీన్నే "అనురాగ" మంటున్నారు. ఇందులో అనుక్షణం ఆశాలతలు చిగురుస్తుంటాయి. రసాన్ని అఖండంగా వర్షిస్తుంటాయి. "ఏంచేస్తే నా మదనగోపాలున కానందం కలుగుతుంది. గోపాలుడు ఆనందించేటట్లయితే నేను ఏంచేయమన్నా చేస్తాను. నవ్వుతూ ప్రాణత్యాగమయినా సరే చేసేస్తాను. ఆఁ! అయితే నేనేం చేయాలి?"

అనురాగం పరాకాష్ఠనుచెంది "భావ" రూపం ధరిస్తుంది. ఒకటేమాట ! భావంలో "అనురాగి" ఉండడు. అనుభవాలు" అసలేవుండవు. ఒక్కమాటలో చెప్పాలంటే అనురాగి అనురాగరూపంలో వుంటాడు. ఇదిగో ఇదే "భావం". గోపికలు భావస్వరూపిణులు.

ఎవరు గోపాలుని ప్రేమిస్తారో వారు చివరికి ఆగోపాల రూపులవుతారు. ప్రేమస్వరూపులవుతారు. ప్రేమలో అనివార్యంగా స్వరూపపరివర్తన జరిగితీరుతుంది. అయితేమనసా! గోపాలుని ప్రేమించి తీరవలసిందే.

గోపికల సేవాభారానికి ఋణగ్రస్తుడై, గోపాలుడు వారికి తన్ను తా నర్పించుకొన్నాడట.

శ్లో॥ న పార యేఽహం నిరవద్య సంయుజామ్
స్వసాధుకృత్యం విబుధాయుషాపివః,
యా మా భజన్ దుర్జర గేహ శృంఖలాః —
సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా॥
(శ్రీమద్భాగవతం, స్కం 10 – అ 32 - శ్లో 22)

"గోపాలుడు తన ఆర్ద్రహృదయాన్ని అక్షరాల రూపంలో గోపికలముందు ప్రవహింపచేస్తున్నాడు. గోపికలారా! అత్యంత కఠినమగు గృహబంధాల్ని ఛేదించి, మీరు నన్ను నిష్కపటంగా ప్రేమించారు. ఇందుకు ప్రతిగా మీకు నేనేం చేయగలను? ఒక్కొక్క దేవతయొక్క పూర్ణాయుర్దాయాన్ని తీసికొని మీకు సేవచేసినా, నేను ఋణవిముక్తుడను కాలేను. నేను ఋణ గ్రస్తుడను. నేటికి - ఏనాటికి ఋణగ్రస్తుడనే. "గోపాలా! నీవెంత మాత్రం ఋణగ్రస్తుడవు కావని ఒకవేళ మీరు చెప్పేటట్లయితే నేసింకా ఋణగ్రస్తుడ నవుతాను."

"గోపాలా! నీవెంతమాత్రం ఋణగ్రస్తుడవు కావు. మేము లెక్కలేనన్ని శరీరాల్లో తిరిగి - తిరిగి ఈ మానవ శరీరం లోకి వచ్చాం. అప్పుడు మా మనోవాక్కాయాలు విషయాల వెంట పరుగులు తీసేవి. నీవే ఆ శరీరాల్లో అంతర్యా

మిగా ఉన్నావు. అట్టి నిన్ను అవమానించి, నీ కృపాలబ్ధ శరీ
రాన్ని మేం దుర్వినియోగం చేశాం. నీవే లేకపోతే మానయు
నాలకు చూచేశక్తి ఎక్కడిది? వాక్కునకు మాట్లాడే శక్తి
ఎక్కడిది? జఠరాగ్నికి ఆహారం జీర్ణంచేసేశక్తి ఎక్కడిది?
నీవు లేకపోతే జీవి జీవించనే లేదు, ఆనందించనే లేదు. అట్టి
నీశక్తి నవమానించి, మాయందున్న నిన్ను వెనుకటి అనంత
జన్మాలలో నిర్దాక్షిణ్యంగా సంహరించాం. అయినా నీవు
మమ్ముల ననుగ్రహిస్తూనే ఉన్నావు. చెప్పు, ఋణగ్రస్తులం
మేమా? నీవా?"

ఇవి అక్షరపంక్తులా? కావు. అశ్రుప్రవాహాలు, నిస్సం
శయంగా అశ్రుప్రవాహాలు.

శ్లో॥ సహాయా గురవః శిష్యా భుజిష్యా, బాంధవాః
స్త్రియః।
సత్యం వదామి తే పార్థ గోప్యః, కిం మే భవంతి న॥
మన్మాహాత్మ్యం మత్సపర్యాం మచ్ఛ్రద్ధాం
మన్మనో గతమ్।
జానంతి గోపికాః పార్థ నాన్యే, జానంతి తత్త్వతః॥

శ్రీకృష్ణవచనం; "పార్థా! గోపికలు నాకు సహాయి
కలు, గురుతుల్యలు, శిష్యస్వరూపిణులు, భోగ్యలు, బాంధ
వలు, సహచారిణులు. పార్థా! వారు నాకేమి గారు? నా
సర్వస్వం గోపికలే, నా మహిమ, అంతర్యం గోపికలకు
మాత్రమే తెలుసును."

గోపికలు ఇంతటివారు.

ఇచట ప్రియుడు - ప్రేమ - ప్రేయసి అనేభేదం నశించింది.

ఒకపర్యాయం లలితాసఖి శ్రీరాధారాణి నడిగింది; "స్వామినీ! అసలు గోపాలునితో మీకుగల సంబంధమేమిటి?" రాధ ఉత్తరం; "నీవు ఎలా అనుకొన్నా అదిమాకు వర్తిస్తుంది. ఎలాఅనుకొన్నా తప్పులేదు."

లలిత; "అయితే రాధే! మేమందరం మిమ్మల్ని ప్రియాప్రియతములుగా భావిస్తున్నాం."

రాధ ఉత్తరం; "లలితే! ప్రేమరహస్యం నీకు తెలియనేలేదు, ప్రేమలో ఎంతవరకు సంబంధముంటుందో అంతవరకది క్షుద్రంగా ఉంటుంది. ఒకటేమాట! సంబంధాన్ని సూచిస్తున్నంతవరకు ఆప్రేమను అసంపూర్ణంగానే గ్రహించాలి. పరాకాష్ఠ ప్రేమరసంలో 'నీవు' లేవు. 'నేను' లేను అట్టిస్థితిలో సంబంధం ఎట్లా సముచితంగా ఉంటుంది? అత్యుత్కటమైనప్పుడు మిళనాకాంక్ష అథవా లాలస రెండురూపాల్ని ధరిస్తుంది. ఆరెండు రూపాలే గోపాలుడు - నేను."

"పరస్పర్ దోఉ చకోర్ దోఉ చందా."

"ప్రియాప్రియతములు శ్రీరాధాకృష్ణులు పరస్పరం యిరువురు చకోరాలే, యిరువురు చంద్రులే."

మిళనాకాంక్షకు అంత ధారారూపాలన్నమాట!

అర్ధభాగం శ్రీరాధారాణి-అర్ధభాగం మదనగోపాలుడు. ఇది యుగళస్వరూపం - అంటే ప్రేమరసప్రవాహం. ఇది ప్రేమీభక్తులకు అంతః బహిః ప్రాణం - అపూర్వనిధి. బృందావనంలో ఎచటచూచినా, చూడకున్నా ఈ యుగళ రూపమే దర్శనమిస్తుంది. ప్రధానమూర్తి బాంకేబిహారి ముఖ్యంగా యుగళస్వరూపం. చూచే చూపుకూడా ఆ యుగళ స్వరూపం కావాలి, అదేరసాస్వాదనకు అత్యుత్కృష్ట చరమ అనుభవం.

ప్రియుడు మదనగోపాలుడు అంతః బహిః ప్రాణంగా ఉన్నాడు. స్వయంగా శ్రీరాధారాణియే మదనగోపాల రూపాన్నికూడా పొందివుంది, శ్రీరాధారాణి ప్రియుని అంక మందున్నది. అయినా ఆమె విరహతాపాన్నే అనుభవిస్తోంది. "ఎక్కడ గోపాలుడు ? వేణుగోపాలు డెక్కడ ? నా మదన గోపాలు డెక్కడ ?" దీన్నే 'ప్రేమవైచిత్ర్య' మంటారు.

శ్లో॥ అహంకాంతా కాంతా స్త్వమితి నతదానీం మతిరభూన్,
మనోవృత్తి ర్లుప్తా త్వమహమితినో ధీరపి హతా,
భవాన్ భర్తా భార్యాహఽమితి యదిదానీం వ్యవసితి
స్తథాపి ప్రాణానాం స్థితిరతి విచిత్రం కిమపరమ్॥

"శ్రీరాధారాణి చెప్తోంది; గోపాలా ! ఇంతకుపూర్వం నీవు ప్రియుడవని, నేను ప్రియురాలనని భావించాను. అప్పుడు మనోవృత్తులన్నీ లుప్తాలయినాయి. భావం అద్భుతంగా ఉండేది. ఇప్పుడునీవు భర్తవైనావు, నేను భార్యనైనాను. ఈ

భావంతో శరీరంలో ఇంకా ప్రాణాలు నిలిచివున్నాయే, ఇంతకు మించిన ఆశ్చర్యం మరేముంటుంది ?"

అదిగో, ఆ శ్రీరాధారాణి మహాభావ స్వరూపిణి.

(1) గోపికలు భావస్వరూపిణులు. భవాన్నివై భవోపేతం చేసేదాన్ని 'భావం' అంటారు (2) చెప్పాంగదా, ఆస్వాదన, ఆస్వాద్యం, ఆస్వాదకుడు అభిన్నమవుతున్న విధానాన్ని 'భావ' మంటారు. (3) భావం రసప్రవాహానికి ఉద్గమ స్థానం, (4) సమస్త భగవత్పరివారం భావం, (5) గోలోక ప్రభృతి సమస్తలోకాలు భావం, (6) భావానికి అప్రాకృత రూపం గోలోకం, మాయాకలితరూపం ఇతరప్రపంచం. (7) హృదయస్థ సమస్త భగవద్విభూతిభావం, (8) హృదయంలో వుండేగోపాలుని బాహ్యాని కాకర్షించేది భావం. అంటే స్నిగ్ధావస్థను పొందిన భగవదాకార యుక్తచిత్తవృత్తి, (9) భగవదీయ సమస్తవస్తువులు భావం, (10) దివ్యశరీరం భావం, (11) సమస్తానికి కర్త - తత్త్వం భావం, (12) సచ్చిదానందాత్మకం భావం, (13) 'నేను' భావం, (14) ప్రేమకు పరాకాష్ఠ స్వరూపం భావం, (15) శ్రీరాధాకృష్ణులు భావమూర్తులు, (16) అక్షరం భావం, (17) నాదం భావం, (18) ఆ భావం ప్రేమభావాలుగా వ్యక్తమవుతుంది. సాత్త్వికభావాలు - వ్యభిచారభావాలు మొదలైనవి, (19) భావమంటే రసం, (20) భావమంటే అఖండాద్వైతం, (21) అభావం కూడ భావమే.

విరాగంతో సాధన ప్రారంభమవుతుంది. ఆ తరువాత రాగరాజ్యానికి ప్రయాణం; 'నేను' ను 'నేను' నందు త్యాగం చేయటం. ఆత్మలో రాసలీల, మధుర రసాస్వాదన, విరహం, విహ్వాలత, ఫలితంగా మృత్యువు, దివ్యదేహప్రాప్తి, భావంతో భావమై అంతంలేని ఆనంతత్వాన్ని సాధించటం, ఇంతే! ఇదే రసజీవనం, గోపికా జీవనం.

శ్రీరాధారాణి రసబీజంగాగల గోపికలు రాసలీలా ప్రేమరసానికి ప్రాణస్వరూపిణులు. సంపూర్ణ శ్రీమద్భాగవతానికి, బ్రహ్మాండాలకే రసబీజాలు, ప్రాణస్వరూపిణులు. కాన గోపికలంటే ఎవరు? వారి ప్రేమ ఎటువంటిది? ఆది మధ్యావసానములందు ప్రేమరసం ఎలా ప్రవహిస్తుంది! అనే విషయం ఈగ్రంథంలో ప్రతిపాదింపబడింది. గోపికల ప్రేమ రసాస్వాదనలోని దివ్యవైభవాలు ఈవిధంగా ప్రతిపాదించబడినాయి, మరువరాదు, ఈగ్రంథం ప్రేమరసవైభవాన్ని స్వల్పంగామాత్రమే అవగాహనకు తీసికొనివస్తుంది. ప్రేమికుడుమాత్రమే ఆరసాన్ని ఈ ఏకాదశేంద్రియ పాత్రలలో ప్రవహింపచేయగలుగుతాడు. ఇంద్రియపాత్రలలో అచ్యుత భావం రసంగా ప్రవహింపనారంభించిందా, అది క్రమంగా జీవికి తనరూపాన్నిచ్చి తీరుతుంది.

"ప్రేమ ఇలాగే ఉంటుంది? ప్రేమికుడంటే ఇలాగే ఉంటాడు? ప్రేమలో ఇట్టి అనుభవాలు మాత్రమే ఉంటాయి" అని ఎంతమాత్రం చెప్పలేం. భగవానుడెలా అన్నివస్తువులు

తానై ఉంటూ, అన్నింటిలో ఉంటూ, అన్నింటికి అతీతంగా కూడా ఉంటున్నాడో అలాగే ప్రేమకూడా సర్వవ్యాపకంగా, సర్వవిషయాలు తానై వుంటూ, సర్వానికీ అతీతంగా కూడా ఉంటోంది. (1) వ్యక్తి విశేషం. (2) భావవిశేషం, (3) ద్రవ్య విశేషం (4) స్థానవిశేషాలవలన ఒక్కొక్కరకంగా అనుభూత మవుతోంది. ఆరసస్వరూపుడే ఈ ప్రేమరూపంలో అనుభవ గమ్యుడవుతున్నాడు. అవాఙ్మానసగోచరుడు కృపావశుడై వాఙ్మానసాలకు వశవర్తి అవుతున్నాడు. మనసు- భావం- ప్రేమసాధనాలు ఒక్కొక్కరికి ఒక్కొక్కరకంగా ఉంటాయి. భగవదనుభవం అంటే ప్రేమరసానుభావాలు కూడ భిన్నంగా, నూతనంగా, అత్యంతమధురంగా ఉండటానికి అవియే కారణాలవుతున్నాయి. ప్రేమకు- ప్రేమ జీవనానికి అంతమనేది ఉండనే ఉండదు, అది అఖండ రసప్రవాహం. సమస్త నామ రూపాల్ని తనలోనికి సంగ్రహించి, తనరూపాన్ని నిరంతరం వానికి పారితోషికం చేస్తూనే ఉంటుంది. జీవులకు అప్రాకృత రూపాన్నిస్తూనే ఉంటుంది. (1) ప్రేమ భిన్నభిన్న రూపాలతో ఉంటుంది. (2) మధురంగా ఉంటుంది. (3) భగవదభిన్నంగా ఉంటుంది. (4) క్రియాశీలంగా ఉంటుంది. (5) పరివర్తనకారణంగా ఉంటుంది. (6) సర్వానికి ఆధారంగా బీజరూపంలో ఉంటుంది. (7) ప్రేమికునిరూపంగా ఉంటుంది. ప్రేమాభక్తులారా ! ఎట్టి దివ్యానుభవాలు మీలో కాపురం చేయాలనుకుంటున్నాయో ఇప్పుడు మీకెట్లా తెలుస్తుంది ?

భగవద్దత్తమైన సాధనసంపత్తితో ఈ శరీరముండగానే శరీరంలో ఉండే మదనగోపాలుని ప్రేమించి చూడండి. మీకే తెలుస్తుంది.

శ్లో. కృష్ణాది భిర్విభావాద్యై ర్గతై రనుభవాధ్వని,
ప్రౌఢానంద చమత్కార కాష్ఠామాపద్యతే పరామ్.
(భక్తి రసామృత సింధువు.)

అనుభవమార్గంలో "కృష్ణసంబంధాన్ని పొందిన విభావాదులు రసోత్పత్తి చేస్తున్నాయి. ఫలితంగా ప్రౌఢానంద చమత్కార పూర్ణమగు పరాకాష్ఠస్థితిలో జీవుడు ప్రవేశిస్తున్నాడు."

శ్లో. నాయం సుఖాపోభగవాన్ దేహినాం గోపికా సుతః,
జ్ఞానినాం చాత్మభూతానాం యథాభక్తి మతామిహ.
(శ్రీమద్భాగవతం స్కం 10- అ 9- శ్లో 16.)

"దేహమే నేనని భావిస్తున్నంతవరకు జీవుడు గోపాలుని ప్రేమించనేలేడు, ప్రేమించాడా, దేహాన్ని గోపాలునికి కైంకర్యంచేశాడా జ్ఞానియోగి జనాలకుకూడా దుర్లభమగు స్థితిని పొందుతున్నాడు, గోపాలుని దాసునిగా, నిజాజ్ఞానువర్తిగా చేసికొంటున్నాడు." ఏమి ఈ ప్రేమరసవైభవం! అద్భుతం! అత్యంతాద్భుతం !!

  

# గోపికలు - అయిదు రసాలు

"యద్వైతత్ సుకృతం రసోవైసః, రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి." (తైత్తిరీయోపనిషత్)

"రసం పూర్ణ బ్రహ్మ. జీవుడు ఆనందించాలంటే ఆ రసం ఆస్వాదనకు వచ్చి తీరాలి."

అయిదు భావా లున్నాయి. అవి త్రిగుణాతీతాలు బ్రహ్మానందాన్ని అవి అత్యంతహీనంగాచేస్తాయి. ఆ భావాలే క్రమంగా రసరూపాన్ని ధరిస్తాయి. అవే శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యాలు.

(1) శాంతం : ఇందులో భగవానుడు భక్తులకు చాలాదూరంగా ఉంటాడు. అసలు ప్రేమలో భగవద్దర్శనం-సంభాషణం ఉండి తీరాలన్న నియమ మేమీ లేదు. ఆ మాధుర్యం మాత్రం ప్రేమియొక్క ఏకాదశేంద్రియ పాత్ర లలో పరిపూర్ణంగా వ్యాపించి ఉంటుంది. ఏదో ఒకవిధమైన అసంతృప్తిని - నిరాశను - నిర్వేదాన్ని వీనిలోనే మాధుర్యాన్ని ప్రేమి నిరంతరం అనుభవిస్తుంటాడు. "ప్రియతముడకు నాయందు ఎప్పుడు దయ కలుగుతుందో! నేను మహా పాపాత్ముడను. భగవత్కృపకు సర్వథా అస్పృశ్యుడను. అయినా ఆ కరుణాసాగరుడు నన్ను కరుణించకపోతాడా?" ప్రేమి ఇట్టి అపార నిర్వేదంతోనే తన జీవనలీలను ముగిస్తాడు. పాపం! అతనికికూడా తాను త్రిగుణాతీతస్థితిలో - మోక్షా

తీత స్థితిలో ఉన్నట్లుగా జ్ఞానముండదు. అట్టి ప్రేమి తనకు కూడ తెలియకుండగనే ఎందరో మహాపాపాత్ములను ఉద్ధరిస్తుంటాడు, భగవత్సంకల్పంవలన అందు నిమిత్తమే జీవిస్తుంటాడు. ఇట్టిది ఈ శాంతరసం.

(2) దాస్యం : ఇందులో భగవానునితో సంబంధం ఆ పాద పద్మాలవరకు మాత్రం ఉంటుంది. ఈ బ్రహ్మాండమంతా భగవానునికి పాదస్వరూపం. భగవానుడు నాయకుడు - జీవుడు దాసుడు. శ్రీరాధిక రాణి. గోపాలుడామె దర్బారులో దాసుడు. ఇతర సమస్త భావాల్ని ఈ దాస్యం ఒక్కటిమాత్రమే పరిపుష్టం చేస్తుంది. అందువలన ఉన్నతికాములందరికు అత్యంతావశ్యకం ఈ దాస్యభావం. ఒకటే మాట! ఎవడెంత నమ్రుడో వాస్తవంలో ఆతడంత ఉన్నతుడుగా వుంటాడు. వ్యక్తియందలి సమస్త విశేషం పాదాలను ఆశ్రయించిమాత్రమే వుంటుంది. అందువలనే పాదప్రక్షాళనం - పాదపూజచేసి సజ్జనులు పాదనమస్కారం చేస్తుంటారు. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడే దాస్యభావాపన్నుడై శ్రీరాధారాణిని సేవించి, ఆమె కృపాకటాక్షలేశంతో సపరివారంగా మర్త్యభూమిపై ప్రకటమయినాడు. ఆ సేవాప్రభావం వలననే తన నరనాట్యాన్ని నవరసభరితం చేయగలిగాడు. స్వయంగా గోవులకు దాస్యంచేసి, లోకంలో ఉన్నతికాముని కర్తవ్యమేమిటో నిరూపించాడు. గోమాత

లకు గోపాలుడు చేయని సేవఏముంది ? వానిశరీరం కడిగాడు, మేత పెట్టాడు, వనాలకు తీసికొని వెళ్ళాడు, 24 గంటలు సేవ చేశాడు. ఆగోమాతలు ఈవేణుగోపాలుని హస్తానికిమాత్రమే తమప్రేమని క్షీరాలుగా వర్షింపచేసేవి. భక్తుడు భగవానుని నే భావంతో భజిస్తాడో భగవానుడుకూడా భక్తుని అదే భావంతో భజిస్తాడు. ఇట్టిది ఈదాస్యరసం.

(3) సఖ్యం: ఇందులో భగవానునితో సంబంధం భుజస్కంధాలవరకుంటుంది. ఇరువురుస్నేహితులు పరస్పరం భుజాలపై చేయివేసికొని విహరిస్తారు, వినోదిస్తారు, రసాన్ని ఆస్వాదిస్తారు. అప్రాకృత రసరాజ్యంకూడా ఇలాగే ఉంటుంది.

(4) 'వాత్సల్యం'లో భగవానునితో సంబంధం ఆ ఉదరంవరకు ఉంటుంది. ప్రేమీభక్తులు మాతృమూర్తులై గోపాలునకు రోజునకు 8 పర్యాయాలు బాలభోగంచేస్తారు. పిల్లవాడు ఎంతతింటున్నా తల్లికిమాత్రం ఏమీ అతను తినటం లేదనే భావమే కలుగుతుందిట. భోగం - రాగం - శృంగారం. ఈమూడింటియందు అంతర్గతమైనదే వాత్సల్యరసం. నేటికిని బృందావన ప్రేమభక్తి ఈ మూడింటిరూపంగానే వుంది.

(5) మధురం: ఇందులోరసం సమన ప్రధానంగా ప్రవహిస్తుంది. మనసులోనిభావం తప్పక వెంటనే నయనాలపై ప్రకటమయి తీరుతుంది. మనసులోకామం ఉంటే నయనాలు రాగయుక్తాలయివుంటాయి, క్రోధంవుంటే నయనాలు ఎఱుపు

దనం కలిగివుంటాయి. నయనాలను చూసి మనసెట్టిదో చెప్ప వచ్చును. మనః ప్రవృత్తిని చూసి, ఆయుర్దాయాన్ని, సుఖ దుఃఖాల్ని చెప్పవచ్చును; ఇట్లే అప్రాకృత దివ్యశృంగారరస ప్రవాహాన్ని కూడా ప్రేమీ భక్తుని నయనాలలో చూడ వచ్చును. మరువరాదు, రసికుల రసదృష్టి తత్క్షణం జడచేత నాల్ని ఆర్ద్రం చేసి తీరుతుంది.

శాంతంలో భగవత్సంబంధం దూరంగా ఉన్న కారణంవలన దానికి చెప్పుకొనదగిన వైభవమేమీ లేదు. అసలు ఈ అయిదురసాలు ఒకటి తక్కువ యని, మరొకటి ఎక్కువయని చెప్పుకొనుటకు సాధ్యంకానంత దివ్యమైనవి. ఒక్కమాటలో చెప్పాలంటే రసబ్రహ్మయే ఈఅయిదురసాల రూపాలు పొందాడు. అయినా మాధుర్యంలో అంతరమున్నది. కనుకనే భక్తుల అనుభవాలు కూడా చిత్రవిచిత్రంగా ఉం టున్నాయి. దాస్యంలో భగవానునుతో సంబంధముంది. కానీ అక్కడ భగవానుడు నాయకరూపంలో ఆజ్ఞాకారిగా ఉంటు న్నాడు. ప్రేమికుడు భయగ్రహగ్రస్థుడుగా ఉంటున్నాడు. చెప్పండి, ఆప్యాయత- అన్యోన్యత ఉండేస్థానంలో ప్రేమరసం స్వచ్ఛందంగా ప్రవహిస్తుంది కానీ భయం ఉండే స్థానంలో ఎట్లా ప్రవహిస్తుంది? సఖ్యంలో ఆప్యాయత- అన్యోన్యత స్వేచ్ఛావిహారం చేస్తాయి. అయినా రెండువైపుల నుండి సమానంగా ప్రేమలభించకపోతే సఖ్యం క్షీణిస్తుంది. సఖునకు సఖునితో ఇంటిబయట మాత్రమే సంపూర్ణ స్వాతంత్ర్యం

ఉంటుంగిగానీ ఇంట్లో ఎంతమాత్రం స్వాతంత్ర్య ముండదు. వాత్సల్యంలో తనయుకు ప్రేమించినా, లేకున్నా, దుర్మార్గుడైనా, సన్మార్గుడైనా తల్లి ఆతనిని ప్రేమిస్తుంది. అయినా ఇందులో కూడా ఆప్యాయత— అన్యోన్యతలకు అభావమే, భయభక్తులు మాత్రమే ఇచటకూడా నాట్యంచేస్తాయి. అందువలన వీని అన్నింటికన్న ఉత్కృష్టమైన రసం అవసరమయింది. అదే మధురం. అందులో తక్కిన నాలుగురసాలు అంతర్ధారలుగా ఉంటాయి. ఇట్టి మధురరసం ప్రాకృతంగా జారజారిణులలో ప్రవహిస్తోంది! ఇందులో జారజారిణులకు పరస్పరం రెండువైపులనుండి సంపూర్ణాకర్షణ ముంటుంది. నిరంతర పరితాపం ఉంటుంది. సర్వస్వత్యాగముంటుంది అవసరమైతే జారజారిణులు పరస్పరం ఒకరినిమిత్తం మరొకరు ప్రాణాల్ని త్యాగంకూడా చేస్తారు. జారిణీ ఆసక్తిలో శాంతముంటుంది. శరీరసుఖార్థం దాస్యముంటుంది. సఖ్యంకూడ ఉంటుంది. వాత్సల్యముండితీరుతుంది. మధురభావం ప్రధానంగా ఉంటుంది. ఇలా ప్రాకృతంగా జారజారిణుల విషయం అవగాహన నిమిత్తం చెప్పబడిందే గానీ అప్రాకృత భగవదభిన్న దివ్యశృంగారం— రాసలీలారసం జారజారిణుల క్షుద్రవాసనకు ఎంతమాత్రము సరిరాదు. అది భగవదభిన్న రసప్రవాహమనే విషయాన్ని ఎంతమాత్రం మరువరాదు.

(1) సాత్త్వికభావాలు- (2) స్థాయీభావాలు- (3) అనుభావాలు- (4) విభావ (5) వ్యభిచారభావాలతో ప్రవహించేది శాంతరసం.

(1) ఆలంబన విభావాలు (2) ఉద్దీపనవిభావాలు (3) సాత్వికవిభావాలతో రసశరీరంలో ప్రవహించేది దాస్యరసం.

(1) స్థాయీభావాలు- (2) సాత్త్వికభావాలు- (3) అనుభావ (4) విభావాలతో ప్రవహించేది సఖ్యరసం.

(1) స్థాయీభావాలు (2) సాత్వికభావ (3) విభావాలతో ప్రవహించేది వాత్సల్య రసం.

వాత్సల్య - మాధుర్యాలలో ప్రేమికులకు గోపాలునిపై అధికారం ప్రాప్తిస్తుంది. నిందించవచ్చును. మరియు దండించవచ్చును. అందువలననే ఇవి సర్వోన్నతాలయినాయి.

(1) గోపికలలో శాంతరసం – ఉదాహరణ :-

శ్లో॥ యాదోహ నేఽవహననే మథనో పలేప
ప్రేంఖేంఖ నార్భ రుదితో క్షణమార్జనాదౌ,
గాయంతి చైన మనురక్త ధియోఽ శ్రుకంఠ్యో
ధన్యావ్రజ స్త్రియ ఉరుక్రమ చిత్తయానః
(శ్రీమద్భాగవతం)

గోపికలకు ఆ నామరూప గుణలీలాధామా లంటే ప్రేమ. వారికి సంబంధం వీనితోడనే గానీ గోపాలునితో ఎంతమాత్రం కాదు. ఇవి మాధుర్యంలో నిస్సంశయంగా గోపాలునికన్న ఎంతోగొప్పవి. కాన గోపికలు సర్వకాల సర్వావస్థలందు సాత్త్వికభావాల సాన్నిధ్యంలో గోపాలనామం చేస్తున్నారు.

"గోపాలా ! గోపాలా !! గోపాలా!!!"

(2) గోపికలో దాస్యరసం - ఉదాహరణ :-

శ్లో॥ శ్యామసుందర తే దాస్యః కరవామ తవోదితం,
దేహి వాసాంసి ధర్మజ్ఞ నోచేద్రాజ్ఞే బ్రువామహే॥
(శ్రీమద్భాగవతం స్కం. 10 - అ 22 - శ్లో 15)

"వస్త్రాపహరణం జరిగినసమయంలో గోపికలు గోపాలుని సవినయంగా ప్రార్థిస్తున్నారు :- ధర్మజ్ఞా ! మేము నీసేవికలం. దయతో మాకు వస్త్రాల్ని దయచేయి."

(3) గోపికలలో సఖ్యరసం :-

మధురరసం అంటేనే సఖ్య - వాత్సల్యరసాలు ప్రధాన అంతర్వాహినులుగా గలదియని గ్రహించాలి. రాసలీల అంటే క్రీడనం, నిర్విరామ క్రీడనం, ఇదేసఖ్యం.

(4) గోపికలలో వాత్సల్యరసం :- ఉదాహరణ :-

శ్లో॥ అహోఽతిధన్యా వ్రజగోరమణ్యః
స్తన్యామృతం పీత మతీవ తే ముదా,
యాసాం విభో వత్సతరాత్మ జాత్మనా
యత్తృప్త యేఽద్యాపి నచాల మధ్వరాః॥
(శ్రీమద్భాగవతం స్కం. 10 - అ 14 - శ్లో 31)

"తమ రసహృదయాన్ని స్తన్యామృతంగా గోపాలున కందించిన ఈగోమాతలు - గోపికలు ఎంతధన్యలు ! ఎంత ధన్యలు !!

(5) గోపికలలో మధురరసం - ఉదాహరణ :-

ఈవాక్యం తప్పు. గోపికలంటేనే మధురరసం. వారికి ఉదహరించదగ్గది మరేదియు లేదు.

శ్లో॥ గోప్యస్తపః కిమచరన్య దముష్యరూపమ్
లావణ్యసార మసమోర్ధ్వ మనన్యసిద్ధం,
దృగ్భిః పిబంత్యనుసవాభి నవం దురాప -
మేకాంత ధామ యశసఃశ్రియ ఐశ్వరస్య॥

(శ్రీమద్భాగవతం స్కం, 10 - అ 44 - శ్లో 14)

ఏమి ఈగోపాలరూపం ! లావణ్యసారం ! ఈజగంలో దీనికి సమానరూపమే లేదు ఇంతకుమించిన సుందర మధుర రూపం మరెక్కడిది ? ఆ గోపికలెంత తపం చేశారో షడైశ్వ ర్యసంపన్నమగు ఈసుందర మధురరూపరసాన్ని నయనపాత్ర లలో నింపుకొని మధుర ప్రవాహంలో మధురప్రవాహ మయి నారు.

ఈవిధంగా ఆమధురానగరస్త్రీలు ఎంతో అసూయా గ్రస్తలు.

మనగోపికలు శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర రసాలకు సఘనప్రవాహాలు. మరి అసూయచెందకుండటం ఎట్లా సాధ్యం ?

  

## రాసలీలా ప్రవేశార్హతలు

ప్రథమసునై భాగవత్ భక్తముఖ్ భాగవత్ వాణీ
దూజే ఆరాధై భక్తివ్యాస్ నవభాతి బఖానీ॥
తృతీయకరే గురుజాని దక్ష సర్వజ్ఞ రసీహో
చౌథే హోహి విరక్తి వసై వనరాజ్ యశీలో॥
పంచమే భూలై దేహసుధి ఛఠే భావనా రాస్ కీ
సాత్ఏ పావై రతిరస్ శ్రీస్వామీ హరిదాస్‌కీ॥

(శ్రీ స్వామీ హరిదాస్‌జీ)

(1) సజ్జనముఖంగా శ్రీమద్భాగవత కథల్ని శ్రవణం చేయాలి. ప్రేమోదయమగు వంతవరకు శ్రవణం చేయాలి. (2) ఆ తరువాత ప్రేమ యుక్తుడై నవవిధ భక్తిమార్గాలతో విష్ణుభగవానుని సేవించాలి.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్॥

(శ్రీమద్భాగవతం.)

నవవిధభక్తులు :- (1) శ్రవణం (2) కీర్తనం (3) స్మరణం (4) పాదసేవనం (5) అర్చనం (6) వందనం (7) దాస్యం (8) సఖ్యం (9) ఆత్మనివేదనం.

శ్లో॥ శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షిదభవద్, వైయాసికిః కీర్తనే,
ప్రహ్లాదఃస్మరణే, తదంఘ్రిభజనే లక్ష్మీః, పృథుఃపూజనే,

అక్రూరస్త్వభివందనే, కపిపతి, ర్దాస్యేऽథ సఖ్యేऽర్జునః;
సర్వస్వాత్మ నివేదనే బలిరభూత్, కృష్ణాప్తి రేషాంపరమ్॥
(భక్తిరసామృతసింధువు.)

నవవిధభక్తులు— ఆదర్శమూర్తులు:- (1) శ్రవణం-పరీక్షిన్మహారాజు. (2) కీర్తనం- శ్రీశుకమహర్షి. (3)స్మరణం-ప్రహ్లాదుడు (4) పాదసేవనం- శ్రీలక్ష్మీదేవి (5) అర్చన-పృథుచక్రవర్తి. (6) వందనం- అక్రూరుడు. (7) దాస్యం-ఆంజనేయుడు. (8) సఖ్యం- అర్జునుడు. (9) ఆత్మనివేదనం-బలిచక్రవర్తి.

(3) నవవిధ భక్తులలో చిత్తవృత్తి చక్కగా లయమవుతుండటం చూచి ఆ తరువాత మాత్రమే శ్రీగురుచరణ కమలాల్ని ఆశ్రయించాలి. ఆధునిక కాలంలో గురువులు ఎక్కువైనారు. మంత్రజాపకులు కూడ ఎక్కువైనారు. లక్ష్యం మాత్రం సిద్ధించటం లేదు. కారణం ఆ గురువులు- శిష్యులు యోగ్యులు కాకపోవటమే నని మాత్రం మరువరాదు. గురువు సమర్థుడు, సర్వజ్ఞుడు మరియు రసికుడై ఉండాలి. శిష్యుడు నవవిధ భక్తులలో రసాస్వాదన చేస్తున్నవాడై ఉండాలి. అప్పుడేమాత్రమే గురుమహారాజ సమాశ్రయం సద్యః ఫలిత ప్రాప్తికి కారణమవుతుంది. వైరాగ్యోదయానికి కారణమవుతుంది. (4) వైరాగ్యోదయం కాగానే శ్రీధామం బృందావనంలో నివసించాలి. (5) అప్పుడు మాత్రమే వైరాగ్యంతో

కూడిన బృందావనవాసం జీవుని దేహోహం భావాన్ని సంహరించి, అతీంద్రియపథగామిగా రూపొందించ గలుగుతుంది.

శ్లో॥ శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్ససుఖీ నరః॥
(భగవద్గీత. అ 5- శ్లో 23.)

శ్లో॥ ప్రజహాతి యదాకామాన్ సర్వాన్పార్థమనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥
(భగవద్గీత. అ 2- శ్లో 55.)

"జీవుడెప్పుడు సుఖిస్తాడు ? ఏకాదశేంద్రియాల్ని నిరోధించినప్పుడు మాత్రమే. సుఖమంటే ఏమిటి ? బ్రహ్మపదార్థమే. అదెక్కడుంటుంది ? ఆత్మదగ్గరుంటుంది, నేను దగ్గరుంటుంది. అదెట్లా లభ్యమవుతుంది ? ఈ ఏకాదశేంద్రియాల్ని విషయాలనుండి మరల్చి ఆత్మాభిముఖం చేసినప్పుడుమాత్రమే "నేను సుఖిస్తున్నాను." నీవు వేరు, సుఖంవేరూ కాదు. నీవు సహజంగా సుఖస్వరూపుడవు. ఆ 'నేను' ను సుఖనిమిత్తం ఇంద్రియాల దగ్గరకు తీసికొనిరావద్దు. నేను చదువుతున్నాను- ఆనందిస్తున్నాను; చూస్తున్నాను - ఆనందిస్తున్నాను; తింటున్నాను - ఆనందిస్తున్నాను; ఈవ్యవహారం నిస్సంశయంగా దుఃఖదాయకం. నరుడా ! నీవు దేనిని సుఖమంటున్నావో అది వాస్తవంలో దుఃఖం. దేనిని దుఃఖమంటున్నావో అదే వాస్తవంలో సుఖం. కాన నరుడా ! సుఖం కావాలంటే

'నేను' అనే కర్తను సుఖస్వరూపమైన ఆత్మయందు లీనం చేయి. 'నేను' బ్రహ్మ- సుఖం బ్రహ్మ- కాన సుఖించేవాడు కూడ బ్రహ్మయే. ఆ బ్రహ్మ ఇంద్రియాలు విషయసంయోగాన్ని పొందినప్పుడుకూడ ప్రకాశిస్తోంది. కాననే జీవుడు కర్మ ప్రవృత్తుడై సుఖజ్ఞానాన్ని పొందగలుగుతున్నాడు. "సర్వస్య చాహం హృది సంనివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ." (భగవద్గీత అ 15 - శ్లో 15). వాస్తవమైన బ్రహ్మస్వరూప జ్ఞానం - సుఖజ్ఞానం అతీంద్రియ స్థితిలోమాత్రమే లభిస్తోంది. ఏల ? 'నేను' ప్రక్కన చేరకపోతే ఈఇంద్రియాలకు విషయాలలో సుఖమేలేదు, ఆ 'నేను' ప్రక్కన చేరకపోతే 'సుఖిస్తున్నా' ననేవాడు లేనేలేడు. కాన నరుడా ! సుఖించాలంటే నీవు నీదగ్గరకే వెళ్ళు. ఇంద్రియాలదగ్గరకు ఎందుకు వస్తావు?"

ఇది గీతాసందేశం. ఎంత అమృతం ? ఎంత స్ఫూర్తి దాయకం !!

ప్రేమికుడు రాసలీలా రసాస్వాదన చేయాలి అంటే దేహోహం భావాన్నుండి ముక్తుడు కావాలి, అతీంద్రియ స్థితిని సాధించాలి. ఇందుకు బృందావననివాసం ఎంతగానో ఉపకరిస్తుంది.

(6) ఇప్పుడు ప్రేమికుడు చిన్మయశరీరంలో ప్రవేశిస్తాడు. ఈస్థితిలో శ్రీప్రియాప్రియతముల ప్రేమకోసం ప్రేమికుడు నిరంతరం విలపించాలి, విహ్వలుడు కావాలి, సర్వకాల

సర్వావస్థలందు రాసవిహారి తనతో రాస చేస్తున్నట్లుగా భావించాలి.

(7) ఫలితంగా ప్రేమికుడు శ్రీకృష్ణపరివారంలో సభ్యుడై రాసలీలా రసాస్వాదనలో రసస్వరూపుడవుతాడు. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు, స్థూలసూక్ష్మకారణ శరీరాలకు, సత్త్వరజస్తమో గుణాలకు సర్వథా అతీతమయినది ఈ రాసలీలా రసం.



## రసాలు - రసికులు

శాంతరసం :- (i) శంకరుడు;

శంకరుడు భగవానుడా? కావచ్చును. వాస్తవంలో శంకరునకు మించిన నామరూపాసక్తుడు మరెవడు? అతడు అనన్య రామభక్తుడు - అనన్య కృష్ణభక్తుడు. ఎంత అనన్య ప్రేమి! ఎంత రసికుడు! "బహ్మాండస్థ జీవులందరు గొప్పవారే - నేనొక్కడనే హీనుడను." ఇది శంకరహృదయం. ఇట్టి హృదయం లేకపోతే రసాస్వాదన లేనేలేదు.

(2) శ్రీ రాముడు;

శ్రీరాముడు భగవానుడా? కావచ్చును. అవతార కాలమున యాతడు కేవలం ధర్మమూర్తి - ధర్మప్రభువు. నామరూపాసక్తికి - కథాశ్రవణాసక్తికి శ్రీరాముడు తనకు తానే సాటి. అయోధ్యలో ఉన్నంతకాలం శ్రీరాముడు వశిష్ఠాది గురువులముఖాన కథాశ్రవణం చేశాడు, ఆ తరువాత మిథిలామార్గాన పయనిస్తూ విశ్వామిత్రునిముఖాన కథాశ్రవణం చేశాడు, అరణ్యవాసకాలంలో ప్రతిమహర్షిని బలవంతం చేసి కథలు చెప్పించుకొన్నాడు. స్వయంగా లక్ష్మణునకు కథలు చెప్పాడు. పట్టాభిషేకానంతరం శ్రీరామునకు కథలు చెప్పాలని, దేవతలు - మహర్షులు అత్యుత్సాహంతో ప్రతి నిత్యం అయోధ్యకు వచ్చేవారు. శ్రీరాముని సాధన అత్యంత మహిమాన్వితం మరియు అందరికి ఆదర్శప్రాయం.

(3) ప్రహ్లాదుడు:

ఇతడు సమస్త భక్తిరసాలకు సజీవమూర్తి. విశ్వస్వరూపునిగా విష్ణుభగవానుని భావించి, సేవించి, ఆ పారవశ్యంలో విహ్వలుడు కావటం, ఇంద్రియాతీతస్థితిలో సర్వాంతర్యామి సాహచర్యసుఖాన్ని నిరంతరం అనుభవించటం ప్రహ్లాదునకు జన్మసహజ ప్రవృత్తి. అయినా భక్తిరసామృతసింధువు ప్రహ్లాదుని స్మరణ భక్తిలోనికిమాత్రమే చేరింది. ప్రహ్లాదునకు యౌవనజీవం భగవానునితో ప్రత్యక్షసంబంధం లేదు. నృసింహమూర్తితో ఆతని సంబంధం చాలా స్వల్పకాలానికి మాత్రమే పరిమిత మయింది. ప్రహ్లాదుని భక్తి విశ్వాత్మ భావనా ప్రధానం. భగవానుడు విశ్వస్వరూపుడు, ఆ విశ్వం ఆత్మస్వరూపం. ఈ మహోజ్జ్వలభావం ఆతనిని త్రికరణాతీతుని కావించేది, ఉన్మత్తుని కావించేది, ఆడించేది, పాడించేది. హిరణ్యకశిపుని అననుకూలతకూడా ప్రహ్లాదుని విశ్వాత్మ భావాన్ని మరింత సుదృఢం చేసింది. ఈ ప్రహ్లాదుని ప్రేమ పరాకాష్ఠస్థితి ఎందరో దైత్య బాలురు ప్రేమ మందారానికి మకరందాలు కావటానికి సహకరించింది. పిశాచావిష్టుడగు మానవుని చేష్ట లెలావుంటాయో ప్రహ్లాదుని సమస్త చేష్టలు అలాగే ఉండేవి. అనురాగపూర్ణనయనాలతో సమస్తేంద్రియ వ్యాపారాల్ని సర్వాంతర్యామికి కైంకర్యంచేసి, పులకిత గాత్రుడై, సర్వకాల సర్వావస్థలందు సాత్త్వికభావాలలో

ప్రవహించేవాడు. సమస్తవిశ్వంలో - ఆత్మలో గోపాలుని దర్శిస్తూ, ప్రేమిస్తూ, ఆ సాహచర్యం నిమిత్తం వ్రజబాలలు నిరంతరం విలపించారు, వివశలయినారు. అయితే ప్రహ్లాదుడు విలపించలేదు. ఆ సాహచర్యసుఖంతో యావజ్జీవం పరవశించాడు. భగవద్దర్శనం ఎట్లా చేయాలి ? ఆ ఆనందం ఎట్లా ఉంటుంది ? భగవానుని రూపమెటువంటిది ? అనే ప్రశ్నలకు అమోఘ సమాధానం ప్రహ్లాదుని జీవితం. ఒకటేమాట ! సమస్తవిశ్వంలో ఈశ్వరుని దర్శించటమే నిజమైన దర్శనం. ఈసమస్తరూపాలు భగవద్విభూతికి ప్రతీకాలు, అనంతరూపిగా కృష్ణదర్శనం చేయుటంవలన కలిగే ఆనందంకూడా నిస్సంశయంగా అనంతం - అగాధం - అమృతం.

శ్లో॥ యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి॥
(భగవద్గీత అ 6 - శ్లో 30)

"అర్జునా ! ఎవడు సమస్తభూతాలలో నా రూపాన్ని చూస్తాడో, నాలో సమస్తభూతాల్ని చూస్తాడో వానికి నేను సదా సన్నిహితునిగా ఉంటాను."

నిజానికి ఇదే ప్రేమపరాకాష్ఠ స్థితి.

ఆ స్థితిలో భగవానుడు దూరంగా ఉంటాడు. భగవదభిన్నమైన సమస్త విశ్వం ప్రత్యక్షంగా ఉంటుంది. ఆ నామ రూప గుణలీలాధామాల అపారమాధుర్యంలో ప్రేమికుడు

అమృతస్వరూపు డవుతాడు. ఎవడు నిజమైన ప్రేమికుడు? సర్వవిశ్వాన్ని ప్రేమించేవాడు, నామరూప గుణలీలాధామాల మాధుర్యంలో జీవించేవాడు మాత్రమే. ఇట్టివానిని స్మరిస్తే చాలును, ఎన్ని యుగాల తరువాతనైనా మానవులు ప్రేమ మూర్తులై తీరుతారు. భగవానునికన్న ఆ నామరూపగుణ లీలాధామాలే కోటిరెట్లు గొప్పవి. భగవానుడు వైకుంఠంలో మాత్రమే ఉండడు, సర్వత్రా ఉంటాడు, స్తంభంలోకూడా ఉంటాడు, ఏరూపంలో ప్రేమిస్తే ఆరూపంతో దర్శనమిస్తాడు. ప్రహ్లాదుడు ఈప్రేమసిద్ధాంతాలకు ప్రాణస్వరూపం. భక్తి రసానికే ప్రాణస్వరూపం. ఆతని ఈహృదయరసవాహినినే మనం 'శాంతం' అంటున్నాం.

శాంతరసానికి ఇతర ఆదర్శమూర్తులు :-

(4) భీష్ముడు, (5) యుధిష్ఠిరుడు, (6) సనకనందన సనత్సుజాత సనత్కుమారులు, (7) సూతశౌనకులు, (8) అంబరీషుడు, (9) అజామిళుడు, (10) ఋషభుడు, (11) జడభరతుడు, (12) ధ్రువుడు.

(2) దాస్యరసం; (1) మదనగోపాలుడు. మదనగోపాలుడు దాసుడు (1) పాండవదర్బారులో, (2) శ్రీరాధారాణి దర్బారులో.

స్వరూపానందం అదేమి ఆనందం? సేవానందమే సర్వోత్తమానందం, ఒకటేమాట! సేవింపబడువాడు గొప్ప

వాడు కానేకాడు, నిస్సంశయంగా సేవించువాడే గొప్పవాడు. గోపాలుడు దాసుడు. దాసనే గొప్పవాడు.

(2) ఆ ది శే ష డు;

ఆ మదనగోపాలుని శయ్యా, ఆసనం, వస్త్రం, పాదుకలు, ఛత్రచామరములు సమస్తం ఆదిశేషుని స్వరూపాలు. ఆతని దాస్యరసహృదయానికి వివిధ సుందర ప్రతీకాలు. ఓహో! ఈ ఆదిశేషుడెంతటి రసికుడు!

శ్లో॥ శయ్యాసన పరీధాన పాదుకాచ్ఛత్ర చామరైః
కిం నా భూస్తస్య కృష్ణస్యమూర్తి భేదైస్తు
మూర్తిషు ॥
(బ్రహ్మాండపురాణం)

(3) శ్రీమహాలక్ష్మి, (4) గజేంద్రుడు, (5) వృత్రాసురుడు, (6) నలకూబర - మణిగ్రీవులు, (7) ఉద్ధవుడు. వీరందరు దాసకోటిలోనివారు.

(3) సఖ్యరసం: సమస్త వ్రజబాలురు

శ్లో॥ ఉవాహ భగవాన్ కృష్ణో శ్రీదామానం పరాజితః,
వృషభం భద్రసేనస్తు ప్రలంబో రోహిణీ సుతమ్॥
(శ్రీమద్భాగవతం, స్కం 10 - అ 18 - శ్లో 24)

"ఆటలాడుకొనే సమయంలో గోపాలుడు ఒకసారి పరాజితుడైనాడు. ఫలితంగా శ్రీదాముని భుజాలపై మోయవలసి వచ్చింది, ఇలాగే భద్రసేనుడు వృషభుని, ప్రలంబుడు బలరాముని మోశారు?

4) వాత్సల్యరసం : యశోదా ప్రభృతి వ్రజబాలలు

శ్లో॥ త్రయ్యా చోపనిషద్భిశ్చ సాంఖ్యయోగైశ్చ సాత్వతైః,
ఉపగీయమాన మాహాత్మ్యం హరిం సాఽమన్యతాత్మజమ్॥

(శ్రీమద్భాగవతం, స్కం 10 - అ 8 - శ్లో 36)

"ఋగ్యజు స్సామవేదాలు శ్రీహరిని "ఇందా"ది స్వరూపా !" అంటూ స్తుతిస్తున్నాయి, ఉపనిషత్తులు 'బ్రహ్మ' అంటూ, సాంఖ్యశాస్త్రం పురుషుడంటూ, యోగ శాస్త్రం 'పరమాత్మ' అంటూ, పాంచరాత్రాగమాలు 'భగవాన్, అంటూ స్తుతిస్తున్నాయి. ఆ భగవానునే యశోద కేవలారతి విశిష్టయై, ఆత్మజునిగా భావిస్తూ, 'గోపాలా!' అని పిలుస్తోంది.

శ్లో॥ తం మత్వాఽత్మజ మవ్యక్తం మర్త్యలింగ మధోక్షజమ్,
గోపికోలూఖలే దామ్నా బబంధ ప్రాకృతం యథా॥

(శ్రీమద్భాగవతం, స్కం 10 - అ 9 - శ్లో 12)

"గోపాలు డెట్టివాడు ? జడేంద్రియాలకు విషయం కానివాడు, అక్షజ జ్ఞానాన్ని అతిక్రమించినవాడు, జీవుల ననుగ్రహించే నిమిత్తమే మానవరూపాన్ని పొందినవాడు. అట్టి గోపాలుని యశోద ప్రాకృతశిశువుగా భావించి రోటితో ఱోటికి కట్టింది."

(5) మధురరసం ; శ్రీరాధికాప్రభృతి వ్రజబాలలు

శ్లో॥ సాచ మేనే తదాత్మానం వరిష్ఠం సర్వయోషితామ్,
హిత్వాగోపీః కామయానా మామసౌభజతే ప్రియః॥
(శ్రీమద్భాగవతం స్కం 10 - అ 30 - శ్లో 36)

"గోపాలుడు తనని ప్రేమించే గోపికలనందర్నీ వదలి, తననే అధికంగా సేవిస్తున్నాడని ఆమె (శ్రీరాధారాణి) గర్వించింది. అందరికన్న తననే శ్రేష్ఠురాలుగా భావించింది."

శ్లో॥ తతో గత్వా వనోద్దేశం దృప్తా కేశవ మబ్రవీత్,
నపారయేఽహం చలితుం నయమాం యత్ర తే మనః॥
(శ్రీమద్భాగవతం స్కం 10 - అ 30 - శ్లో 37)

గర్వవతీ శ్రీరాధారాణి గోపాలుని శాసిస్తోంది; "ఏమైనాసరే గోపాలా! ఇంక నేనొక్క అడుగయిన ముందుకు వేయలేను. నన్ను నాకు మనసయినప్రదేశానికి తీసికొని వెళ్ళు."

శ్లో॥ ఏవముక్తః ప్రియమాహ స్కంధమారుహ్యతామితి,
తతశ్చాంతర్దధేకృష్ణ స్సావధూ రన్వతప్యత॥
(శ్రీమద్భాగవతం స్కం 10 - అ 30 - శ్లో 38)

"తనభుజాలపై ఎక్కవలసినదిగా అప్పుడు గోపాలుడు శ్రీరాధారాణితో పలికాడు, అదృశ్యమయినాడు. అది చూసి శ్రీరాధారాణి విరహవిహ్వల అయింది."

సఖ్య, వాత్సల్య, మాధుర్యాలు ఈదిగువమూడురసాలకు వీరికి వీరేసాటి. మరొకరిపేరు చెపితే, అది వీరిని తక్కువ

చేయటమే అవుతుంది. "అలాకాదు, చెప్పితీరాలంటారా, అయితే వినండి, శ్రద్ధగా వినండి."

"అస్మత్ప్రభృతి వర్తమానకాలీన సమస్తభక్తజనం."

"భాగవతరసం" గ్రంథం సర్వం సమాప్తం.

శ్రీకృష్ణార్పణమస్తు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



భోగిపండుగ సందర్భమున

ఆధ్యాత్మిక నాటిక

# గోపికా భక్తి

రచన : శ్రీమతి హరి అన్నపూర్ణ

గోపికలు శ్రీకృష్ణుని విగ్రహమునకు భోగిపండ్లు పోయుట.

[రాధాసమేతా కృష్ణా] వలె

పల్లవి భోగీ పండ్లూ పోతుమూ కృష్ణా! ॥భోగీ॥
బాలుడవీవా బ్రహ్మకన్నయ్యా
చిన్నికన్నయ్యా ఓ నల్లనయ్యా ॥భోగీ॥

(1) రాధికలోలా రవ్వేసీకేలా
శ్రీధరబాలా! చిలిపిగోపాలా
మధురహృదయ మామనవి వినవేలా ॥భోగీ॥

(2) కనకపు పళ్లెరములో కాసులు పోసీ
సెనగలు రేగూ పండ్లను చేర్చి
మనసారగ మా భాగ్యఫలమనీ ॥భోగీ॥

లలిత : ఏమే విశాఖా! ఎంతకాలమే యీ బొమ్మలతో ఆట, శీఘ్రమే శ్రీకృష్ణపరమాత్మను భర్తగా పొందుటకు ఏదైనా వ్రతము చేదామే.

విశాఖ : అదిగో ! అల్లంతదూరములో, మహర్షి ధ్యాన నిష్ఠలో ఉన్నారు. మనమందరము వెళ్ళి, సాష్టాంగ

నమస్కారములు చేసి, భక్తితో ప్రార్థన చేదాము. శ్రీకృష్ణపరమాత్మను పొందేమార్గము తప్పక చెప్ప గలరు. ఏదైననూ సద్గురు ముఖతః రానిదే సత్ఫలితముల నీయజాలదు.

లలిత : అట్లే చేయుదము.

శ్లో॥ స్వామి! నమస్తే, నతలోకబంధో
కారుణ్యసింధో ! పతితంభవాబ్ధౌ
మాముద్ధరాత్మీయ ! కటాక్షదృష్ట్యా
ఋజ్వాదికారుణ్య ! సుధాభివృష్ట్యా.

గోపికలు : హేమహర్షి ! గోలోకనాథుడు, గోపాలుడు, మాకు నాథుడు అయ్యే ఉపాయము ఏదైనా చెప్పండి.

మహర్షి : ఉపాయములతో వశమయ్యేవాడు కాడువాడు, ఆ గోపాలుడు.

పల్లవి తరువ తరువంగపుట్టును, తరులనగ్ని
తరువ తరువంగపుట్టును
దధిని ఘృతము తనువు నారీతి తరచి,
నా తత్వమెరిగి
నిత్యమును, నీవు సుఖయింపు, నిర్మలాత్మా !
అన్నారు, మన పెద్దలు.

కష్టెలలోని అగ్ని, మథించి తేగాని, బయట పడదు. పెరుగును చిలికి తేగాని వెన్న కనపడదు,

అలాగే, యీశరీరమును వాక్కును, బుద్ధిని, తపింప చెయ్యాలి. శరీరముతో చేసే ప్రతిమంచిపని బుద్ధిని, ప్రపంచాన్నిగూడా, సంస్కరిస్తుంది. దీనినే యజ్ఞ మంటారు. (యజ్ఞోవై విష్ణుః) అని శ్రుతి. నిద్రలేచి నది మొదలు మరల నిద్రించువరకుచేసే, ప్రతిపని యజ్ఞంగాచేసి, దానిని భగవదర్పితము, చేసిననే గానీ హృదయములోని పరమాత్మ ప్రత్యక్షము కాడు. దీనినే, ప్రహ్లాదుడు 'నీయధీనములుగా, నిఖిల కృత్యంబులూ, ప్రియభావమున సమర్పింపడేని' అని చెప్పినాడు. కనుక అనుష్ఠానం చాలాముఖ్యం. హృదయములో ప్రేమ ఉండాలి. దానిని శరీరము ద్వారా తెలియపరచాలి.

గోపికలు : దానిని శరీరముద్వారా తెలియపరచటము ఎట్లాగో మీరేచెప్పాలి. మిమ్ము శరణుజొచ్చితిమి. శ్రీకృష్ణ పరమాత్మను పొందే మార్గము చెప్పుటకు, మీకన్న మాకు దిక్కెవరూ లేరు. మాహృదయము ఆ పర మాత్మకొరకు ఎంత ఆరాటపడుతున్నదో గ్రహించి, మాయందు దయయుంచి వెంటనే చెప్పండి. ఆ మార్గము ఎంతకష్టమైనాసరే శరీరకష్టము లెక్క చేయక వెంటనే ఆచరించి ఆ పరమాత్మను పొందు తాము.

మంజుల : మీ హృదయములు శ్రీకృష్ణప్రేమతో నిండి ఉన్నాయి. నేను గ్రహించాను. మీరు ఏమంత కష్టపడనక్కరలేదు. అంతటా నిండిఉన్నప్పటికి ఆ పరమాత్మ

శ్లో॥ తులసికావనం యత్రి । యత్ర పద్మవనానిచ
సాలగ్రామ శిలాయత్రి। తత్రి సన్నిహితో హరిః.

తులసీవనమున, పద్మవనమున, సాలగ్రామ శిలయందున ఆ భగవానుడు వెంటనే దర్శన మిస్తాడు. తులసి, పద్మము, గోమయము, రేగు పండ్లు లక్ష్మిస్వరూపములు, అందువలన తులసీవన ములో, పంచరంగుల పద్మములు పెట్టి, గోమయ ముతో గొబ్బిళ్ళు పెట్టి లక్ష్మిని, కాత్యాయనీ వ్రతముచేసి గౌరిని పూజించండి. నేను చెప్పినట్లు చేసిన వెంటనే శ్రీకృష్ణపరమాత్మ ప్రత్యక్షమా తాడు. మిమ్ములను ఆదర్శముగా పెట్టుకొని, యీ వ్రతములను చేసిన స్త్రీలందరు గోపికలే. వారంద రికి గోపాలుడు ప్రియుడే కాగలడు. ఒకటి హృద యములో ప్రేమ, రెండు వాక్కుతో కీర్తన, మూడు శరీరముతో స్నానము, పూజ, జపము యీవిధముగా త్రికరణములను, భగవత్పరము చేసినచో శ్రీకృష్ణపరమాత్మ వెంటనే ప్రత్యక్షమై మీకు భర్త కాగలడు.

గోపికలు : ధన్యులము స్వామి ధన్యులము. మీ ఆజ్ఞను శిరసా వహించెదము గాక.

గొబ్బితట్టుచు పాడు పాట

(అన్నా అన్నా విన్నావా) వలె

పల్లవి : రారే రారే వేగమే! రమణులంతా రారేమే
గొబ్బితట్టి యీవేళ! గోవిందుని కనుకొందాము
॥రారే॥

(1) చ. ఎన్నో జన్మల నోచిన నోముల ఫల మీ
జన్మను పండెనసీ
పరమాత్మునకూ యీ వేళా ! పాదపూజలే
చేదాము ॥రారే॥

(2) పలుకు పలుకునా అమృతము లొలికే।
పరమాత్ముని కృపగందాము
పరమాత్ముని కృపగందాము! పరమ పదమ్మును
గందాము ॥రారే॥

(3) సాగరశయనుని సరసిజనాభుని! చరణయుగళమే
మదినమ్మి
సంకల్పములా వదలీ హృదయూ! సరసిని,
నిలుపుకుందాము ॥రారే॥

విశాఖ : ప్రియసఖీ లలితా ! గోవిందుడు రాలేదు ఏమి చేదామే !

లలిత : మానసచోరుడు వచ్చేవరకు మనసునిలిపి మధుర గీతములు పాడుతూ గొబ్బెళ్లు తట్టుతూనే ఉందాము. మహర్షి చెప్పినారు గదా గోమయముతో గొబ్బిళ్లుచేసి లక్ష్మిని ఆరాధించితే గోవిందుడు తప్పక వచ్చునని, మహర్షి వాక్కు ఎప్పటికివృధా పోదు.

(తాండావాకేళి సల్పెను) వలె

పల్లవి : గొబ్బెళ్ళు తట్టగా రారే ॥గోపికలారా॥
గోవిందుని పొందగా రారే ॥గో॥

(1) చ. పసుపు పారాణీలు పెట్టీ ! పట్టుపీతాంబరములె కట్టి
వెనుక చింతలుకట్టీ పెట్టీ ! వేదాంత వీధులు చుట్టి
॥గో॥

(2) హృదయాధి నాధున కిపుడు !
హృదయసింహాసనమే వేసి
మధుర మధుర భావములతో !
మరీ మరీ మరి మదిరంజిల్లగా ॥గో॥

(రాజమండ్రి మ్యూజియంలోను
జామపండు పండిందట) వలె

గోపికలు : గొబ్బియెళ్ళో ! ఆట ఆట ఆడుదామె !
ఏమి ఆట ఆడుదామె
కృష్ణ లీల లాడుదామె ! గోలోక గోపికలార
గోపీ కన్యకలార ! గొబ్బితట్ట రారేమే ॥గో॥

(2) గొబ్బి యెళ్ళో లీల లీల చేయుదామె ।
ఏమి లీల చేయుదామె
రాసలీల చేయుదామె ।

కన్య కన్య మధ్యలోన, కృష్ణుడొచ్చి నిలుచునట
వేణుగానం చేయునట । గోలోక గోపికలార
గోపీ కన్యకలార । గొబ్బితట్ట రారేమే ॥గో॥

(3) గొబ్బియెళ్ళో భక్తి భక్తి చేయుదామె
ఏమి భక్తి చేయుదామె । కృష్ణభక్తి చేయుదామె
గోలోక కృష్ణుడొచ్చి ! గోపీకన్యలకు
తానే వరుడు అవుతాడట ! గోలోక గోపికలారా
గోపీ కన్యకలార ! గొబ్బితట్ట రారేమే ॥గో॥

లలిత : ఏమే విశాఖా । మదనమోహనుడు మన మొరా
లించినట్లులేదే మనకింకేది గతి.

పల్లవి : వినతా సుతవాహనుడై వెడలె వలె.
హరి కాజోంజిరాగం – ఆదితాళం.
ఏదీ మనకిక ఏదీ దాకి ఏదీ, హృదయేశునిగన ॥ఏదీ॥

పల్లవి : పతిత పావనా ! పాపవినాశన ! కరుణాసాగరుడం
దురు ఏడీ ॥ఏదీ॥

చరణం : అనుదినమూ శ్రీహరికృష్ణాయనీ
ఆశ్రయించితిమి ! ఆదరించుననీ

ఆశలన్నీ అడి । ఆశలై పోయే
ఆశ్రితవత్సలుడూ రాడాయే ॥ఏ॥

వచనం : పతితపావనుడు, కరుణాసాగరుడు ఇవన్నీ మనబోటి అమాయకులను మోసపుచ్చుటకు, వ్యాసుడు పుక్కిటి పురాణములలో వ్రాసిపెట్టిన హుళక్కి వ్రాతలని నాకిప్పటికి బాగా తెలిసిపోయింది.

మంజుల : పోను పోను నీకు మతిగూడా పోతున్నట్టుందే, లలితా.

లలిత : వాడిని మానసచోరుడన్నారు గానీ, ఒక్క మన సుతో తృప్తిపడతాడా వాడు. ఆలుబిడ్డలను, అష్టైశ్వర్యములను వదలిపెట్టి అరణ్యములపాలై రాజాధిరాజులు సహితము వాడికోసం ఎట్లా తపిస్తున్నారో చూడు. ఏగ్రహమైనా పడితే ఎంత డబ్బైనా ఖర్చుపెట్టి వదల్చుకోవచ్చుగానీ, యీ నల్లగ్రహం పడితేమాత్రం జన్మజన్మాలకు వదల్చుకోలేము.

పాట

ఎన్ని దినములు ! ఎన్ని జన్మములు ! అందనిపండుకు !
ఆశలు ఎందుకు
గ్రన్ననవానిని వదలుద మన్నను ! వశపడనీయడు
ధూర్త గోపాలుడు ॥ఏ॥

మంజుల : ఇదినీకు ఒక్కతెకు పట్టినగ్రహం కాదు. మన అందరికి పట్టింది. ఒకరికొకరు ధైర్యం చెప్పుకోవాలి. అంతకన్న చేసేదేముంది. మిగతాగ్రహములు పాపఫలితంగా పడతాయి. ఈ నల్లగ్రహం మాత్రం, తల్లక్రిందులుగా తపస్సుచేసినా పట్టదు. అనేకజన్మల సుకృతం వుండాలి.

లలిత : అనేకజన్మల సుకృతమే యీ రూపంగా పరిణమించింది. కనిపిస్తూనే ఉంది, సుకృతం. మనలో మాట. మనం రెండుపూటలా కడుపునిండా అన్నం తిని ఎంతకాలమయిందో నువ్వే చెప్పు. నిద్రసంగతి చెప్పనక్కరయే లేదుకదా. కడుపునిండితే కదా కంటినిండా నిద్రవచ్చుటకు. నిద్రాహారములే లేనపుడు, మిగతా విషయములసంగతి చెప్పేదేముంది.

పాట

అనయము వానిని నమ్మినందులకు
ఆపదలే మనకాశ్రయ మాయే
ఇహము, పరము మనకేదిలేదాయే
వందిత పదములు కననీడాయే ॥అ॥

మంజుల : అట్లా తొందరపడి, మన జీవనాధారం, మనపెన్నిధి మన హృదయనాథుని, అట్లా నిందిస్తే ఏమి లాభం చెప్పు. దేనికైనా సమయము రావాలి.

లలిత : అవునవును.

పాట

కామిత ఫలదాయకుడని నమ్మి,
కరము వేడితిమి కరుగదాయె
కాలము ఖర్మము కలసివచ్చినచో,
కావగ వచ్చువ కరుణానిధినని ॥వ॥

లలిత : కాలము కర్మము కలసివచ్చినప్పుడు, ఆయనగారు దిగుతారన్న మాట నేనూ కరుణానిధినని, అంతేనా.

మంజుల : నువ్వు అట్లా మాట్లాడితేనే నేం చెప్పలేను. కానీ, నీ మనసును స్థిమితం చేసుకుని, నేనొక్కమాట చెప్తాను విను. తరువాత నీ ఇష్టం.

నీగోడు చూస్తూ ఉంటే, నల్లరాళ్ళు సహితం కరుగుతున్నాయి. ఇక ఆ కరుణాకరుడు రాకుండా ఒక్క క్షణం ఉండలేడు.

ఫలవృక్షము, ఇక పళ్ళు వస్తాయని, పువ్వుల ద్వారా, ఎట్లా తెలియపరుస్తుందో, అట్లాగే, ఆ పరమాత్ముని రాకను నీ ఆర్తి, తెలియపరుస్తోంది. ఆనాడు అడవిమృగమైన, ఆగజేంద్రుడు ఆర్తితో

పద్యం

నీవే తప్ప నితఃపరం బెరుగ, మన్నింపదగున్
దీనునిన్
రావే యీశ్వర కావవే, వరద సంరక్షింపు
భద్రాత్మకా, అని మొరపెట్టగానే;

పరుగు పరుగున, వచ్చి పాలించిన ఆ పరమాత్మ మనమందరము కలసి ఆర్తితో మొరపెడితే, రాకుండా ఎట్లా ఉండగలడు. తప్పక వస్తాడు. ముమ్మాటికి తప్పకుండా వస్తాడని నా హృదయము చెపుతోంది.

లలిత : అవునే మంజులా ! నీమాటలు వింటూ ఉంటే నాకు మళ్లా ఆశ కలుగుతోంది. మన మందరము కలిసి ఆర్తితో ప్రార్థన చేదాము.

పిలువకురా - అలుగకురా వలె

పల్లవి : మొర వినరా ! దయగనరా ! మోహన మురళీ వినరా
ముద్దుల మోమును కననీరా ॥మొ॥

(1) కననిమ్మా, నీ కరుణామృతము
వినవిమ్మా నీ వాగమృతము
మననిమ్మా నీ భక్తిని గ్రోలి
ఇతరము లొల్లను కృష్ణ మురారీ ॥మొ॥

(2) గోవర్ధన గిరిధారీ మురారీ
గోపీ మానస చోరా కంసారీ
గోకుల బృందావన సంచారీ
మా హృదినిల్వర కృష్ణమురారీ ॥మొ॥

(3) చ. వందన శతములా అందుకో రారా
వందిత పదములూ కననీవేరా
ఇందిరలోలా సుందర కారా
మా హృది నిల్వర నందకిశోరా ॥మొ॥

(4) చ. శిరమున కేకీ పింఛము మెరయ
యురమున కౌస్తుభ । మణియు మెరయ
కరముల మురళీ । ధగ ధగ మెరయా
మా హృది మెరయర । మేమూ మురియా ॥మొ॥

శ్రీకృష్ణసాక్షాత్కారము

గోపికలు : శ్రీకృష్ణపరమాత్మకు జై. సాష్టాంగనమస్కారము చేయుదురు.

మంజులా ! మనమిందాక తులసీవనములో కట్టిన సుందర తులసీదామ మిటు తెమ్మా. మనజన్మను పావనము చేయనే తెంచిన జగన్నాథుని కంఠమున వేసి కృతకృత్యులమౌదాము.

పాట. రావోయి చందమామ వలె
శ్రీకృష్ణవందనమ్మ ! మా మనవిసుంత
వినుమా ॥శ్రీ॥

(1) చ. న ద యశోదా నందా ! ముని సేవిత పాదముకుందా
స్వరూపానందా నందా ! సత్యజ్ఞానానందా ॥శ్రీ॥

(2) కనులు నీమూర్తినికనగా
వీనులు నీ కథ వినగా

కరములు నీపూజకుగా
కరుణతో చేకొను కృష్ణా ॥శ్రీ॥

(3) వాక్కును నీ వర్ణనకూ
బుద్ధిని ధ్యానంబునకూ
మనసు నీ పదముల చెంతా
మాధవ నిల్పుము దయతో ॥శ్రీ॥

(4) ధ్యానం తవపద ధ్యానం ! నిరంతరము నీ ధ్యానం
పరమపద సోపానం ! ప్రభువా దయచేయగదే !

## నీ వేనా నను తలచినది వలె

కృష్ణుడు : మీరేలా నను పిలిచితిరి
మీరేలా నను తలచితిరి
మీరేలా నను ఆపైనుండి
యీక్రిందికి యిటు దించితిరి ॥మీరేలా॥

గోపికలు : గోపాలాయని పిలిచినది
గోవిందాయని తలచినది
గోపీమానసచోరుని కొరకే
అహరహమూ తపియించినది ॥గోపాలా॥

కృష్ణుడు : వచ్చితిని గదా
ప్రియులారా ! నన్నెందుకు పిలిచినారు ?

గోపికలు : గోలోకనాథుని గోపీనాథునిగా చేసికొనుటకు.

కృష్ణుడు : గోలోకనాథుడు మరి నల్లనివాడే, అదీగాక అల్లరి చిల్లరివాడుగూడాను, అది మీకు తెలుసా?

గోపికలు : ఓ మాకు బాగా తెలుసు. ఆ అల్లరివాని సంగతి మేము బాగా తెలుసుకునే ఆమన్మథ మన్మథుని ఆరాధాలోలుని మా మానసచోరుని, యీమాధవుని భర్తగాకోరి ఎన్నోనోములు, ఎన్నోవ్రతములు, ఎంతోదీక్షగా నిద్రాహారములు వదలి మరీ చేసితిమి.

కృష్ణుడు : అయితేవాడు ఎక్కడఉన్నాడని మీ తపస్సు ?

గోపికలు : ఏమో అదంతా మాకు తెలియదు.

కృష్ణుడు : అయితే, నేను చెప్తాను వినండి. అంతటా నిండిన ఆ పరమాత్మ, మీఅందరి హృదయములలో ఆత్మారాముడుగా ఉన్నాడు. జ్ఞానదృష్టితో చూడండి. అనుసంధానముచేసి ఆనందించండి.

గోపికలు : జ్ఞానదృష్టి అంటే ఏమిటో, ఆత్మారాముడు అంటే ఏమిటో అదిమాకు అక్కరలేదు. మాకు కావలసినది మురళీమోహనరూపం. కన్నుమూసినా, తెరచినా, రాత్రింబవళ్లు మాప్రాణనాథుడు మాకు కనిపించుతూ ఉండాలి. ఒక్కక్షణం కనిపించకపోతే మా ప్రాణాలు ఎగిరిపోతాయి.

## నీవేనా నను తలచినది వలె

గోపికలు : మనసును నీపై నిలిపినది
మధురగీతములు పాడినది
మాధవ నీ దరిశనమున కనియే
మరి మరి నిరీక్షించినది ॥గోపాలా॥

కృష్ణుడు : మెచ్చితి భక్తికి ప్రియులారా
ఇచ్చెద వరములు ప్రియమారా
వచ్చినవాడూ అన్నపూర్ణనుతు
డాశ్రితులా సొమ్మని నమ్మండి
ముమ్మాటికి యిది నిజమండి ॥నమ్మండి॥

తథాస్తు మీకోరికే నెరవేరుగాక.
ఈరోజు మొదలు, భక్తులు, జ్ఞానులు, ఒకరేమిటి, ఆబాలగోపాలం నన్ను హే గోపీనాథా ! అని పిలచెదరు గాక. గోపికా భక్తియే భక్తియని, భక్తికి ఆదర్శముగా మిమ్ములను తీసుకొందురు గాక.

గోపికలు : ధన్యోస్మి ! ధన్యోస్మి ! మాతపస్సు ఫలించింది. మాభాగ్యము పండింది. మాజన్మతరించింది. మా వ్రతఫలితము వెంటనే కనిపించింది.

## అందమె ఆనందం వలె

పల్లవి : మధురాతీ మధురం । మాధుర్యమె మాధవ నీ
రూపం ॥మ॥

(1) ప. కృష్ణా నీ అందమె మధురం । కృష్ణా నీ చందమె
మధురం
మధురం । చందన చర్చిత ! వందిత పాదార
విందమె మధురం ॥మ॥

(2) కృష్ణా నీ చరితమె మధురం । కృష్ణా నీ చరణమె
మధురం
మధురం । అభయం మధురం । అభయ మొసంగే
హస్తమె మధురం ॥మ॥

(3) కృష్ణా నీ ఆటే మధురం । కృష్ణా నీ పాటే
మధురం
మధురం । మాటే మధురం । నాట్యముచేసే
చోటే మధురం ॥మ॥

(4) కృష్ణా నీ కలిమే మధురం । కృష్ణా
నీ బలిమే మధురం
మధురం ! మదిలో కలిగి । మధురం పలికే
చెలిమే మధురం ॥మ॥

(5) కృష్ణా నీ భక్తే మధురం కృష్ణా । నీ అనురక్తే
మధురం

మధురం । ముక్తే మధురం । నీ నామామృత
భుక్తే మధురం ॥మ॥

5) కృష్ణా నీ జపమే మధురం । కృష్ణా నీ తపమే
మధురం
మధురం । ధ్యానమే మధురం నీ గీతామృత
పానమె మధురం ॥మ॥

7) కృష్ణా నీ వదనమె మధురం । కృష్ణా నీ అధరమె
మధురం
మధురం । హృదయం మధురం । హృదయాధి
పతే రఖిలం మధురం ॥మ॥

8) మన్మథ కోటి ప్రకాశం । మది నిలిపిన
హృదయవికాసం
హాసం । భువన ప్రకాశం । భక్తుల హృదయ
నివాసరూపం ॥మ॥

(గోపికలు పై పాట పాడుతూ కృష్ణునిచుట్టూ తిరుగుదురు)

భాగవతములో ఉద్ధవుడు గోపికలభక్తిని
యీ విధముగా గానం చేసెను.

శ్లో॥ వందే నంద వ్రజస్త్రీణాం । పాదరేణు మభీక్ష్ణశః
యాసాం హరి కథోద్గీతం । పునాతి భువనత్రయమ్॥

కన్యలు గోపికలవంటి, లేదా గోదాదేవివంటి భక్తితో గొబ్బి ఆరాధన చేసినచో, గోవిందుడే భర్త కాగలడు. కొంచెము భక్తి లోపించినను, గోవిందునివంటి భర్త రాగలడు.

కన్యలే కాక, స్త్రీలందరు గొబ్బెమ్మనుపూజలో పెట్టుకొని పూజింపవచ్చును. అట్లుచేసినచో గోలోక నివాసిను లగుదురు.

సంపూర్ణం.



# శ్రీ రాధాకృపాకటాక్ష స్తోత్రం

శ్లో॥ రాధా రాసేశ్వరీ రమ్యా కృష్ణ మంత్రాధి దేవతా,
సర్వాద్యా సర్వవంద్యాచ బృందావన విహారిణీ॥ 1

మునీంద్రబృందవందితే! త్రిలోక శోకహారిణి
ప్రసన్నవక్త్రపంకజే నికుంజ భూవిలాసిని
వ్రజేంద్రభానునందని వ్రజేంద్రసూను సంగతే
కదాకరిష్యసీహమాం కృపాకటాక్ష భాజనమ్॥ 2

అశోకవృక్షవల్లరీ వితానమండపస్థితే
ప్రవాళజంబు పల్లవ ప్రభారుణాంఘ్రి కోమలే
వరాభయస్ఫురత్కరే ప్రభూతసంపదాలయే
కదాకరిష్య సీహమాం కృపాకటాక్ష భాజనమ్॥ 2

అనంగరంగమంగళ ప్రసంగభంగ సంభ్రమం
సువిభ్రమం సుసంభ్రమం దృగన్త బాణపాతనైః
నిరంతరం వశీకృత ప్రతీత నందనందనే
కదాకరిష్య సీహమాం కృపాకటాక్ష భాజనమ్॥ 3

తటిత్సువర్ణ చంపక ప్రదీప్త గౌరవిగ్రహే
ముఖప్రభా పరాన్త కోటి శారదేందు మండలే
విచిత్రచిత్ర సంచరే చకోర సాంబలోచనే
కదాకరిష్య సీహమాం కృపాకటాక్ష భాజనమ్॥ 4

మదోన్మదాది యౌవనే ప్రమోదమాన మండితే
ప్రియానురాగ రంజితే కళావిలాస పండితే

అనన్యదన్య కుంజరాజ కామకేళి కోవిదే
కదాకరిష్య సీహమాం కృపాకటాక్ష భాజనమ్॥

అశేష హావభావధీర హీరహార భూషితే
ప్రభూతశాంత సుంభకుంభికుంభ సుస్తనీ
ప్రశస్తమందహాస చూర్ణపూర్ణ సౌఖ్యసాగరే
కదా కరిష్యసీహమాం కృపాకటాక్ష భాజనమ్॥

మృణాలజాలవల్లరీ తరంగ రంగ దోర్లతే
లతాగ్రలాస్య లోల నీలలోచనావలోకనే
ల, ల, ల్లు, ల, లి, ల, న్మనోజ్ఞ ముగ్ధమోహనాశ్రయే
కదా కరిష్యసీహమాం కృపాకటాక్ష భాజనమ్॥

సువర్ణ మాలికాంచితే త్రిరేఖకంబు కంఠగే
త్రిసూత్ర మంగళే గుణత్రిరత్న దీప్తిదీధితే
సులోల నీలకుంతలే ప్రసూన గుచ్ఛ గుంభితే
కదాకరిష్య సీహమాం కృపాకటాక్ష భాజనమ్॥

నితంబ బింబలంబమాన పుష్పమేఖలాగుణే
ప్రశస్త రత్నకింకిణీ కలాప మధ్యమంజులే
కరీంద్రశుండ దండికావరోహ సౌభగోరుకే
కదా కరిష్యసీహమాం కృపాకటాక్ష భాజనమ్॥

అనేక మంత్రనాదమంజు నూపురా రవత్క్వచిత్
సమాజరాజహంస వంశ నిక్వణాతి గౌర వే

విలోల హేమవల్లరీ విడంబి చారుచఙ్క్రమే
కదాకరిష్య సీహమాం కృపాకటాక్ష భాజనమ్॥ 10
అనంతకోటి విష్ణులోక నమ్రపద్మజార్చితే
హిమాద్రిజా, పులోమజా, విరించిజా, వరప్రదే
అపారసిద్ధివృద్ధి దిగ్ధ సత్పదాంగులీయకే
కదా కరిష్యసీహమాం కృపాకటాక్ష భాజనమ్॥ 11
మఖేశ్వరీ క్రియేశ్వరీ స్వదేశ్వరీ సురేశ్వరీ
త్రివేదభారతీశ్వరీ ప్రమాణ శాసనేశ్వరీ
రమేశ్వరీ క్షమేశ్వరీ ప్రమోద కాననేశ్వరీ
కదాకరిష్య సీహమాం కృపాకటాక్ష భాజనమ్॥ 12

ఫలశ్రుతి :—

ఇతేదమద్భుత స్తవం విశమ్య భానునందనీ
కరోతు సంతతం జనం కృపాకటాక్ష భాజనమ్॥
భవేత్తదైవ సంచిత త్రిరూప కర్మనాశనం
లభేత్తదా వ్రజేంద్రసూను మంగళ ప్రవేశనమ్॥ 13

"భక్తులారా! మీరు ఆగామి, సంచిత, ప్రారబ్ధకర్మల నుంచి ముక్తులు కాగోరుచున్నారా? రాధాకృపాకటాక్ష పాత్రులు కాగోరుచున్నారా? శ్రీకృష్ణప్రేమ తృష్ణతో విలపిస్తున్నారా?"

అయితే ఈ రాధాకృపాకటాక్ష స్తోత్రం పారాయణ చేయండి.

"రాధే! నీకృపాకటాక్షం లభించే దెప్పుడు ?"

సమాప్తం.

## పా ట

(అందమె ఆనందం వలె)

పల్లవి : చూపే ఆనందం కృష్ణా నీ ప్రాపే ఆనందం
ఆనందమెకృష్ణ నీ అనురాగామృత ॥చూపే॥

(1) కరుణామృతమును ఒలికే కృష్ణ ప్రేమామృతమును చిలికే
పలికే అమృతములొలికే ఆనందామృత అశ్రువు
లొలికే ॥చూపే॥

(2) బోధామృతమును కురిసే కృష్ణహృదయకవాటము
తెరిచే

విరిసేజ్ఞానము విరిసే వెన్నెల విరిసేకన్నుల మెరిసే ॥చూపే॥

(3) మదిలోపలుకులు పలికే నాయెదలో యెరుకలు
తెలిపే

ఒలికేకళలను ఒలికేచిలిపిని చిలికేచిందులు
త్రొక్కే ॥చూపే॥

(4) భక్తులభ్రమ తొలగించే ముక్తికాంతలు మీారనిపించే
పించే మైమరపించే అంతా నేననిపించే ॥చూపే॥

(5) ప్రియులను పిలిచీయిచ్చే కృష్ణమెచ్చి వరములనిచ్చే
ఇచ్చేఅనుభవమిచ్చేఅద్వైతామృతఅనుభవమిచ్చే॥చూపే॥

(పై దానివలె)

పల్లవి : అందరికానందం। ఆనందమె కృష్ణా నీ అందం ॥అం॥

అ॥ప : మన్మథకోటి ప్రకాశం। మదినిలిపిన హృదయ
వికాసం
హాసం భువనప్రకాశం జ్ఞానప్రకాశం జ్యోతి
ప్రకాశం ॥అం॥

చ॥ నవమోహన సుందరరూపం। మురళీమోహన
రూపం
చెలిరాధతో.....చెలిరాధతో వెలిగే నీఅందం
హృదయానందం బ్రహ్మానందం ॥అం॥

— హరి అన్నపూర్ణ



# "ఈ పుస్తకం సూండి"

1. "ఉత్సాహవంతులైన భక్తజనులు గోపాలుని భర్తగా, పుత్రునిగా, హితకారిగా, సోదరునిగా, జనకునిగా, మిత్రునిగా భావించి ధ్యానించాలి."

2. "ఇంకా సావయవం కాని మూలాన్ని "తత్త్వ" మంటారు. అంటే ఆభరణాలరూపంపొందని స్వర్ణం తత్త్వ మన్నమాట. శృంగారరసంకూడ తత్త్వమే. అది సగుణ— నిర్గుణాలకు అతీతం. సగుణం మరియు నిర్గుణం, అదే శ్రీరాధా కృష్ణులు, మరియు గోపికలు. అది భగవదభిన్న శృంగారరసం."

3. "విరహంలో అప్రాప్తి- దుఃఖం- అదర్శనం లేనే లేవు. ప్రాప్తికి యథార్థమయిన అర్థంతన్మయత,మనోవాకా్కయాలు విహ్వలాలు కావాలి, ఆకలి కళ్ళల్లో ప్రకటంకావాలి, అప్పుడే భాగవతంలోని రసం ఈ త్రికరణాలలో ప్రవహిస్తుంది."

— గ్రంథకర్త.

